# సప్తశతీ భాష్యము

భాష్యకర్త : డా॥ క్రోవి పార్థసారథి



బాలసరస్వతీ బుక్ డిపో.,
(రిజిస్టర్డు) ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్
4, సుంకురామశెట్టి వీధి, చెన్నై - 600 001
ఫోన్ : 25389868

 2005 వెల రూ. 60/-

# ప్రణతులు

లోకంలో కష్టాలు కలిగినప్పుడూ, బాధలు కలిగి నప్పుడూ మంత్రశాస్త్రంలో అందునా శ్రీవిద్యలో ప్రవేశమున్న వారంతా 'సప్తశతి' పారాయణ చేస్తుంటారు. చెయ్యటం రాకపోతే ఎవరితోనైనా చేయిస్తుంటారు. సప్తశతి పారాయణచేసినట్లైతే కష్టాలు తొలగిపోయి సుఖశాంతులతో వర్ధిల్లుతారనేది అక్షరసత్యం.

దేవీనవరాత్రులలో గాని, ముఖ్యమైన ఇతర దినాలలోగాని సప్తశతి హోమంకూడా చేస్తారు. ఇది సర్వకార్యసిద్ధి. అయితే సప్తశతి అంటే ఏమిటి? అందులో ఏం చెప్పబడింది? అనే విషయాలు చాలామందికి తెలియవు. రామకృష్ణమఠం, బాలసరస్వతీ బుక్‌డిపోల వంటివారు సప్తశతిలోని శ్లోకాలకు అర్థం మాత్రం వ్రాశారు. అవి కొంత వరకూ ఉపయోగమే.

సప్తశతి మొత్తం మూడు భాగాలుగా, పదమూడు అధ్యాయాలుగా ఉంటుంది. మొదటి భాగము ప్రథమచరితము. ఇందులో మధుకైటభులవధ చెప్పబడింది. రెండవభాగము మధ్యమచరితము. ఇందులో మహిషాసురవధ చెప్పబడింది. మూడవ భాగము ఉత్తమచరితము. ఇందులో శుంభ నిశుంభులవధ చెప్పబడింది. ఈ మూడు భాగాలు మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతుల రూపాలు. పరమేశ్వరి ఆ రూపాలలో రాక్షససంహారం చేసింది. ఇందులోని మొదటి అధ్యాయంలో బ్రహ్మదేవుడు చేసిన పరమేశ్వరిస్తుతి, నాల్గవఅధ్యాయంలో శక్రాదిస్తుతి, ఐదవ అధ్యాయంలో దేవతలు చేసిన స్తుతి, పదకొండవ అధ్యాయంలో నారాయణీస్తుతి చాలా ముఖ్యమైనవి. కేవలము ఈ స్తోత్రాలను పఠించినంత మాత్రం చేతనే, సప్తశతి పారాయణ చేసిన ఫలితము వస్తుంది. అందుచేత గ్రంథం వ్రాసేటప్పుడు ఈ స్తోత్రాలకు సాధ్యమైనంతవరకు విశేషవాఖ్య చెయ్యటం జరిగింది.

గ్రంథ రచనలో నాకు అన్ని విధాల సహకరించిన భార్య రమాదేవికి కృతజ్ఞతలు. ఈ గ్రంథాన్ని అచ్చువేసిన "బాలసరస్వతీ బుక్ డిపో" వారికి ప్రత్యేకాభినందనలు.

గతంలో నేను వ్రాసిన గ్రంథాలలాగానే దీన్ని కూడా ఆచరిస్తారని ఆశిస్తూ.

తారణనామ సంవత్సర
ఆషాఢ పూర్ణిమ, శుక్రవారం
02-07-2004

బుధజనవిధేయుడు
క్రోవి పార్థసారథి
"పరమానందనాథ"

# ప్రథమ చరితము

## ప్రథమాధ్యాయము

**ఖడ్గం చక్రగదేషుచాపపరిఘాన్శూలం భుశుండీం శిరః**
**శంఖం సన్దధతీం కరైస్త్రినయనాం సర్వాంగభూషావృతామ్ ।**
**యాం హంతుం మధుకైటభౌ జలజభూస్తుష్టావసుప్తేహరౌ**
**నీలాశ్మ ద్యుతి మాస్య పాద దశకాం సే వే మహాకాళికామ్ ॥**

ఈ శ్లోకంలో మొట్టమొదటగా మహాకాళిని ధ్యానిస్తున్నారు. ఆమె పది చేతులు గలది. ఆ చేతులయందు ఖడ్గము, చక్రము, గద, ధనుస్సు, ఇనుపకట్లు వేసిన గుదియ, శూలము, భుసుండి అనగా మానవశిరస్సును పోలిన ఆయుధము, శంఖము మొదలైన వివిధ రకాలైన ఆయుధములు ధరించినది, మూడు కనులుగలది, అన్ని అంగములయందు ఆభరణములు ధరించినది. అనగా సర్వాభరణభూషితమైనది, పదిముఖములు, పది పాదములు గలది, విష్ణువు యోగనిద్రలో ఉన్నప్పుడు మధుకైటభులను సంహరించటంకోసం బ్రహ్మదేవుని చేత స్తుతించబడినది, ఇంద్రనీలములవలె నల్లని శరీరకాంతిగలది అయిన మహాకాళిని ధ్యానించుచున్నాను.

ఇందులో మొత్తం 104 శ్లోకాలున్నాయి.

ఇక ప్రథమాధ్యాయము.

**ఓం నమశ్చండికాయై ।**

ఓంకార రూపిణి అయిన చండీదేవికి నమస్కారము.

**ఓం ఐం మార్కండేయ ఉవాచ ॥**

మార్కండేయుడు చెబుతున్నాడు. అసలు ఎవరీ మార్కండేయుడు? విధాత యొక్క కుమారుడు మృకండుడు. ఇతడి భార్య మనస్విని. ఇతడే మృకండ మహర్షి అని పేరు పొందాడు. ఈ మహర్షికి చాలాకాలం సంతానం కలగలేదు. ఒక రోజున మృకండుడు మిగిలిన మహర్షులతో కలిసి బ్రహ్మదేవుని దర్శించటం కోసం సత్యలోకానికి వెళ్ళాడు. అక్కడ "సంతానం లేని వారికి ఉత్తమగతులు లేవు. నీవు సంతానహీనుడవు కాబట్టి నీకు ఈ

లోకంలోకి ప్రవేశం లేదు" అని ద్వారపాలకులు మృకండ మహర్షిని లోపలికి పోనీయకుండా ఆపేశారు. చేసేదిలేక ఇంటికి వచ్చి జరిగిన దంతా భార్యతో చెప్పి దుఃఖించాడు మృకండ మహర్షి.

కొంతకాలం తరువాత ఈ మహర్షి దంపతులు హిమాలయ పర్వతాలకు వెళ్ళి శివుని గురించి ఘోరమైన తపస్సు చేశారు. వారి తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై 'ఏ వరంకావాలో కోరుకోండి' అన్నాడు. వెంటనే ఆ దంపతులు 'సంతానభాగ్యం కావాలి' అన్నారు. దానికి ఈశ్వరుడు "ఋషి దంపతులారా! మీకు సంతానయోగం లేదు. అయినా తపస్సుచేసి అర్థించారు కాబట్టి బుద్ధిమంతుడు, వేదవేదాంగవిదుడు అయిన బాలుని ప్రసాదిస్తాను. కాని అతని ఆయువు పదహారు సంవత్సరాలే" అని చెప్పి అంతర్ధాన మయినాడు. కొంతకాలానికి మృకండ మహర్షి భార్య గర్భవతి అయి పండంటి మగబిడ్డను కన్నది. అతడికి 'మార్కండేయుడు' అని నామకరణం చేశారు.

మార్కండేయుడు మహాశివభక్తుడు. పిల్లవాడికి ఐదవ ఏట అక్షరాభ్యాసం చేశారు. మునీశ్వరులంతా అతణ్ణి దీర్ఘాయువుగా దీవించారు. 'బాలుడు అల్పాయుష్కుడు అని ఈశ్వరు డన్నాడు. దీర్ఘాయువు కమ్మని మునీశ్వరులు దీవించారు. ఏం జరుగుతుందో? దైవసంకల్పం ఎలా ఉన్నదో?' అనుకున్నాడు మృకండ మహర్షి.

మార్కండేయుడు ఏకసంథాగ్రాహి. అందుచేత వేదవేదాంగాలన్నీ కొద్దిరోజులలోనే నేర్చుకున్నాడు. అతిచిన్నతనంలోనే మహాపండితుడైనాడు. అతణ్ణి చూసి చుట్టుప్రక్కలున్న మునులు, తల్లితండ్రులు కూడా ఆనందించారు. అయితే పిల్లవాడు మహాపండితుడని ఆనందం ఒక ప్రక్క అల్పాయుష్కుడనే బాధ ఇంకొక ప్రక్క ఈ రకంగా ఆశానిరాశల మధ్యన ఊగిసలాడుతున్నారు తల్లితండ్రులు.

ఇలా పదిహేను సంవత్సరాలు గడిచినాయి. ఒక రోజు నారద మహర్షి మృకండుని ఆశ్రమానికి వచ్చాడు. నారదునికి అర్ఘ్యపాద్యాదులు అర్పించి సగౌరవంగా ఆహ్వానించాడు మృకండుడు. కుశలప్రశ్నల తరువాత మాటలమధ్యలో మార్కండేయుని చూసి "సాముద్రిక లక్షణాలను బట్టి ఈ బాలుడు చాలా గొప్పవాడవుతాడు. భక్తశిఖామణి అవుతాడు. లోకైకపూజ్యు

దవుతాడు. కానీ – అతడికి ఇంకొక సంవత్సరమే ఆయుర్దాయం ఉన్నది. దీనికోసం విచారించాల్సిన పని లేదు. ఈ బాలుడు శివభక్తుడు. శివుడు భక్తసులభుడు. శివుని భక్తితో మెప్పించి వరాలు పొందటం అతితేలిక అయిన పని. ఈ సంవత్సరకాలంలో మార్కండేయుడు శివుని మెప్పించగలడు" అని చెప్పి మార్కండేయునితో, "నాయనా! గోదావరీనదీ తీరములో గౌతముని సిద్ధాశ్రమం ఉన్నది. పూర్వకాలంలో అదితికశ్యపులకు వామనుడు అక్కడే జన్మించాడు. అందుచేత అది 'సిద్ధజనార్దన క్షేత్రము' అని కూడా పిలువబడుతుంది. అక్కడే రాజేశ్వరి, సోమలింగేశ్వరులు ఉన్నారు. గతంలో శ్వేతకేతువు అనే మహారాజు, శుక్రుడు కూడా పరమేశ్వరుణ్ణి ఈ ప్రదేశంలోనే ఆరాధించారు. కాబట్టి నువ్వు కూడా అక్కడికి వెళ్ళి శివుని గురించి తపస్సు చెయ్యి" అన్నాడు.

నారదుని మాటలు విన్న మార్కండేయుడు, తల్లితండ్రుల అనుమతి తీసుకుని గౌతమీతీరం చేరాడు. నదిలో స్నానం చేసి, గౌతముడికి నమస్కరించి తపస్సు చెయ్యటం ప్రారంభించాడు. ఇలా ఒక ఏడాది గడిచి పోయింది. మాఘశుద్ధపంచమి మార్కండేయుని జన్మదినం. ఆ రోజున అతడికి పదహారు సంవత్సరాలు నిండినాయి. మార్కండేయుని తీసుకు రావటానికి దూతలను పంపాడు యమధర్మరాజు. యమదూతలను చూసి ఈశ్వరుని శరణు కోరాడు మార్కండేయుడు. శివాలయంలోకి వెళ్ళి కూర్చు న్నాడు. యమదూతలు ఆలయ ప్రవేశం చెయ్యబోయారు. కాలభైరవుడు వారిని అడ్డగించాడు. యమదూతలు తిరిగి వెళ్ళి జరిగిన దంతా యమునికి వివరించారు. మాఘశుద్ధ సప్తమినాడు యముడు మహిషవాహన మెక్కి మార్కండేయుని కోసం బయలుదేరాడు. నదిలో స్నానం చేసి శివునికి అభిషేకం చేస్తున్నాడు మార్కండేయుడు. అతణ్ణి ఆలయం నుంచి బయటకు రమ్మని పిలిచాడు యముడు. "పూజ మధ్యలో ఉన్నది. శివపూజకు అంత రాయం కలిగించవద్దు" అన్నాడు మార్కండేయుడు.

తాను పిలిస్తే ఒక బాలుడు రానన్నాడు. దాంతో యమునికి కోపం వచ్చింది. వెంటనే చేతిలోని పాశం మార్కండేయుని మీదికి విసిరాడు. "ఆర్తత్రాణపరాయణా ! అనాధ రక్షకా ! శంకరా ! పాహిమాం ! పాహి పాహి !" అంటూ శివలింగాన్ని కౌగిలించుకున్నాడు మార్కండేయుడు.

యముడు విసిరిన పాశం శివలింగాన్ని కౌగిలించుకున్న మార్కండేయుణ్ణి చుట్టేసింది. బాలుడి మీద కోపంతో యముడు పాశాన్ని బలంగా లాగాడు. యమపాశం బాలుడితోపాటు శివలింగాన్ని కూడా కుదిపివేసింది. వెంటనే ధమధమ ధ్వనులతో, ఫెళఫెళారావాలతో, కోటిసూర్యులకాంతితో. ఐదు ముఖాలు, మూడుకనులు కలిగి ఖడ్గము, పరశువు, శూలము ధరించి, గజచర్మాంబరధారి అయిన ఈశ్వరుడు ప్రత్యక్షమైనాడు. పరమభక్తితో నమస్కరించాడు మార్కండేయుడు. "నీకేం భయంలేదు నిశ్చింతగా ఉండు" అని అభయమిచ్చాడు శివుడు. ఆ తరువాత పరమేశ్వరుడు యమధర్మరాజుతో "సమవర్తీ! నువ్వు హద్దు మీరి ప్రవర్తించావు. ఈ బాలుడు నా భక్తుడు" అంటూ యముని మందలించి మార్కండేయుడికి ఏడు కల్పాల వరకు ఆయుష్షునిచ్చి దీవించాడు. ఈ రకంగా మార్కండేయుడు దీర్ఘాయువైనాడు.

మార్కండేయుడు పరమభక్తుడు. అత్యున్నతసాధకుడు. ఆత్మానుసంధాన ప్రవీణుడు. మహాభారతంలో శ్రీమన్నారాయణుడు మార్కండేయుడికి సాక్షాత్కరించి, "ఓ మార్కండేయా! నీ బ్రహ్మచర్యము వర్ణించటానికి వీలు లేనిది. నా రూపాన్ని దేవతలు కూడా తెలుసుకోలేరు. అటువంటి రూపాన్ని నీకు చూపిస్తున్నాను. నేనే శ్రీమన్నారాయణుడను. ఇంద్రుడు, ప్రజాపతి, కుబేరుడు, శివుడు, బ్రహ్మ, విష్ణువు యముడు, వీరందరూ నా స్వరూపమే. స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తంతా నా రూపమే. అని తెలుసుకోవలసినది" అంటూ తన యొక్క విరాడ్రూపాన్ని దర్శింపజేశాడు. ఈ విధంగా శ్రీమన్నారాయణుని విరాడ్రూపాన్ని దర్శించి తరించిన వాడు మార్కండేయుడు. అతనిచేత చెప్పబడిందే "మార్కండేయ పురాణము".

మార్కండేయ పురాణము మొత్తం ఐదు భాగాలుగా ఉంటుంది. అవి :

1. 1వ అధ్యాయంనుంచి 7వ అధ్యాయం వరకు - జైమిని అడిగిన ప్రశ్నలకు ధర్మ పక్షులు సమాధానం చెబుతాయి.

2. 8 నుంచి 42వ అధ్యాయం వరకు - ప్రాణులయొక్క జన్మ, మృత్యు, ఆవిర్భావ, వికాస, తిరో భావములను గురించి చెప్పబడింది.

3. 43 నుంచి 77వ అధ్యాయం వరకు మార్కండేయుడు తన శిష్యుడైన 'క్రౌష్టికి' అనే వాడికి పురాణం యొక్క మూలవిషయాన్ని వివరిస్తాడు.

4. 78 నుంచి 90 వరకు గల అధ్యాయాలలో దేవీ మాహాత్మ్యము చెప్పబడింది.

5. 91 నుంచి 134వ అధ్యాయం దాకా అంటే మిగిలిన భాగమంతా రాజుల చరిత్ర వర్ణించబడింది.

78వ అధ్యాయంలో దేవీసప్తశతి లేదా దేవీమాహాత్మ్యము ప్రారంభ మవుతుంది. ఇది మొత్తం 700 శ్లోకాలతో ఉన్న మాలామంత్రం.

కష్టాలు కలిగినప్పుడు, గడ్డుపరిస్థితులు ఏర్పడినప్పుడు, 'సప్తశతి' పారాయణ గనక చేసినట్టైతే అవి తొలగిపోయి సుఖశాంతులు కలుగుతాయి. అని మంత్రశాస్త్రంలో ప్రవేశమున్న వారందరికీ తెలుసు. అలాగే దేవీనవ రాత్రులలో ప్రతి రోజూ సప్తశతి పారాయణ చేసినవారు ఆ పరమేశ్వరి కరుణకు పాత్రులవుతారని కూడా చాలామందికి తెలుసు.

అయితే సప్తశతి అంటే ఏమిటి? అందులో ఏం చెప్పబడింది? మొదలైన విషయాలు చాలా కొద్దిమందికి మాత్రమే తెలుసు. అందుచేత, ఈ విషయాలు అందరికీ తెలియాలనే ఉద్దేశంతో, ముందుగా నా గురుపరంపర విరజానంద, సదానంద, శుకానందనాథులకు నమస్కరించి, ధర్మసంస్థాపన కోసం ఏర్పడ్డ శృంగేరీ, పూరి, ద్వారక, బదరీ, కంచి, పుష్పగిరి, కుర్తాళం పీఠాధిపతులకు వందనాలర్పించి, 'పరమానందనాథ' అనే దీక్షానామం గల హరితస గోత్రీకుడనైన 'క్రోవిపార్థసారథి' అను నేను దేవీసప్తశతికి పూర్వా పరాలతో, అవసరమైన చోట్ల విశేషవ్యాఖ్యచేస్తూ, భాష్యం వ్రాసి సాక్షాత్తూ పరమేశ్వరీ స్వరూపులైన శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామి వారికి అంకితం చేస్తున్నాను. పండితులు పరమేశ్వరి భక్తులు నా యీ సాహసాన్ని మన్నించి నన్ను ఆశీర్వదింతురుగాక !

**మార్కండేయ ఉవాచ ॥**

మార్కండేయుడు తన శిష్యుడైన 'క్రౌష్టకి' అనే వాడికి చెబుతున్నాడు.

**సావర్ణిః సూర్య తనయో యో మనుః కథ్యతే ఒష్టమః**
**నిశామయ తదుత్పత్తిం విస్తరా ద్గదతో మమ ॥**

ఓ క్రౌష్టకీ ! సూర్యుని యొక్క కుమారుడైన సావర్ణి 8వ మనువైనాడు. అతని యొక్క పుట్టుకను సవిస్తరంగా వివరిస్తాను వినవలసినది.

ఎవరీ సావర్ణి? సూర్యుని భార్యయైన సువర్ణ యందు జన్మించిన వాడు. ఇతడినే 'సూర్యసావర్ణి' అని కూడా అంటారు. ఇతడు 8వ మనువు. మానవులకు ఆదిపురుషుడు మనువు. కాలప్రమాణంలో

| | | |
|---|---|---|
| 15 తిథులు | - | ఒక పక్షము |
| రెండు పక్షములు | - | ఒక మాసము |
| రెండు మాసములు | - | ఒక ఋతువు |
| మూడు ఋతువులు | - | ఒక అయనము |
| రెండు అయనములు | - | ఒక సంవత్సరము |
| | - | కృతయుగము |
| | - | త్రేతాయుగము |
| | - | ద్వాపరయుగము |
| | - | కలియుగము |
| నాలుగు యుగములు | - | ఒక మహాయుగము |
| 71 మహాయుగాలు | - | ఒక మన్వంతరము |
| 14 మన్వంతరాలు | - | ఒక కల్పము. అది బ్రహ్మకు ఒక పగలు. |

అంటే ప్రతి కల్పానికీ 14 మంది మనువులు ఉంటారు. ప్రతి మన్వంతరంలోను సప్తఋషులు, ఇంద్రుడు, దేవతలు మొదలైన వారు ఉండి ధర్మాన్ని రక్షిస్తూ లోకపాలన చేస్తుంటారు. మన్వంతరము పూర్తి కాగానే వీరందరూ మారిపోతారు. ప్రస్తుతము నడుస్తున్నది శ్వేతవరాహకల్పము. ఈ కల్పములోని మనువులు వరుసగా:

1. స్వాయంభువుడు
2. స్వారోచిషుడు
3. ఉత్తముడు
4. తామసుడు
5. రైవతుడు
6. చాక్షుషుడు
7. వైవస్వతుడు
8. సూర్యసావర్ణి
9. దక్షసావర్ణి
10. బ్రహ్మసావర్ణి
11. ధర్మసావర్ణి
12. రుద్రసావర్ణి
13. రౌచ్య
14. భౌత్య

వీళ్ళు మొత్తం 14 మంది. ఇప్పుడు మనం శ్వేతవరాహకల్పములోని వైవస్వత మన్వంతరంలో ఉన్నాము. అంటే ఏడవ మన్వంతరంలో ఉన్నామన్న మాట.

మార్కండేయుడు చెబుతున్నాడు. "ఓ క్రౌష్టకీ ! సూర్యుని యొక్క కుమారుడైన 'సూర్యసావర్ణి'.

**మహామాయాను భావేన యథామన్వంతరాధిపః ।**
**స బభూవ మహాభాగః సావర్ణి స్తనయో రవేః ॥**

మహామాయ అయిన ఆ భగవతి యొక్క అనుగ్రహము వలన సకలైశ్వర్యములతో తులతూగుతూ మన్వంతరానికి అధిపతి అయినాడు. ఆ విషయాన్ని చెబుతాను వినవలసినది.

**స్వారోచిషేఽన్తరే పూర్వం చైత్రవంశ సముద్భవః ।**
**సురథోనామరాజాఽభూ సమస్తే క్షితి మండలే ॥**
**తస్య పాలయతః సమ్యక్ ప్రజా పుత్రాని వౌరసాన్ ।**
**బభూవుః శత్రవో భూపాః కోలావిధ్వంసి స్తదా ॥**

పూర్వకాలంలో స్వారోచిషమన్వంతరంలో అంటే రెండవ మన్వంతర మన్నమాట చైత్రవంశంలో పుట్టినటువంటి 'సురథుడు' అనే రాజు ఈ భూమండలాన్ని పాలిస్తున్నాడు. అతడు వేదవేదాంగవిదుడు, ధర్మపరుడు. ప్రజలను కన్న బిడ్డలవలె కాపాడుతున్నాడు. ఆ కాలంలో 'కోలలు' అనబడే అదిమజాతివారు ప్రజలను దోచుకుంటూ ఉండేవారు. ఆ 'కోలలను' కొంతమంది రాజులు ఎదిరించి సంహరించారు. ఈ రకంగా కోలలను ధ్వంసం చేశారు. కాబట్టి వారికి 'కోలావిధ్వంసులు' అని పేరు వచ్చింది ఆ కోలావిధ్వంసులు సురథుడు అనే ఈ మహారాజుకు శత్రువులైనారు.

**తస్య తైరభవ ద్యుద్ధ - మతిప్రబలదండినః।**
**న్యూనైరపి సతైర్యుద్ధే - కోలావిధ్వంసిభిర్జితః॥**
**తతః స్వపుర మాయాతో - నిజదేశాధిపోఽభవత్ ।**
**అక్రాంత స్స మహాభాగ - స్తైస్తదా ప్రబలారిభిః ॥**

మహాబలమైనటు వంటి గొప్పగొప్ప ఆయుధములు గలిగి ఎక్కువ

సైన్యము గల సురథునికి, తక్కువ సైన్యము గల కోలావిధ్వంసులకు మధ్య గొప్ప యుద్ధం జరిగింది. అల్పసంఖ్యాకులైనప్పటికీ కోలావిధ్వంసులు యుద్ధంలో విజయం సాధించారు. సురథుడు ఓడిపోయినాడు. ఆ తరువాత మహారాజు అవమానభారంతో కృంగిపోతూ తన రాజధానికి తిరిగి వచ్చి ఎప్పటిలా రాజ్యపాలన చేయసాగాడు.

ఆ సమయంలో రాజుయొక్క బలహీనతను ఆసరాగా తీసుకొని, దుష్టులు, దుర్మార్గులు అయిన అతని మంత్రులు కోశాగారాన్ని కొల్లగొట్టారు. రాజుగారి దగ్గర ఉన్న ధనధాన్యసంపదనంతా హరించి వేశారు. ఈ రకంగా సర్వస్వమూ కోల్పోయిన మహారాజు ఏం చెయ్యటానికీ పాలుపోక "వేటకు వెడుతున్నాను" అని చెప్పి ఒంటరిగా బయలుదేరి దట్టమైన అరణ్యంలోకి వెళ్ళిపోయాడు.

ఆ విధంగా అరణ్యం లోపలికి వెళ్ళి మహారాజు 'మేధసుడు' (ఇతన్నే 'సుమేధుడు' అని కూడా అంటారు) అనే ముని ఆశ్రమం చేరాడు. ఆ ఆశ్రమ ప్రాంగణం ఎలా ఉన్నది అంటే పులులు, సింహాలు మొదలైన క్రూరమృగాలన్నీ సాధువర్తనులై అక్కడ తిరుగుతున్నాయి. వాటితో లేళ్ళు, లేగదూడలు ఆడుకుంటున్నాయి. కుక్క, పిల్లి కలిసి ఆడుకుంటున్నాయి. 'హింస' అనేది ఎక్కడా కనిపించటంలేదు. ఆశ్రమంలో అనేకమంది శిష్యులు వేదపారాయణ చేస్తున్నారు. ఈ రకంగా ప్రశాంతమైన వాతావరణంలో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నటువంటి ముని ఆశ్రమాన్ని చూశాడు. మహారాజు చిన్నగా అడుగులు వేసుకుంటూ ఆశ్రమం వైపుకు వెళ్ళాడు. శిష్యులవల్ల సమాచారమందుకున్న మునీశ్వరుడు బయటకు వచ్చి మహారాజుకు స్వాగతసత్కారాలందించాడు. కుశల ప్రశ్నలు అయిన తరువాత, రాజుగారి స్థితి తెలుసుకున్నటువంటి మునీశ్వరుడు ఈయనకు తన ఆశ్రమం లోనే బస ఏర్పాటుచేశాడు. మహారాజు కూడా మునీశ్వరుని మాట కాదన కుండా ఆ ఆశ్రమంలోనే ఉండిపోయాడు.

ఈ రకంగా సుమేధుని ఆశ్రమంలో ఉండి పోయిన మహారాజు ఆశ్రమ పరిసర ప్రాంతాల్లో తిరుగుతున్నాడు. కాలం గడిచిపోతోంది. ఉన్నట్టుండి అనుకోకుండా ఒక రోజున రాజుగారికి గతంలో జరిగిపోయిన

విషయాలన్నీ గుర్తుకు రాసాగాయి. అతని మనసు చింతాక్రాంతమైంది. ఆలోచనలు పట్టి పీడిస్తున్నాయి. "పూర్వకాలంలో మా తాత ముత్తాతల చేత, నిన్నటి వరకూ నా చేత పాలించబడినట్టి నా సామ్రాజ్యము ఇప్పుడెలా ఉన్నదో కదా? దుర్మార్గులు, దుష్టులు అయిన మంత్రులు ధర్మమార్గాన రాజ్యాన్ని పాలిస్తున్నారో? లేదో? బలపరాక్రమాలతో మదించి ఉన్న నా పట్టపు ఏనుగు శత్రువులచేత చిక్కి ఎటువంటి కష్టాలు పడుతున్నదో? మొన్నటి దాకా నా దగ్గర ఉండి, నన్ను సేవిస్తూ, నా అనుగ్రహము వలన భోగభాగ్యాలు అనుభవించిన వారంతా ఇప్పుడు శత్రురాజులను సేవిస్తూ ఉంటారు. నేను అనేక కష్టాలు పడి, ధనాన్ని ప్రోగుచేసి, ధనాగారము నింపాను. అదంతా ఇప్పుడు దురాచారుల చేత చిక్కి నష్టమై పోయిఉంటుంది కదా?" అని అనుకుంటున్నాడు.

ఈ రకంగా ఆలోచించిస్తున్న మహారాజు ఆశ్రమ సమీపంలో ఒక వైశ్య ప్రముఖుణ్ణి చూశాడు. అతని దగ్గరకు వెళ్ళి "అయ్యా ! నువ్వెవరవు? ఈ అరణ్యానికి ఎందుకువచ్చావు? బాగా బాధపడుతున్నట్లుగా కనిపిస్తున్నావు. నీ దుఃఖానికి కారణము ఏమిటి?" అన్నాడు. మహారాజు యొక్క స్నేహపూర్వక మైన పలుకులు విన్న వైశ్యుడు వినయపూర్వకంగా శిరసువంచి నమస్కరించి తన కథ చెప్పటం మొదలుపెట్టాడు.

"సమాధిర్నామ వైశ్యోహముత్పన్నో ధనినాం కులె"

ఆర్యా నాపేరు 'సమాధి'. నేను వైశ్యకులంలో అత్యంత ధనికుల ఇంట జన్మించాను అయినప్పటికీ ధనం మీద ఆశ చావలేదు. అందుచేత వ్యాపారం చేసి ఇంకా ధనమార్జించాను. ఆ సమయంలో నా భార్యబిడ్డలకు ధనం మీద ప్రలోభం కలిగింది. దురాశ పుట్టింది. ఆ కారణం చేత వారు దుర్మార్గులు, దుష్టులు అయినారు. నేను కట్టుకున్న భార్య, కన్నబిడ్డలే నా ధనాన్ని అపహరించి నన్ను ఇంటి నుంచి తరిమి వేశారు. ఈ రకంగా భార్యా పుత్రులను, ధనాన్ని పోగొట్టుకుని, బంధుమిత్రులను వదలి, చేసేదిలేక, ఈ అడవికి వచ్చాను. కొంత కాలంగా ఈ అరణ్యంలోనే ఉంటున్నాను. అందుచేత నా భార్యబిడ్డల యొక్క బంధువులయొక్క క్షేమసమాచారాలేవీ తెలియటంలేదు. ఇంటి దగ్గర వారంతా క్షేమంగా ఉన్నారో లేదో? అసలు

ఇప్పుడు వారెలా ఉన్నారో? నా కుమారులంతా సన్మార్గంలోనే సంచరిస్తున్నారో లేదో?" అంటూ మనసులోని బాధనంతా బైటపెట్టాడు వైశ్యుడు. అతడి మాటలు విన్న మహారాజు.

**యై ర్నిరస్తో భవాం ల్లుబ్ధైః - పుత్రదారాదిభి ర్ధనైః ।**
**తేషు కిం భవత స్నేహా - మనుబధ్నాతి మానసమ్॥**

"మిత్రమా ! సమాధీ ! నీ భార్యాబిడ్డలే దురాశతో నీ ధనాన్నంతా అపహరించారు. చివరకు నిన్ను ఇంటి నుంచి కూడా వెళ్ళగొట్టారు. అటువంటి వారి యందు నీకు మమకారము ఎందుకు కలుగుతున్నదో నాకు తెలియటం లేదయ్యా" అన్నాడు రాజు.

రాజుగారి మాటలు విన్న వైశ్యుడు

"రాజా ! ఇప్పుడు మీరన్నట్లే నేనుకూడా అనుకున్నాను. కాని ఏం చెయ్యగలను? నా మనసు నాకు సహకరించటంలేదు. వాళ్ళ మీద కోపం రావటం లేదు. ధనంమీద వ్యామోహంతో కన్న తండ్రినైన నన్ను వెళ్ళగొట్టారు. బంధువులపట్ల దురుసుగా ప్రవర్తించారు. నా భార్యకూడా ఈ దుర్మార్గు లంటేనే ప్రేమగా ఉన్నది. అటువంటి వారిపట్ల నాకు కోపం రావటం లేదు. వారి యందు నా మనసు కఠినంగా వ్యవహరించటం లేదు. అసలు నాకేమీ తెలియటంలేదు. ఏది తప్పో, ఏది ఒప్పో కూడా తెలుసుకోలేకపోతున్నాను. రాజా! బంధువులు దుర్మార్గులైనప్పటికీ మనసులో వాళ్ళ మీద ప్రేమ, అభిమానము ఉన్నాయి. ఇదేమి విచిత్రమయ్యా! వాళ్ళ కోసం నేను బాధపడుతున్నాను. ఈ స్థితిలో నేను ఏం చెయ్యాలి?" అన్నాడు.

వైశ్యుడు చెప్పిన విషయమంతా విన్నాడు మహారాజు. బాగా ఆలోచించాడు. ఏం సమాధానం చెప్పాలో పాలుపోలేదతనికి. అప్పుడు వారిద్దరూ(మహారాజు, వైశ్యుడు) కలిసి మహర్షి దగ్గరకు వచ్చి ఆయనకు నమస్కరించి మహర్షితో " ఓ మహర్షీ ! ఒక చిన్న అనుమానం నన్ను పట్టి పీడిస్తున్నది. దయచేసి ఆ అనుమానాన్ని నివృత్తి చెయ్యవలసింది. ఓ ఋషి పుంగవా! నేను యుద్ధంలో ఓడిపోయాను. అవమానం పొందాను. నా మంత్రులు సైనికాధికారులు కూడా నన్ను మోసగించి, నా ధనాగారాన్ని కొల్లగొట్టారు. ఏమీచెయ్యలేని పరిస్థితిలో రాజ్యాన్ని వదిలి ఒంటరిగా

వచ్చేశాను. ఈ విషయాలన్నీ నాకు తెలుసు. నేను వాటిని మరిచి పోలేదు. అయినప్పటికీ నా మనస్సు రాజ్య విశేషాల మీదనే లగ్నమవుతున్నది. వాటి మీద మమకారం మాత్రం తగ్గటం లేదు. ఓ మునీశ్వరా! నేనే కాదు. ఇతడు సమాధి అనే పేరుగల వైశ్యుడు. అతి ధనవంతుడు. ఇతని భార్యాబిడ్డలే ధనం మీది మమకారంతో ఇతణ్ణి ఇంటినుంచి వెళ్ళగొట్టారు. ఆస్తిపాస్తులన్నీ దోచుకున్నారు. ఇతడు అరణ్యాలపాలయినాడు. ఈ రకంగా భార్యాబిడ్డలచేత గెంటివేయబడినప్పటికీ, అరణ్యాలపాలయినప్పటికీ, వారిపట్ల అత్యంతమైన ప్రేమానురాగాలను కలిగి ఉన్నాడు. ఇలా వైశ్యుడుగాని, నేనుగాని జరిగిన మోసాలు, ఘోరాలు తెలిసికూడా ఆ విషయాలయందు మమకారాన్ని వదలలేక అత్యంతమైన దుఃఖాన్ని అనుభవిస్తున్నాము. అన్ని విషయాలు తెలిసి కూడా మేము ఈ మోహంలో పడిపోతున్నాము. ఈ మోహము మా వివేకాన్ని పోగొట్టి మమ్మల్ని మూఢులుగా, అజ్ఞానులుగా చేస్తున్నది. ఇదంతా దేనివల్ల జరుగుతున్నదో, దీనికారణం ఏమిటో, మాకు వివరించవలసింది" అన్నాడు. ఆ మాటలు విన్న మహర్షి

జ్ఞాన మస్తి సమస్తస్య - జంతో ర్విషయగోచరే।
విషయశ్చ మహాభాగ - యాతిచైవం పృథక్పృథక్॥
దివాంధాః ప్రాణినః కేచి - ద్రాత్రావంధా స్తథాపరే।
కేచి ద్దివా తథా రాత్రౌ - ప్రాణిన స్తుల్యదృష్టయః ॥
జ్ఞానినో మనుజా స్సత్యం - కిం నుతే న హి కేవలమ్ ।
యతో హి జ్ఞానిన స్సర్వే - పశుపక్షిమృగాదయః ॥
జ్ఞానం చ త న్మనుష్యాణాం - యత్తేషాం మృగపక్షిణామ్।
మనుష్యాణాం చ యత్తేషాం - తుల్య మన్యత్తథోభయోః॥
జ్ఞానేఽ పి సతి పశ్యైతాన్ - పతంగాం ఛ్ఛావచంచుషు ।
కణమోక్షాదృతా న్మోహా - త్పీడ్యమానా నపి క్షుధా ॥
మానుషా మనుజవ్యాఘ్ర - సాభిలాషా స్సుతాన్ ప్రతి ।

లోభా త్ప్రత్యుపకారాయ - నన్వేతాన్ కిం న పశ్యసి ॥

తథాపి మమతావర్తే - మోహగర్తే నిపాతితాః ।

మహామాయాప్రభావేణ - సంసారస్థితి కారిణా ॥

తన్నాత్ర విస్మయః కార్యో - యోగనిద్రా జగత్పతేః ।

మహామాయా హరేశ్చైత - త్తయా సంమోహ్యతే జగత్ ॥

జ్ఞానినామపి చేతాంసి - దేవీ భగవతీ హి సా ।

బలా దాకృష్య మోహాయ - మహామాయా ప్రయచ్ఛతి ॥

తయా విసృజ్యతే విశ్వం - జగదేత చ్చరాచరమ్ ।

సైషా ప్రసన్నా వరదా - నృణాం భవతి ముక్తయే ॥

సా విద్యా పరమా ముక్తే - ర్హేతుభూతా సనాతనీ ।

సంసారబంధహేతుశ్చ - సైవ సర్వేశ్వరేశ్వరీ ॥

రాజా! ఇంద్రియ గోచరమైనటువంటి జ్ఞానము సమస్త జంతువులకు సమానంగానే ఉంటుంది. ఆహారనిద్రామైథునాలు ప్రాణులన్నింటికీ సమానం గానే ఉంటాయి. దీనిలో ఏ రకమైన తేడా లేదు. కొన్ని ప్రాణులు పగలు చూడగలవు. ఉదా॥కు మనుష్యుడు, కాకులు, చిలకలు, పిచ్చుకలు, పావురాలు మొదలైనవన్నీ పగలు మాత్రమే చూడగలుగుతాయి. మరికొన్ని జీవులు గుడ్లగూబలలాటివి రాత్రులందు మాత్రమే చూడగలుగుతాయి. అయితే మరికొన్ని ప్రాణులు కుక్కలు, పిల్లులు, ఆవులు, గేదెలు మొదలైనవి పగలు, రాత్రికూడా చూడగలుగుతాయి. మానవులకు జ్ఞానమున్నది అనే మాట నిజమే అయితే ఇంద్రియాలకు సంబంధించిన జ్ఞానము పశువులకు, పక్షులకు మృగాలకు చివరకి క్రిమికీటకాలకు కూడా ఉన్నదయ్యా! ఈ రకంగా విషయగోచరమైన జ్ఞానము పశుపక్ష్యాదులకు ఉన్నట్లే మానవులకు కూడా ఉన్నది. అందుచేతనే ఈ రకమైన జ్ఞానము మానవులకు, ఇతర ప్రాణులకు కూడా సమంగా ఉన్నది అంటున్నాము. అదిగో ఆ పక్షుల వంక

ఒక్కసారి చూడు. వాటికి జ్ఞానం లేదా? ఆకలివేస్తే తినాలి అని తెలియదా? తల్లిపక్షి తాను ఆకలితో మాడిపోతూ కూడా దొరికిన ఆహారం తను తినకుండా తన పిల్లలకు ఎలా నోట్లో పెడుతున్నదో చూడు. రాజా! దీన్నే 'మోహము' అంటారు. ఇక మానవుల సంగతి చూడు. బిడ్డలవల్ల ప్రత్యుపకారము ఉన్నది అనే భావంతోనే వారియందు అభిలాషను కలిగి ఉన్నారు. ఈ పిల్లలు పెరిగి పెద్దవారయి తమ పేరుని నిలబెడతారనో, వంశగౌరవాన్ని కాపాడతారనో ఆశ ఉంటుంది. దాంతోనే పిల్లల మీద అంతమక్కువ కలిగివుంటారు. ఈ విషయం నీకు మాత్రం తెలియదా? సృష్టిస్థితి లయాలకు కారణమైనది మహామాయ. ఆవిడే పరమేశ్వరి. ఆమె యొక్క ప్రభావం చేతనే మానవులు 'మాయ' అనే సుడిగుండంలో పడిపోతున్నారు. ఈ మాయ అనేది పరమేశ్వరి యొక్క అధీనంలో ఉంటుంది. పాము కోరలలో విషమున్నట్లుగానే మాయ పరమేశ్వరికి లోబడి ఉంటుంది. తన కోరలలో ఉన్న విషం వల్ల పాముకు ఏరకమైన ప్రమాదము కలగదు. కాని పాముకాటుతిన్న వారికి మాత్రం ఆ విషం హానిచేస్తుంది. అలాగే పరమేశ్వరిని ఆవరించి ఉన్న మాయ మానవులను సంసార లంపటంలో పడవేస్తుంది. ఈ మాయ అనేది విష్ణువు యొక్క యోగనిద్ర. ఆ మాయచేతనే జగత్తంతా సమ్మోహిత మవుతున్నది. ఆ మహామాయ జ్ఞానులయొక్క మనస్సులను కూడా ఆకర్షించి వారిని మోహగ్రస్తులను చేస్తుంది. పూర్వకాలంలో నారదుడు స్త్రీగా మారిపోయినది, విశ్వామిత్రుడంతటి తపస్సంపన్నుడు మేనకను వివాహం చేసుకున్నది ఈ మాయ వల్లనేనయ్యా. ఈ జగత్తునంతటినీ ఆవిడే సృష్టిస్తున్నది. ఆవిడే లయం చేస్తున్నది. ఆమె అనుగ్రహంచేతనే మనం ముక్తి పొందగలుగుతాము. ఆ దేవియే పరావిద్య. ఆమెయే ముక్తికి కారణభూతురాలు. ఈ జగత్తును పాలించే శక్తి. సంసారబంధనాలకు హేతువుకుడా ఆమే, ఆ దేవియే పరమేశ్వరి" అన్నాడు.

మహర్షి మాటలు విన్న మహారాజు "మహర్షీ! -మహామాయ అంటున్నావు. పరమేశ్వరి అంటున్నావు. ఇంతకీ ఆవిడ ఎవరు? ఆమె ఎలా ఉద్భవించింది? ఏం చేస్తుంది? ఆమె స్వరూపస్వభావాలను పూర్తిగా వివరించవలసింది" అని ప్రార్థించాడు.

మహారాజు యొక్క ప్రార్థన మన్నించిన వాడైన మహర్షి ఈ రకంగా చెబుతున్నాడు.

రాజా! ఆ పరమేశ్వరియే నిత్యమైనది, సత్యమైనది. ఆమెయే శాశ్వత మైనది. ఆమెయే ఈ జగత్తుగా మూర్తీభవించింది. అనగా ఈ జగత్తంతా ఆమే వ్యాపించి ఉన్నది. ఆ జగన్మాత అనేక రకాలుగా అవిర్భవిస్తుంటుంది. ఎందుకు? అంటే

**దేవానాం కార్యసిద్ధ్యర్థ - మావిర్భవతి సా యదా ।**
**ఉత్పన్నేతి తదా లోకే - సా నిత్యా ఉప్యభిధీయతే ॥**

ఆ పరమేశ్వరి నిత్యమైనది. అంటే సర్వకాలసర్వావస్థల యందు ఉండునది. అయినప్పటికీ దేవతల కార్యములు సాధించటం కోసం ఆవిడ ఈ లోకంలో ఆవిర్భవిస్తూ ఉంటుంది.

లలితాసహస్రనామాలలో '5'వ నామం చూడండి 'దేవకార్య సముద్యతా' దేవతల కార్యములు పూర్తిచెయ్యటం కోసం ఆ దేవి భూలోకంలో అవతరిస్తూ ఉంటుంది. అది ఎప్పుడు జరుగుతుంది? ఆ పరమేశ్వరి ఎప్పుడు అవతరిస్తుంది? అంటే భగవానుడు గీతలో చెబుతున్నాడు

**యదాయదాహి ధర్మశ్చ గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థానమధర్మస్యతదాత్మానం సృజామ్యహం ॥**

లోకంలో తన అవసరం ఎప్పుడు కలుగుతుందో అప్పుడు పరమేశ్వరి భూమి మీద అవతరిస్తుంది. ఏమిటా అవసరం? అసలు ఆవిడతో పనేమిటి మనకి?

**పరిత్రాణాయసాధూనాం వినాశాయచదుష్కృతాం ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥**

దుష్టశిక్షణ, శిష్టరక్షణ. ఇది భగవంతుడి కర్తవ్యం. కాబట్టి లోకంలో ధర్మానికి ఎప్పుడైతే హానికలిగిందో, హాని కలగటం అంటే - ధర్మం నిలబడ లేకపోవటం. ఎప్పుడైతే ధర్మం నాశనమై పోతోందో అప్పుడు ఆ పరమేశ్వరి భూలోకంలో అవతరిస్తుంది. అదేమాట చెబుతున్నాడు మహర్షి రాజుతో.

రాజా ! ఒకసారి ప్రళయం సంభవించిది. ప్రళయం అంటే ఈ సృష్టి

అంతా నాశనం అయిపోవటం. ప్రళయమనేది రెండు రకాలుగా ఉంటుంది. 1. మహా ప్రళయము. 2. పాక్షిక ప్రళయము.

కల్పాంతాన మహాప్రళయం సంభవిస్తుంది. అప్పుడు జగత్తులోని జీవరాశి అంతా నశించిపోతుంది. ఈ జగత్తంతా ఏరకంగా సృష్టించబడిందో అదే క్రమంలో క్రిందినుంచి పైకి వెళ్ళి పరమేశ్వరునిలో లీనమయిపోతుంది. అసలు జగత్తు ఏ రకంగా సృష్టించబడింది?

నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతడు బిందురూపంలో ఉన్నాడు. ఇప్పుడు మనకు చిన్న అనుమానం వస్తుంది. ఆ పరబ్రహ్మ బిందురూపంలోనే ఎందుకున్నాడు? త్రికోణము, అష్టకోణము, చతురస్రము, దీర్ఘచతురస్రము ఇలా ఏదైనా ఆకారంలో ఉండచ్చుగదా? దీనికి సమాధానం ఏమిటంటే మనకంటికి కనిపించే – జగత్తు అంటే – భూమి ఇది గుండ్రంగా ఉన్నది. పరమేశ్వరుడు ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాడు అని చెప్పటానికి వీలుగా అతడు గుండ్రంగా బిందువులాగా లేకుండా ఇంకేదైనా రూపంలో అంటే త్రికోణము, అష్టకోణము రూపంలో గనక ఉన్నట్లైతే 'జగత్తంతా వ్యాపించటం' అనేది జరగదు. అందుచేతనే పరమేశ్వరుడు బిందురూపుడు అని చెప్పటం జరుగుతోంది. బిందువు ఎంత చిన్నదైనా కావచ్చు పెద్దదైనా కావచ్చు. 'అణోరణీయాం । మహతోమ హీయాం' అంటోంది కఠోపనిషత్తు. అంటే – పరమేశ్వరస్వరూపమనేది అణువుకన్నా చిన్నదైనది. పెద్దవాటన్నింటి లోకీ అతిపెద్దదైనది. ఇలా సంకోచించటము, పూర్తిగా వ్యాకోచించి జగత్తంతా ఆక్రమించటమనేది ఒక్క పరమేశ్వరుడికే సాధ్యం. అందుకే అతడు బిందురూపుడు.

ఈ రకంగా బిందురూపంలో ఉన్న పరబ్రహ్మ మళ్ళీ సృష్టిచెయ్యాలని సంకల్పించాడు. ఎందుకు సంకల్పించాడు? తన లీలావినోదం కోసం మాత్రం కాదు. మరి ఇంకెందుకు? గతంలో ప్రళయం సంభవించినప్పుడు కర్మక్షయం కాకుండా తనలో కలిసిపోయిన జీవరాశికి వాటి కర్మానుసారం పునర్జన్మనిచ్చి, వాటి కర్మనుక్షయం చేసి, తద్వారా ఆ జీవులకు మోక్షం కలిగించాలనే కోరికతో మాత్రమే సృష్టిచెయ్యాలని సంకల్పించాడు. ఇలా సంకల్పించిన పరమేశ్వరుడు మొదటగా తనను తాను రెండు భాగాలుగా విభజించు కొన్నాడు. అంటే పరమేశ్వర స్వరూపమైన బిందువు నుంచి కొంతశక్తి

బయటకు వచ్చింది. అదే త్రికోణము. మహాయోని. దానినుంచే ఈ జగత్తంతా ఆవిర్భవించింది. అనగా అవ్యక్తమైనవాడు పరమేశ్వరుడు. అతన్నుంచి వ్యక్తమైనశక్తి అదే త్రికోణం వచ్చింది. దాన్నుంచి అహంకారము వచ్చింది. దీనినుంచి నామరూపాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది. ముందుగా రూపాత్మక జగత్తు. దీనిలో ముందు వచ్చినవి తన్మాత్రలు. అవే శబ్ద స్పర్శరూపరసగంధాలు. వీటినుంచి పంచభూతాలు వచ్చినాయి. వాటిలో మొదటగా వచ్చింది. ఆకాశం - ఇక

*ఆకాశాద్ - వాయు :* ఆకాశం నుంచి వాయువు వచ్చింది.

*వాయోరగ్ని :* వాయువు నుంచి అగ్ని ఉద్భవించింది.

*అగ్నిర్ఆప :* అగ్నినుంచి జలము ఉద్భవించింది.

*ఆపః పృథ్వి :* జలము నుంచి భూమి ఉద్భవించింది.

ఇప్పుడు కర్మ పరిపక్వం కాని జీవి మేఘాన్ని ఆశ్రయించి వర్షపు జల్లుగా భూమి మీద పడి ఏదో విత్తనంలో ప్రవేశిస్తుంది. ఆ విత్తనం మొలకెత్తి ఫలించి జీవుల గర్భం చేరుతుంది. ఈ రకంగా జీవరాశి అంటే రూపాత్మకమైన జగత్తు సృష్టించ బడుతుంది. ఇక నామాత్మకమైన జగత్తు. ముందుగా పరబ్రహ్మ. అదే నామంలో చెప్పాలంటే ఓంకారము. ఓంకారము నుంచి అ నుంచి క్ష వరకు ఉన్న అక్షరసమామ్నాయము వచ్చింది. అక్షరాల నుంచి పదాలు, పదాలనుంచి వాక్యాలు, మంత్రాలు, వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు, సంగీతము, సాహిత్యము, సర్వశాస్త్రాలు వచ్చినాయి. ఇది నామాత్మకమైన జగత్తు ప్రళయం సంభవించినప్పుడు అన్ని జీవుల యొక్క కర్మా క్షయంకాదు. కర్మక్షయం అయిన జీవులు పరబ్రహ్మలో లీనమై పోతాయి. కర్మక్షయంకాని జీవులు తమ కర్మను తమతోపాటు మూటకట్టుకుని మాయలో కలిసిపోతాయి. ఇప్పుడు పంచభూతాలు కూడా నశించి పోతాయి. ముందుగా భూమి - నీటిలో కలిసిపోతుంది. నీరు - అగ్నిలో, అగ్ని - వాయువులో, వాయువు ఆకాశంలో, ఆకాశం మాయలో కలిసి పోతుంది. ఈ రకంగా అన్నింటినీ తనలో కలుపుకున్న మాయ పరమేశ్వరునిలో లీనమైపోతుంది.

ప్రళయం సంభవించినప్పుడు నామాత్మకమైన జగత్తు కూడా లయమై పోతుంది. సంగీతము, సాహిత్యము, శాస్త్రాలు అన్నీ వేదాలలో కలిసి

పోతాయి. వేదాలు అకార ఉకార మకారములలో కలిసిపోతాయి. ఆ మూడూ అంటే అకార ఉకార మకారాలు ఓంకారంలో లీనమైపోతాయి. ఓంకారమే పరబ్రహ్మ.

ఈ రకంగా జగత్తంతా పరమేశ్వరునిలో లీనమై పోవటాన్నే 'మహాప్రళయము' అంటారు. ఇది పూర్తి ప్రళయము. ఆ సమయంలో జగత్తంతా శూన్యంగా ఉంటుంది.

ఇక రెండవది పాక్షిక ప్రళయము. ఇది ప్రతిమహాయుగాంతంలోను జరుగుతుంది. అప్పుడు జగత్తంతా జలమయమై పోతుంది. ఆ సమయంలో స్థితికారకుడైన శ్రీ మహావిష్ణువు శేషశాయియై ఉంటాడు. ఇది ప్రళయానికి సంబంధించిన విషయం.

మహర్షి రాజుగారికి చెబుతున్నాడు. "రాజా! ఒకసారి ప్రళయం సంభవించినప్పుడు శ్రీమహావిష్ణువు శేషశాయియై యోగనిద్రలో ఉన్నాడు. ఆ సమయంలో విష్ణుమూర్తి యొక్క చెవిలో నుంచి వచ్చిన మలినపదార్థం 'గుబిలి' నుంచి మధుకైటభులు అనే ఇద్దరు రాక్షసులు జన్మించారు. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. జీవులు స్త్రీ పురుషుల కలయిక వల్ల ఉత్పన్న మవుతాయి కదా! మరి ఇలా మలిన పదార్థాలనుంచి పుట్టటం ఏమిటి? ఇది సంభవమేనా? ఈ ప్రశ్నకు సమాధానం కావాలంటే ఒక్కసారి ఛాందోగ్యో పనిషత్తును చూడాలి. అందులో ఉద్దాలకమహర్షి తన కుమారుడైన శ్వేతకేతువుకు తత్త్వాన్ని బోధిస్తూ "నాయనా శ్వేతకేతూ! స్థావర జంగమాత్మక మైన జీవులన్నీ పుట్టుక రీత్యా అనేక విధాలుగా ఉన్నాయి. అవి.

1. అండజములు – గ్రుడ్డునుంచి పుట్టేవి. (పక్షులు, పాములు)
2. జారజములు – స్త్రీ యొక్క జననాంగము నుంచి పుట్టేవి (మనుష్యులు, పశువులు.)
3. ఉద్భిజములు – విత్తనాలవల్ల భూమినుంచి పుట్టేవి. (చెట్లు చేమలు)
4. స్వేదజనులు – చెమట లేదా మలిన పదార్థాలవల్ల పుట్టేవి.
5. ఊష్మజములు – వెచ్చదనం వల్ల పుట్టేవి. (క్రిమికీటకాలు)

ఈ రకంగా విష్ణువు యొక్క చెవి గుబిలి నుంచి జన్మించిన మధుకైటభులు చుట్టూ చూశారు. అంతా సముద్రం. ఎంతో దూరం వెళ్ళారు. ఎక్కడా ఏమీ కనిపించలేదు. ఇంత నీరు ఇక్కడ ఎలా నిలిచింది? అసలు మనం ఎలా పుట్టాము? అని ఆలోచించ సాగారు. ఆ సమయంలో వారికి వాగ్బీజం వినిపించింది. దాన్నే మహామంత్రంగా స్వీకరించి నిరాహారులై తపస్సు చేశారు. తపస్సు అంటే మనసావాచా కర్మణా ఒకే విషయాన్ని గురించి సర్వకాల సర్వావస్థలయందు ఆలోచించటమన్నమాట. ఇలా వేయి సంవత్సరాలు గడిచింది. వారి దీక్షకుమెచ్చి పరమేశ్వరి ప్రత్యక్షమై "ఏ వరం కావాలో కోరుకోండి" అన్నది. వెంటనే వారు 'స్వచ్ఛందమరణంకావాలి' అన్నారు. 'తథాస్తు' అన్నది పరమేశ్వరి.

వారు ఆ నీటిలో తిరుగుతూ ఒకరోజున పద్మాసనుని చూశారు అతడే బ్రహ్మదేవుడు. కర్మబ్రహ్మ. అతడు చతుర్ముఖుడు. తన నాలుగు ముఖాలతోను వేదపారాయణ చేస్తున్నాడు. ఆయనను చూసిన మధుకైటభులు 'మాతో యుద్ధానికి రా!' అన్నారు. బ్రహ్మ సమాధానం చెప్పలేదు. దాంతో రాక్షసులకు కోపం వచ్చి 'మాతో యుద్ధం చేస్తావా? లేక మాచేతిలో చస్తావా? ఏదో ఒకటి త్వరగా తేల్చుకో' అన్నారు. అప్పటికీ బ్రహ్మ మాట్లాడలేదు. రాక్షసులు మీదిమీదికి రాసాగారు. పైకి ఎగురుతున్నారు. భయపడ్డాడు బ్రహ్మ. పద్మాసనాన్ని వదలి, దాని కాడగుండాక్రిందికి దిగాడు. అక్కడ విష్ణుమూర్తి యోగనిద్రలో ఉన్నాడు. తనను రక్షించవలసినదిగా తండ్రిని వేడుకున్నాడు. విష్ణువు ఉలకలేదు పలకలేదు. బ్రహ్మ రోదన అంతా అరణ్యరోదన అయింది. విష్ణువు లేస్తే రాక్షసులను సంహరిస్తాడు. కాని నిద్రలో ఉన్నాడు. అది మామూలు నిద్రకాదు. యోగనిద్ర. అంటే విష్ణువు మాయచేత ఆవరించబడి ఉన్నాడు. ఆయన నిద్రలేవాలంటే మహామాయ కరుణించి ఆయన్ను వదలాలి. ఆ పరాశక్తి రూపమే మాయ. అందుకని బ్రహ్మ సర్వ లోకపాలకురాలు, జగజ్జనని అయిన పరమేశ్వరిని పరిపరివిద్ధాల స్తుతించాడు.

సప్తశతిలోని ప్రథమాధ్యాయంలో బ్రహ్మ పరమేశ్వరిని చేసిన స్తుతి ఉత్తమోత్తమమైనది. ఇది మొత్తం 72-87 (16) శ్లోకాలుగల స్తోత్రం. దీన్ని గనక పారాయణ చేసినట్లైతే మొదటి అధ్యాయం మొత్తం పారాయణ చేసిన ఫలితం వస్తుంది.

బ్రహ్మ పరమేశ్వరిని చేసిన స్తోత్రం

త్వం స్వాహా త్వం స్వధా త్వం హి - వషట్కారఃస్వరాత్మికా ।
సుధా త్వ మక్షరే నిత్యే - త్రిధా మాత్రాత్మికా స్థితా ॥
అర్ధమాత్రాస్థితా నిత్యా - యాఽనుచ్చార్యా విశేషతః ।
త్వమేవ సంధ్యా సావిత్రీ - త్వం వేదజననీ పరా ॥
త్వయైత ద్ధార్యతే విశ్వం - త్వయైత త్సృజ్యతే జగత్ ।
త్వయైత త్పాల్యతేదేవి - త్వ మత్స్యంతే చ సర్వదా ॥
విసృష్టౌ సృష్టిరూపా త్వం - స్థితిరూపా చ పాలనే ।
తథా సంహృతిరూపాఽంతే - జగతోఽస్య జగన్మయే ॥
మహావిద్యా మహామాయా - మహామేధా మహాస్మృతిః ।
మహామోహా చ భవతీ - మహాదేవీ మహాసురీ ॥
ప్రకృతి స్త్వం హి సర్వస్య - గుణత్రయవిభావినీ ।
కాలరాత్రి ర్మహారాత్రి - ర్మోహరాత్రిశ్చ దారుణా ॥
త్వం శ్రీ స్త్వ మీశ్వరీ త్వం హ్రీ - స్త్వం బుద్ధిర్బోధలక్షణా ।
లజ్జా పుష్టి స్తథా తుష్టి - స్త్వం శాంతిః క్షాంతిరేవ చ ॥
ఖడ్గినీ శూలినీ ఘోర - గదినీ చక్రిణీ తథా ।
శంఖినీ చాపినీ బాణ - భుశండీపరిఘాయుధా ॥
సౌమ్యా సౌమ్యతరాశేష - సౌమ్యేభ్యస్త్వతిసుందరీ ।
పరాపరాణాం పరమా - త్వమేవ పరమేశ్వరీ ॥
యచ్చ కించి త్క్వచిద్వస్తు - సదసద్వా ఖిలాత్మికే ।
తస్య సర్వస్య యా శక్తి - స్సాత్వం కిం స్తూయసే మయా॥

యయా త్వయా జగత్స్రష్టా - జగత్పా త్యత్తి యో జగత్ ।
సోఽపి నిద్రావశం నీతః - క స్త్వాం స్తోతు మిహేశ్వరః ॥
విష్ణుః శరీరగ్రహణ - మహ మీశాన ఏవ చ ।
కారితాస్తే యతోఽ తస్త్వాం -కః స్తోతుం శక్తిమా న్భవేత్ ॥
సా త్వ మిత్థంప్రభావైః స్వై - రుదారైర్దేవి సంస్తుతా ।
మోహయైతౌ దురాధర్షా - వసురౌ మధుకైటభౌ ॥
ప్రబోధం చ జగత్స్వామీ - నీయతా మచ్యుతో లఘు ।
బోధశ్చ క్రియతా మస్య - హంతు మేతౌ మహాసురౌ ॥

ఓ జగజ్జననీ ! త్వం స్వాహా! నీవే స్వాహాకారానివి. దేవతల ప్రీతికోసం యజ్ఞాలు, యాగాలు నిర్వహిస్తారు. వాటిలో దేవతలకు ఆహుతులు అర్పించే టప్పుడు చెప్పేది 'స్వాహా' మంత్రము. ఇంద్రాయస్వాహా! ఇంద్రాయ ఇదంనమమ. అగ్నయేస్వాహా! అగ్నాయ ఇదంనమమ.

బ్రహ్మదేవుడు లోకాలన్నీ సృష్టించిన తరువాత, దేవతలంతా బ్రహ్మ దగ్గరకు వచ్చి, విధాతా! ఆకలి బాధకు తట్టుకోలేకుండా ఉన్నాము. దీనికి ఏదైనా ఉపాయం చెప్పవలసింది అన్నారు. దానికి బ్రహ్మ 'ఇలాంటి విషయాలు చూట్టానికి విష్ణువు ఉన్నాడు. అతని దగ్గరకు వెళ్ళండి' అన్నాడు. దేవతలంతా విష్ణువు దగ్గరకు వెళ్ళి తమ గోడు వినిపించారు. వారి మాటలు విన్న విష్ణువు "దేవతలారా! భూలోకంలో బ్రాహ్మణులు, క్షత్రియులు చేసే యజ్ఞయాగాదులకు సంబంధించిన హవ్యము మీ ఆకలిని పోగొడుతుంది. ఆ హవ్యము మీపేరు చెప్పి అగ్నిలో వేస్తారు. దాన్ని అగ్ని మూలంగా మీకు అందించే శక్తి వేరే ఉన్నది. ఆ శక్తి కోసం మీరంతా పరమేశ్వరిని ఆరాధించండి. ఆవిడ ప్రసన్నురాలై ఆ శక్తిని పంపుతుంది" అన్నాడు.

దేవతలంతా పరమేశ్వరిని అత్యంత శ్రద్ధాభక్తులతో ఆరాధించారు. పరమేశ్వరి వారి దీక్షకు మెచ్చి ఆ శక్తిని పంపించింది. బ్రహ్మ ఆ శక్తికి నమస్కరించి "తల్లీ ! నువ్వు అగ్నికి వాహకశక్తివై, అతని యందు హోమం

చేసిన హవ్యాన్ని దేవతలకు అందించు" అన్నాడు. దానికి ఆ శక్తి "నేను శ్రీహరిని తప్ప పరపురుషునికి చెందను. అగ్నికి వాహక శక్తిగా ఉండను" అని చెప్పి తపస్సు చేసుకోవటంకోసం వెళ్ళిపోయింది.

కొంతకాలానికి శ్రీహరి ఆమెకు ప్రత్యక్షమై "దేవీ! నీ మనసు నా కర్థమయింది. మరుజన్మలో నగ్నజిత్తు అనే రాజు కుమార్తె నాగ్నజితిగా జన్మించి నా అంశతో పుట్టిన శ్రీకృష్ణుని వివాహమాడతావు. కాని ఇప్పుడు మాత్రం స్వాహా అనే పేరుతో అగ్నిదేవునికి ఇల్లాలివై అతనికి వాహకశక్తిగా ఉండు" అన్నాడు. తరువాత అగ్నిదేవుడికీ, స్వాహాదేవికీ వివాహం జరిగింది. ఈ రకంగా పరమేశ్వరి అంశ అయిన స్వాహాదేవి ద్వారానే అగ్నిలో సమర్పించిన ఆహుతులు దేవతలకు చేరతాయి.

త్వం స్వధా ! నీవే స్వధా మంత్రానివి. పితృదేవతలకు తర్పణలు ఇచ్చేటప్పుడు చెప్పే మంత్రము 'స్వధా' తర్పణచేసేటప్పుడు 'స్వధాం తర్ప యామి' అంటారు.

పితృదేవతలకు శ్రాద్ధకర్మలో తర్పణము ద్వారా ఆహారం లభించేట్టు చేశాడు బ్రహ్మ. కాని అది వారికి సక్రమంగా చేరటంలేదు. పితృదేవత లంతా బ్రహ్మ దగ్గరకుపోయి వారి బాధలు మొరపెట్టుకున్నారు. బ్రహ్మ పరమేశ్వరిని ప్రార్థించి ఆమె అంశతో ఒక కన్యను సృష్టించాడు. ఆమె పేరు 'స్వధ'. అపురూప సౌందర్యరాశి. ఆమెను పితృదేవతలకు సమర్పించాడు. శ్రాద్ధకర్మలో పితృదేవతలకు సమర్పించిన వాటిని వారికి సవ్యంగా అందించటమే ఆమె పని. ఈమె కూడా పరమేశ్వరి అంశయే.

నీవే వవట్కారము అంటే 'వేదయజ్ఞము' అని అర్థం. ఓ దేవీ! అన్ని మంత్రాలకు మూలమైనటువంటి దానవు నీవే. నీవే సుధవు. అంటే దేవతలకు ఆహారమైన అమృతస్వరూపిణివి. క్షరము అనగా నాశనము లేని దానివి. శాశ్వతమైనదానివి. నిత్యము, సత్యము అయిన దానివి. ఓ తల్లీ ! నీవే త్రిమాత్రాత్మికవు. అకార ఉకార మకారాలు మూడింటినీ మూడు మాత్రలు అంటారు. ఈ మూడింటి కలయికయే ఓంకారము. అందుకే పరమేశ్వరి ఓంకార స్వరూపిణి అంటున్నాడు. పూర్తిగా ఉచ్చరించటానికి వీలుకాని నిత్యాస్వరూపమైన అర్థమాత్రవు నీవే. అర్థమాత్ర అంటే

ఓం కారము ఉచ్చరించిన తరువాత అది లయమయ్యేటప్పుడు వచ్చే సూక్ష్మ శబ్దాన్ని అర్ధమాత్ర అని 'నాదము' అని అంటారు. ఓం ... మ్ .... నీ వే గాయత్రివి నీవే సావిత్రివి నీవే దేవతలకు జన్మనిచ్చిన దానివి.

ఓ తల్లీ ! ఈ జగత్తునంతా నీవే సృష్టిస్తున్నావు. పోషిస్తున్నావు. చివరకు దాన్ని నీవే లయం చేస్తున్నావు. అమ్మా ! సృష్టికాలంలో సృజనశక్తి అంటే బ్రహ్మగా, స్థితికాలంలో పరిపాలనశక్తి అంటే విష్ణువుగా లయం చేసేటప్పుడు సంహరణశక్తి అంటే రుద్రుడుగా ఉంటావు. లలితాసహస్రంలో 264-269 నామాలలో ఇదే చెబుతున్నారు చూడండి. సృష్టికర్త్రీ బ్రహ్మ రూపా, గోప్త్రీ గోవిందరూపిణీ, సంహారిణీ రుద్రరూపా. ఆ పరమేశ్వరి బ్రహ్మదేవుని రూపంలో ఈ జగత్తును సృష్టిస్తుంది. విష్ణువు రూపంలో పోషించి పాలిస్తుంది. రుద్రుని రూపంలో లయంచేస్తుంది. అవేమాటలు చెబుతున్నాడు బ్రహ్మదేవుడు. ఓ జగజ్జననీ సృష్టిస్థితి లయ కారకురాలవు నీవే. మహాజ్ఞాన మయివి నీవే. అజ్ఞానమయివి కూడా నీవే. అంటే విద్య, అవిద్య రెండూ నీవే. లలితాసహస్రంలో 790వ నామం చూడండి. పరాపరా పర, అపరా అంటే పరావిద్య, అపరావిద్య. ఏమిటివి? ముండకోపనిషత్తులో శౌనకుడికి అంగీరసుడు చెబుతాడు. వేదంలో రెండురకాల విద్యలున్నాయి. 1. పరావిద్య - ఇది మోక్ష విద్య 2. అపరావిద్య - ఇది లౌకికమైన ఫలితాలు పొందటానికి ఉపయోగపడే విద్య. ఇదే కామ్యవిద్య. ఈ రెండింటిలోనూ మొదటిది జ్ఞానవిద్య, రెండవది అజ్ఞానము. ఈ రెండూ కూడా పరమేశ్వరి స్వరూపమే. నామము విద్యా అవిద్యా స్వరూపిణి.

ఓ దేవీ ! నీవు మహాబుద్ధివి మహాస్మరణశక్తివి. భ్రాంతిని కలిగించేది నీవే. మహాదేవివి నీవే. మహాఅసురివి నీవే. అంటే అన్ని శక్తులు ఆమే. సంపదలు ఇచ్చే లక్ష్మీదేవి ఆమే. దారిద్ర్యాన్నిచ్చే జ్యేష్ఠాదేవి ఆమే. సంపదలు ఇచ్చే లక్ష్మీదేవి ఆమే. దారిద్ర్యాన్నిచ్చే జ్యేష్ఠాదేవి ఆమే. ఆ దేవి ఎంతటి శుభశక్తో, అంతటి అశుభశక్తి కూడా.

తల్లీ ! సర్వమునకూ మూలమైనటువంటి ప్రకృతివి నీవే. త్రిగుణము లను ప్రవర్తిల్లచేసే దానవు నీవే. త్రిగుణములు అంటే సత్వరజస్తమో గుణాలు నీవే. కల్పాంతాన ప్రళయకాలపు కాళరాత్రివి నీవే. అంతిమ

ప్రళయకాలపు మహారాత్రివి నీవే. భయంకరమైన మోహరాత్రివి నీవే. నీవే లక్ష్మీదేవివి. ఈశ్వరివి. హ్రీంకార స్వరూపానివి. ప్రబోధము కలిగించే జ్ఞానచిహ్నమైన బుద్ధివి నీవే. లజ్జ, పుష్టి, తుష్టి, శాంతి, ఓరిమి గలదానవు. ఖడ్గము, శూలము, గద, చక్రము, శంఖము, ధనుస్సు, భుశుండి, పరిఘ (ఇనుపకట్ల గద) మొదలైన ఆయుధాలు ధరించిన భయంకరివి. కాని క్షేమాన్ని కలిగించే శుభంకరి కూడా అవుతావు. అంటే - శరణాగతులకు క్షేమంకరి, శత్రువులకు, దుర్మార్గులకు భయంకరి అని అర్థం. జననీ ! శుభాలన్నింటిలోకీ అత్యంత శుభప్రదమైన దానవు. అత్యంత సౌందర్యవతివి. పరాపరములకు రెండింటికీ అతీతమైనదానివి.

సత్తు, అసత్తు అంటే చైతన్యము గలవి, చైతన్యములేనివి. ఈ రెండింటియందు గల శక్తివి నీవే. అఖిలాండకోటి బ్రహ్మాండనాయికవైన నిన్ను స్తుతించటం నా వల్లకాని పనికదా. సృష్టిస్థితిలయాలను చేసేవారు కూడా నీ దాసానుదాసులు. అటువంటి నిన్ను స్తుతి చేసే శక్తి ఎవరికి ఉంటుంది? త్రిమూర్తులకు పదవులిచ్చిన నిన్ను మేము ఏ రకంగా కొనియాడగలము. ఓ దేవీ ! అజేయులైన మధుకైటభులను సమ్మోహితులుగా చెయ్యి. విష్ణువు త్వరగా మేల్కొని ఆ రాక్షసులను సంహరించేటట్లుగా చూడవలసింది" అంటూ బ్రహ్మదేవుడు ఆ పరమేశ్వరిని ప్రార్థించాడు. మహారాజా! ఈ రకంగా బ్రహ్మచేత ప్రార్థించబడిన ఆ తామసికశక్తి విష్ణువును వదలి బ్రహ్మకు దర్శనమిచ్చింది. ప్రకృతిలో ఉన్న మూడు గుణాలను బట్టి మహామాయ మూడురూపాలు ధరిస్తున్నది. అందులో సాత్వికరూపము - మహాసరస్వతి. రాజసికరూపము - మహాలక్ష్మి. తామసికరూపము - మహాకాళి.

ఎప్పుడైతే ఆ తామసిక శక్తి, మహామాయ విడిచిపెట్టిందో, అప్పుడు విష్ణువు నిద్ర నుంచి లేచాడు. ఎదురుగా మధుకైటభులు కనిపించారు. బ్రహ్మదేవుని రక్షించటం కోసం వారితో యుద్ధానికి దిగాడు. వాళ్ళిద్దరు విష్ణువు ఒక్కడు. రాక్షసులు ఒకరి తరువాత ఒకరుగా విష్ణువుతో యుద్ధం చేస్తున్నారు. ఒకడు యుద్ధం చేస్తుండగా రెండవవాడు విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఇలా ఐదువేల సంవత్సరాలు గడచినాయి. అప్పుడు విష్ణువు వారితో 'మీరిద్దరు నేను ఒక్కడిని. మీరు విశ్రాంతి తీసుకుంటున్నారు.

మరి నాకు విశ్రాంతి ఏది?' అన్నాడు. ఆ మాటలు విన్న రాక్షసులు విష్ణువు విశ్రాంతి తీసుకోవటానికి కొంతవ్యవధి ఇచ్చారు. ఈ సమయంలో విష్ణువు పరమేశ్వరిని ప్రార్థించాడు. ఆమె ప్రసన్నమై రాక్షససంహారానికి ఉపాయం చెప్పింది.

మళ్ళీ యుద్ధం మొదలైంది. ఈసారి ఒక్క దెబ్బతో రాక్షసులు కిందపడేటట్లు చేసి "ఓ రాక్షసులారా ! ఇంతవరకు నేను ఎందరో రాక్షసులతో యుద్ధంచేశాను. కాని ఇంతసేపు నాతో యుద్ధంచేసిన వారు లేరు. మీ పరాక్రమానికి మెచ్చాను ఏ వరం కావాలో కోరుకోండి?" అన్నాడు.

ఈ మాటలు విన్న రాక్షసుల అహం దెబ్బతిన్నది. వారు విష్ణువుతో "నువు ఇచ్చే వాడివి. మేము పుచ్చుకునే వాళ్ళమూనా? ఏ వరం కావాలో నువ్వే కోరుకో. మేమే నీ కిస్తాము" అన్నారు. అవకాశం వదలుకోలేదు విష్ణుమూర్తి. "మీరు నా చేతిలో మరణించాలి" అన్నాడు. నివ్వెరపోయారు రాక్షసులు ఆ మాటలు విని. కొంతసేపటికి తెప్పరిల్లి, "అలాగే నీకోరిక తీరుస్తాం. కాకపోతే నీరులేనిచోట మమ్మల్ని సంహరించు" అన్నారు. వెంటనే విష్ణుమూర్తి తన ఆకారాన్ని బాగా పెంచేసి మధుకైటభులను తన తొడలమీద ఉంచి, చక్రాయుధంతో వారి శిరస్సులు ఖండించాడు.

"ఈ రకంగా బ్రహ్మదేవుని చేత స్తుతించబడి మధుకైటభ సంహారానికి కారణమైంది ఆ పరమేశ్వరి" అంటూ సప్తశతిలోని ప్రథమాధ్యాయాన్ని పూర్తిచేశారు.



# మధ్యమ చరితము

## ద్వితీయాధ్యాయము

**ఓం అక్షస్రక్పరశూ గదేషుకులిశం - పద్మం ధనుః కుండికామ్**
**దండం శక్తి మసిం చ చర్మ జలజం - ఘంటాం సురాభాజనమ్ ।**
**శూలం పాశసుదర్శనే చ దధతీం - హస్తైః ప్రవాళప్రభామ్**
**సేవే సైరిభమర్దనీ మిహ మహా - లక్ష్మీం సరోజస్థితామ్ ॥**

పద్దెనిమిది చేతులు గలిగి ఆ చేతులయందు అక్షమాల, గండ్రగొడ్డలి, గద, బాణము, వజ్రాయుధము, కమలము, ధనుస్సు, కలశము, దండము, శక్తి, ఖడ్గము, డాలు, శంఖము, ఘంట, మద్యపాత్ర, శూలము, పాశము, సుదర్శనచక్రము ధరించినది, పగడపు ఛాయ గలది, మహిషాసురుని సంహరించినది, పద్మమును ఆసనముగా గలది అయిన మహాలక్ష్మిని ధ్యానించుచున్నాను.

రెండవ అధ్యాయంలో 69 శ్లోకాలున్నాయి. దీనిలో 'మహిషాసుర సైన్యవధ' వివరించబడుతోంది.

సుమేధుడు లేదా మేధసుడు అనే ఋషి సురధుడు అనే రాజుకు, సమాధి అనే పేరు గల వైశ్యుడికి వివరిస్తున్నాడు.

**దేవాసుర మభూ ద్యుద్ధం - పూర్ణ మబ్దశతం పురా ।**
**మహిషేఽసురాణా మధిపే - దేవానాం చ పురందరే ॥**

పూర్వంకాలంలో ఒకసారి దేవాసురసంగ్రామం జరిగింది. అందులో దేవతలకు నాయకుడుగా ఇంద్రుడు, రాక్షసులకు అధిపతిగా మహిషాసురుడు ఉన్నారు. ఈ యుద్ధం నూరు సంవత్సరాలు జరిగింది. ఇంద్రుడు అంటే దేవతలకు రాజు. భూలోకంలో నూరు అశ్వమేధాలు చేసినవాడు ఇంద్రపదవి నలంకరిస్తాడు. మరి ఈ మహిషాసురుడు ఎవరు?

విష్ణువు యొక్క నాభికమలం నుంచి పుట్టిన బ్రహ్మ కొన్నివేల సంవత్సరాలు తపస్సు చేసి పరమేశ్వరిని మెప్పించి ఆమెయొక్క అనుజ్ఞతో

సృష్టికార్యక్రమము కొనసాగిస్తూ అందులో భాగంగా – మానసికంగా మరీచి, అంగీరసుడు, అత్రి, వసిష్ఠుడు, పులహుడు, క్రతువు, పులస్త్యుడు అనే ఏడుగురిని సృష్టించాడు. వీరిని బ్రహ్మ మానసపుత్రులు అంటారు. ఆ తరువాత రోషమువల్ల – రుద్రుడు, తొడనుంచి – నారదుడు, కుడిబ్రొటన వ్రేలు నుంచి – దక్షుడు, ఎడమ బ్రొటనవ్రేలునుంచి వీరిణి అనే కన్య పుట్టారు. దక్షుడు వీరిణిని వివాహం చేసుకున్నాడు. మరీచి కుమారుడైన కశ్యపుడు దక్షప్రజాపతి కుమార్తెలయిన అదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహిక, క్రోధ, పృథ, విశ్వ, వినత, కద్రువ, కపిల అనే 12 మందిని వివాహం చేసుకున్నాడు. కశ్యపుడికి దనువు నందు పుట్టిన వారు దానవులు. వారిలో రంభుడు కరంబుడు అనేవారిద్దరు. వీరికి సంతానం లేదు. అందుచేత సంతానం కోసం తపస్సు చెయ్యటం మొదలుపెట్టారు. రంభుడు తన చుట్టూ అగ్నిని ప్రజ్వరిల్లచేసి పంచాగ్నుల మధ్య ఉండి తపస్సు చేస్తున్నాడు. పంచాగ్నులు అంటే 1. పూర్వాగ్ని 2. దక్షిణాగ్ని 3. పశ్చిమాగ్ని, 4. ఉత్తరాగ్ని, 5. సూర్యుడు. కరంబుడు పీకలోతు నీటిలో ఉండి తపస్సు చేస్తున్నాడు. ఈ విషయం తెలిసిన దేవేంద్రుడు మొసలిరూపంలో వెళ్ళి కరంబుణ్ణి చంపేశాడు. తన సోదరుడు మరణించాడన్న వార్త విన్నాడు రంభుడు. అమితంగా దుఃఖించాడు. ఇంద్రుని మీద పగ తీర్చుకునేటందుకు గాను బలాఢ్యుడు, దేవతలను జయించగలవాడు అయిన పుత్రుడు కావాలి అని అగ్నిదేవుని ప్రార్థించాడు. ఎంతసేపటికీ అగ్ని ప్రత్యక్షం కాలేదు. అప్పుడు రంభుడు హోమగుండం సృష్టించి దానిలో తన తలను హోమం చెయ్యటానికి పూనుకున్నాడు. ఆ సమయంలో అగ్నిదేవుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. దానికి రంభుడు “స్వామీ! అజేయుడు, అపూర్వబలశాలి, కామరూపి, ముల్లోకాలను జయించగలవాడు అయిన కుమారుడు కావాలి” అన్నాడు. అగ్నిదేవుడు రంభుని కోరిక మన్నించి “ఇక్కడ నుండి వెళ్ళేటప్పుడు ముందుగా ఎవరిని చూసి కామిస్తావో వారి యందు నీకు పై లక్షణాలు గల పుత్రుడు కలుగుతాడు” అని చెప్పాడు. ఈ రకంగా వరం పొందిన రంభుడు ఇంటికి బయలుదేరాడు. అతడు యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య గణాలు ఉండే ప్రాంతాలగుండా ప్రయాణి స్తున్నాడు. త్రోవలో ఎంతో మంగి అప్సరాంగనలు, గంధర్వకాంతలు, దేవతాస్త్రీలు, అపురూపసౌందర్య రాసులు తారసపడ్డారు. కాని రంభుడి మనసు చలించలేదు.

అప్పటికి కొంతకాలం క్రితం 'మహిష్మతి' అనే గంధర్వకాంత శాపవశాన మహిషముగా అంటే 'గేదె' గా జన్మించింది. ఆ మహిషము సుందరీమణులయిన అప్సరాంగనలు తిరుగాడుతున్న ప్రదేశానికి కొంచెం దూరంగా, సెలయేటిగట్టున గడ్డిమేస్తోంది. ఆ గేదెను చూడగానే రంభుడి మనసు చలించింది. గతజన్మ ప్రారబ్ధం తప్పించటం ఎవరివల్ల అవుతుంది?

రంభుని మనసు చలించటమే తడవుగా ఆ గేదె గర్భం దాల్చింది. గర్భవతి అయిన గేదెను వెంటపెట్టుకుని ఇంటికి బయలుదేరాడు రంభుడు. కొంతకాలానికి ఆ గేదె దున్నపోతుతల, మనిషిశరీరము గల పిల్లవాణ్ణి ప్రసవించింది. పుత్రోదయం కాగానే మహిష్మతికి శాపవిమోచనం కలిగి గంధర్వలోకానికి వెళ్ళిపోయింది.

ఆ బాలుడికి మహిషుడు అని నామకరణం చేశాడు రంభుడు. మహిషుడు బ్రహ్మను గూర్చి ఘోరమైన తపస్సు చేశాడు. బ్రహ్మదేవుడతను ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. 'మరణం లేకుండా వరం కావాలి' అన్నాడు మహిషుడు. 'పుట్టిన ప్రతిప్రాణి మరణించి తీరవలసిందే. నేను కూడా శాశ్వతం కాదు. మరి నాకు లేనిది నీకెలా ఇవ్వగలను? కాబట్టి ఇంకేదయినా వరం కోరుకో' అన్నాడు బ్రహ్మ. ఆలోచించాడు మహిషుడు. లోకంలో బలహీనమైన ప్రాణి స్త్రీ ఒక్కటే. ఆడదాన్ని అరికాలితో నలిపివేస్తాను కాబట్టి స్త్రీతో తప్ప మిగిలిన ఏ ప్రాణివల్లా ప్రాణహాని లేకుండా వరమియ్యవలసింది అన్నాడు. 'తథాస్తు' అన్నాడు విధాత.

బ్రహ్మ వరప్రసాది అయిన మహిషుడికి దైత్యగణాలన్నీ జయజయ ధ్వానాలతో స్వాగతం పలికి "రాజా! నీవు లేని సమయంలో దేవతలు మన రాజ్యం అపహరించారు!" అని చెప్పాయి. ఆ మాట విన్న మహిషుడు కోపంతో ఊగిపోయాడు. కళ్ళు ఎర్రబడ్డాయి. భ్రుకుటి ముడిపడింది. కళ్ళనుంచి విస్ఫులింగాలు రాలినాయి. వీరావేశంతో పెద్దపెట్టున హుంకరించాడు. ఆ శబ్దానికి భూనభోంతరాళాలు దద్దరిల్లాయి. దిక్కులు పిక్కటిల్లాయి. వెంటనే 1. అసిలోముడు, 2. ఉదర్కుడు 3. బిడాలుడు 4. బాష్కలుడు, 5. త్రినేత్రుడు 6. కాలబంధరుడు అనే వారిని దండనాయకులుగా, చిక్షురాక్షుడు సేనాధిపతిగా దైత్యగణాలు వెంట రాగా జైత్రయాత్రకు బయలు

దేరాడు. భూలోకంలో ఉండే రాజ్యాలన్నీ మహిషుని పాదాక్రాంతమైనాయి. అప్పుడు అతని దృష్టి దేవలోకం మీద పడింది. దేవ దానవ సంగ్రామం వంద సంవత్సరాలు గడిచింది.

**తత్రాసురై ర్మహావీరై - ర్దేవసైన్యం పరాజితమ్ ।**
**జిత్వాచ సకలాన్ దేవా - నింద్రోఽభూ న్మహిషాసురః ॥**

ఆ యుద్ధంలో మహాబలపరాక్రమాలు గలిగినటు వంటి దేవసైన్య మంతా రాక్షసుల చేతిలో ఓడిపోయింది. దేవతలను జయించిన మహిషుడు ఇంద్ర పదవిని అధిష్ఠించాడు.

యుద్ధంలో ఓడిపోయిన దేవతలంతా బ్రహ్మను వెంట పెట్టుకుని శివుడు, విష్ణువు ఉన్న చోటికి వెళ్ళి జరిగినదంతా వారికి వివరించారు. "ఆ మహిషుడు దురాత్ముడయి సూర్యుడు, చంద్రుడు, ఇంద్రుడు, అగ్ని, వాయువు మొదలుగా గల దేవతల అందరి అధికారాలను లాక్కున్నాడు. స్వర్గాన్ని ఆక్రమించాడు. ఇంద్రుని సింహాసనం అధిష్ఠించాడు. దేవతల నందరినీ స్వర్గము నుంచి తరిమివేశాడు. ఇప్పుడు ఆ దేవతలంతా భూమి మీది మానవుల లాగా దిక్కుతోచక తిరుగుతున్నారు. మహానుభావులారా ! దేవలంతా మిమ్ములను శరణువేడుతున్నారు.

హరిహరులారా !

మీరిద్దరూ కూడా మాయందు దయ ఉంచి మహిషుని యొక్క పీడ వదిలిపోయే మార్గం ఆలోచించండి" అన్నారు.

**ఇత్థం నిశమ్య దేవానాం - వచాంసి మధుసూదనః ।**
**చకార కోపం శంభుశ్చ - భ్రుకుటీకుటిలాననౌ ॥**

దేవతల మాటలు విన్నారు హరి హరులు. వారిద్దరికీ వెంటనే చాలా కోపం వచ్చింది. వారి ముఖాలు ఎర్రబారినాయి. కోపంతో కనుబొమలు ముడివడినాయి.

**తతోఽతికోపపూర్ణస్య - చక్రిణో వదనా త్తతః ।**
**నిశ్చక్రామ మహత్తేజో - బ్రహ్మణః శంకరస్య చ ॥**

**అన్యేషాం చైవ దేవానాం - శక్రాదీనాం శరీరతః ।**
**నిర్గతం సుమహత్తేజ - స్తచ్చైక్యం సమగచ్ఛత ॥**

కోపంతో భయంకరంగా మారిన విష్ణువు ముఖం నుంచి గొప్ప తేజస్సు బయటకు వచ్చింది. అదే విధంగా బ్రహ్మ, శివుల ముఖముల నుండి కూడా తేజస్సు బయటకు వచ్చింది. అంతే కాదు అక్కడ ఉన్న ఇంద్రాది దేవతల ముఖాలనుండి కూడా వారి తేజస్సు బయటకు వచ్చింది.

**అతీవ తేజసః కూటం - జ్వలంతమివ పర్వతమ్ ।**
**దదృశుస్తే సురా స్తత్ర - జ్వాలావ్యాప్త దిగంతరమ్ ॥**
**అతులం తత్ర తత్తేజః - సర్వదేవశరీరజమ్ ।**
**ఏకస్థం తదభూ న్నారీ - వ్యాప్తలోకత్రయం త్విషా ॥**

దేవతల అందరి శరీరాలనుండి వచ్చినటువంటి అన్ని వైపులకు కాంతులు వేదజల్లుతూ, మండుతున్న అగ్ని పర్వతంలాగా ఉన్నది. దాని కాంతులు ముల్లోకాలకూ వ్యాపిస్తున్నాయి. ఈ రకంగా దేవత లందరి శరీరముల నుండి వచ్చినటువంటి ఆ తేజస్సు ఒక స్త్రీ రూపం దాల్చింది. వివిధ దేవతల తేజస్సు ఆ స్త్రీమూర్తి శరీరంలోని వివిధ అంగాలు అయినాయి.

**య దభూ చ్ఛాంభవం తేజ - స్తేనాऽజాయత తన్ముఖమ్ ।**
**యామ్యేన చాభవన్ కేశా - బాహవో విష్ణుతేజసా ॥**
**సౌమ్యేన స్తనయో ర్యుగ్మం - మధ్య మైంద్రేణ చా భవత్ ।**
**వారుణేన చ జంఘోరూ - నితంబ స్తేజసా భువః ॥**

శివుని యొక్క తేజస్సుతో ఆమె ముఖము ప్రకాశిస్తున్నది.

యముని యొక్క తేజస్సుతో - కేశపాశాలు

విష్ణువు యొక్క తేజస్సుతో - బాహువులు

చంద్రుని యొక్క తేజస్సుతో - స్తనద్వయము

ఇంద్రుని యొక్క తేజస్సుతో - నడుము

వరుణుని యొక్క తేజస్సుతో - పిక్కలు, తొడలు

భూమి యొక్క తేజస్సుతో - పిరుదులు

| | | |
|---|---|---|
| బ్రహ్మ యొక్క తేజస్సుతో | - | పాదాలు |
| సూర్యుని యొక్క తేజస్సుతో | - | కాలివ్రేళ్ళు |
| అష్టవసువుల యొక్క తేజస్సుతో | - | చేతివేళ్ళు |
| కుబేరుని యొక్క తేజస్సుతో | - | నాసిక (ముక్కు) |
| ప్రజాపతి యొక్క తేజస్సుతో | - | దంతాలు |
| అగ్ని యొక్క తేజస్సుతో | - | మూడు నేత్రాలు |
| రెండుసంధ్యల యొక్క తేజస్సుతో | - | కనుబొమలు |
| వాయువు యొక్క తేజస్సుతో | - | చెవులు |

**తతః సమస్తదేవానాం - తేజోరాశిసముద్భవామ్ ।**
**తాం విలోక్య ముదం ప్రాపు - రమరా మహిషార్దితాః ॥**

ఈ రకంగా దేవతలందరి యొక్క తేజస్సు నుంచి ఉద్భవించిన ఆమెను చూసి మహిషుని చేత బాధించబడినటువంటి దేవతలంతా సంతసించారు. ఇప్పుడు ఒక స్త్రీమూర్తి ఆవిర్భవించటం బాగానే ఉంది. దేవతల అందరి తేజస్సుతోను ఉద్భవించింది. కాబట్టి మహిషుడు స్త్రీమూర్తి చేతిలో తప్ప ఇతరులచేత చావడు కాబట్టి దేవతలందరికీ ఆనందంగానే ఉంది. అయితే యుద్ధం చెయ్యటానికి ఆమెకు ఏ రకమైన ఆయుధాలూ లేవు. మరి ఏ రకంగా ఆ రాక్షసుని సంహరిస్తుంది? ఆలోచించారు దేవతలు. ఇంతలో

**శూలం శూలా ద్వినిష్కృష్య - దదౌ తస్యై పినాకధృక్ ।**
**చక్రం చ దత్తవాన్ కృష్ణః - సముత్పాట్య స్వచక్రతః ॥**

పినాకపాణి అంటే శివుడు తన శూలమునుండి ఒక శూలాన్ని తీసి ఆమెకు ఇచ్చాడు. విష్ణువు తన చక్రంలో నుంచి ఒక చక్రాన్ని తీసి ఇచ్చాడు. ఈ రకంగా

| | | |
|---|---|---|
| వరుణుడు | - | శంఖాన్ని ఇచ్చాడు |
| అగ్నిదేవుడు | - | బల్లెము నిచ్చాడు |
| వాయుదేవుడు | - | ధనుస్సు, బాణాలతో నిండిన రెండు అమ్ములపొదులు ఇచ్చాడు. |

ఇంద్రుడు - వజ్రాయుధాన్నిచ్చాడు, తన ఐరావతం యొక్క ఘంటలో నుండి ఒక ఘంటను కూడా ఇచ్చాడు.

యముడు - కాలదండాన్ని ఇచ్చాడు

వరుణుడు - పాశము

బ్రహ్మ - అక్షమాల, కమండలము

సూర్యుడు - ఆమె సమస్త రోమ కూపములందు తన కిరణాల నిచ్చాడు.

కాలాధిష్ఠాతృదేవత - కత్తి, డాలు.

ఈ రకంగా దేవతలందరూ శక్తివంతమైన తమ తమ ఆయుధాలను ఆ దేవికి సమర్పించారు. అయితే ఆమె కట్టుకోటానికి బట్టలు లేవు పెట్టుకోవటానికి హారాలు లేవు, సంచరించటానికి వాహనం లేదు. అప్పుడు

క్షీరోద శ్చామలం హార - మజరే చ తథాంబరే ।
చూడామణిం తథా దివ్యం - కుండలే కటకాని చ ॥
అర్ధచంద్రం తథా దివ్యం - కేయూరాన్ సర్వబాహుషు ।
నూపురౌ విమలౌ తద్వ - ద్గ్రైవేయక మనుత్తమమ్॥

పాల సముద్రము - ఒక ముత్యాలహారము, ఎన్నటికీ మాసిపోనివి, చీరెలు చిరిగిపోనివి రెండు చీరలు, చూడామణి అంటే తలమీద పెట్టుకునే ఆభరణం - దీన్నే శరోరత్నము అంటారు. చూడామణి, చెవికమ్మలు, కటికములు, చేతికి వేసుకునే గాజులు, అర్ధచంద్రాభరణము, చేతులకు భుజకీర్తులు, కాలికి అందెలు, ఇవే మంజీరములు. కంఠాభరణము (మెడలో వేసుకునే హారము)

అంగుళాయకరత్నాని - సమస్తా స్వంగుళీషు చ ।

అన్ని వ్రేళ్ళకు రత్నాలు పొదిగిన ఉంగరాలు ఇచ్చాడు.

విశ్వకర్మ - గొప్ప శక్తి గల గండ్రగొడ్డలి, అనేక అస్త్రములు, చెక్కుచెదరని కవచము ఇచ్చాడు.

సముద్రుడు - తలమీద ధరించటంకోసం ఎన్నటికీ వాడని రెండు తామరపూలు, చేతితో పట్టుకోవటానికి అందమైన పద్మాన్ని ఇచ్చాడు.

**హిమవాన్వాహనం సింహం రత్నాని వివిధాని చ**

హిమవంతుడు సింహవానాన్ని, అనేక రత్నాలను ఇచ్చాడు.

కుబేరుడు - ఎన్నటికీ తరిగిపోని మద్యము గల పానపాత్ర

ఆదిశేషుడు - రత్నాలతో అలంకరించిన సర్పహారాన్ని.

ఈ రకంగా దేవతలంతా విశేషమైన శక్తి గల అనేక రకాలయిన ఆయుధాలు, వివిధాభరణాలను ఆ దేవికి సమర్పించారు.

సమ్మానితా ననాదేచ్చైః - సాట్టహాసం ముహు ర్ముహుః ।
తస్యా నాదేన ఘోరేణ కృత్స్న మాపూరితం నభః ॥

దేవతలు ఇచ్చినటువంటి ఆయుధాలు, వివిధరకాలైన ఆభరణాలు ధరించి ఆ దేవి పెద్దపెట్టున అట్టహాసం చేసింది. భయంకరమైన ఆ శబ్దానికి ఆకాశం ప్రతిధ్వనించింది. లోకాలు గడగడావణికిపోయినాయి. సముద్రాలు అతలాకుతలం అయినాయి. దిక్కులు పిక్కటిల్లినాయి. భూనభోంతరాళాలు దద్దరిల్లినాయి. భూమి చలించిపోయింది. పర్వతాలు కదలిపోయినాయి. దేవతలంతా ఆ దేవికి జయజయధ్వానాలు చేశారు. మునులు ఋషులు అందరూ ఆమెను పరిపరివిధాల స్తుతించారు.

పెద్దపెట్టునవచ్చిన ఆ శబ్దాన్ని విన్నారు రాక్షసులు. అది ఎక్కడనుంచి వచ్చిందో వారికి అర్థం కాలేదు. ఆ శబ్దాన్ని ఎవరు చేశారో తెలియలేదు. అది ఏ రకమైన శబ్దమో వారికి అంతుబట్టలేదు. రాక్షసులు ఏదో కీడును శంకించారు. ఏదో ఉపద్రవం వస్తున్నది అనుకున్నారు. ఎందుకైనా మంచిది అని ఆయుధాలు తీసుకుని సైన్యాన్ని సర్వసన్నద్ధం చేశారు.

రాక్షస రాజైన మహిషాసురుడు కూడా ఆ భయంకరమైన శబ్దం విన్నాడు. అదేమిటో అతడికీ అంతుబట్టలేదు. దాంతో బాగా కోపం వచ్చింది. అహంకారంతో ఒక్కసారి హూంకరించాడు. అసంఖ్యాకమైన రాక్షసగణాలను వెంటపెట్టుకుని ఆ శబ్దం వచ్చిన వైపుగా పరుగెత్తాడు. అలా

పరుగెత్తి పరుగెత్తి ఒక నిర్జన ప్రదేశం చేరాడు. అక్కడ ఆ దేవి అతడికి సాక్షాత్కరించింది. అప్పుడు ఆమె ఎలా ఉన్నది? అంటే

**స దదర్శ తతో దేవీం - వ్యాప్తలోకత్రయాం త్విషా ।**
**పాదాక్రాంత్యానతభువం - కిరీటోల్లిఖితాంబరామ్ ।**
**క్షోభితాశేషపాతాళాం - ధనుర్జ్యానిస్వనేన తామ్ ॥**

ఆ దేవి యొక్క శరీరకాంతులతో ముల్లోకాలు ప్రకాశిస్తున్నాయి. ఆవిడ పాద ఘట్టనలతో భూమి వంగిపోతున్నది. కిరీటము ఆకాశాన్ని తాకుతున్నది. ఆవిడ ధనుష్టంకారానికి లోకాలన్నీ క్షోభిల్లుతున్నాయి. ఆవిడ సహస్ర బాహువులతో దశదిశలను వ్యాపించి ఉన్నది. చూడండి మహిషుని జన్మ ఎంత గొప్పదో? ఏ రూపాన్ని చూడాలని దేవగరుడ గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య, నాగగణాలన్నీ ఎదురు చూస్తుంటాయో? ఏ రూపాన్ని దర్శించాలని అన్నపానీయాలుమాని నియమనిష్ఠలతో మునీశ్వరులు కాలం గడుపుతున్నారో? ఏ రూపాన్ని వీక్షించాలని ప్రాణవాయువును బంధించి యోగులు యోగమార్గంలో కాలం గడుపుతున్నారో? ఏ దేవిని దర్శించాలని ఆస్తికులు యజ్ఞాలు, యాగాలు, జపతపాదులు చేస్తున్నారో అటువంటి పరమేశ్వరి స్వరూపాన్ని దర్శించాడు మహిషుడు. అతడు చేసిన జన్మజన్మల ఫలితం ఇది. అయితే అతడు మూర్ఖుడు. అహంకారి. దురాత్ముడు. అందుచేత వజ్రాన్ని వజ్రంగా గుర్తింలేకపోతున్నాడు. ఎదురుగా పరమేశ్వరి దర్శన మిచ్చినా తెలుసుకోలేని అజ్ఞాని చూశాడు ఆ దేవిని. వెంటనే తన ప్రక్కన ఉన్న సైన్యాన్ని ఆమె మీదికి ఉసిగొల్పాడు. రాక్షసేన ఆ పరమేశ్వరి చుట్టూచేరి వివిధ రకాలయిన ఆయుధాలు ప్రయోగించటం మొదలుపెట్టింది. దేవదానవ సంగ్రామం ఆరంభమైంది. రాక్షసులు చిత్ర విచిత్రమైన ఆయుధాలను ప్రయోగిస్తున్నారు. ఆ దేవి వాటిలో కొన్నింటిని మధ్యలోనే త్రుంచి వేస్తున్నది. కొన్నింటిని మొదట్లోనే నాశనం చేస్తున్నది. పోరు ఘోరమవుతున్నది. మహిషుని యొక్క సేనాని చిక్షురాక్షుడు చతురంగ బలాలతో వచ్చి ఆమెకు ఎదురునుంచున్నాడు. చతురంగ బలాలు అంటే రథ, గజ, తురగ, పదాతి దళాలు. 'చామరుడు' అనే మహాబలశాలి అయిన రాక్షసుడు అతడికి అండగా నిలిచాడు. ఇంతలో 'ఉదగ్రుడు' అనే పేరు గల రాక్షసయోధుడు 60 వేల రథాలతో వచ్చాడు. 'మహాహనుడు' అనే రాక్షస యోధుడు నూరులక్షల రథాలతో దేవికి ఎదురు నిలిచాడు. 'అసిలోముడు'

అనేవాడు 150 లక్షల రథాలతో వచ్చాడు. బాష్కలుడు 60 లక్షల రథాలతో యుద్ధానికి వచ్చాడు. పరివారితుడు అనే రాక్షసుడు కొన్నివేల ఏనుగులను, గుర్రాలను, కోటి రథాలను వెంటపెట్టుకుని యుద్ధానికి వచ్చాడు. బిడాలుడు 700 కోట్ల రథాలకు అధిపత్యం వహించి దేవితో యుద్ధానికి దిగాడు. మిగిలిన కొన్నివేల మంది రాక్షసులు చతురంగబలాలతో ఆ దేవిని చుట్టుముట్టారు.

ఆ యుద్ధంలో మహిషాసురుడు కొన్ని లక్షల ఏనుగులు, గుర్రాలు, రథాలతో పరివేష్టించబడి ఉన్నాడు. అంటే అతని చుట్టూ ఈ బలగమంతా ఉన్నదన్నమాట. రాక్షస వీరులంతా బల్లాలు, కత్తులు, గదలు, గొడ్డళ్ళు, రోకళ్ళు ధరించి యుద్ధచేస్తున్నారు. కొందరు పాశాలను, మరికొందరు శూలాలను ఆ దేవి మీదకు విసురుతున్నారు. ఆమెను సంహరించటంకోసం కొంతమంది ఆమెను కత్తులతో కొడుతున్నారు. రాక్షసులు ప్రయోగించిన శస్త్రాస్త్రాలను ఆ దేవి అవలీలగా ఖండించి వేసింది ఏ మాత్రమూ హైరానాపడకుండా రాక్షసుల మీద ఆయుధాలను ప్రయోగిస్తున్నది. దేవి వాహనమైన సింహము ఒక్కసారిగా జూలు విదిల్చి, పెద్దగా గర్జించి మహారణ్యంలో కార్చిచ్చులాగా రాక్షససేనపై పడింది. యుద్ధంచేస్తూ మధ్యలో ఆమె నిటూర్పులు వదుల్తోంది. ఆ నిట్టూర్పుల నుంచి కొన్ని వేలు, లక్షలు సైన్యము పుడుతోంది. ఆ సైన్యమంతా గండ్రగొళ్ళలు, కత్తులు ధరించి రాక్షససైన్యాన్ని నాశనం చేస్తున్నది.

**అవాదయంత పటహాన్ - గణా శ్శంఖాం స్తథాఽపరే ।**
**మృదంగాంశ్చ తథైవాఽన్యే - తస్మి న్యుద్ధమహోత్సవే ।**
**తతో దేవీ త్రిశూలేన - గదయా శక్తిఋష్టిభిః ॥**

ఈ రకంగా భీకరమైన యుద్ధం జరుగుతుండగా, ఆ రణోత్సాహంలో కొందరు తప్పెటలు వాయిస్తున్నారు. కొందరు శంఖాలు ఊదుతున్నారు. మరికొందరు మృదంగాలు వాయిస్తున్నారు.

ఆ సమయంలో దేవి రాక్షసులను తన త్రిశూలంతో గ్రుచ్చి చంపుతున్నది. కొందరిని గదతో మోది, కొందరిని బల్లెములతో పొడిచి ఇంకొందరిని కత్తితో నరికి చంపింది. ఆమె చేతిలో ఉన్న ఘంటానాదానికి రాక్షసుల చెవులు తలలు పగిలిపోయినాయి. రాక్షసులను ఒక వైపు పాశంతో కట్టి ఈడుస్తున్నది. కొందరిని కత్తితో రెండు ముక్కలుగా నరుకుతున్నది. ఆమె

చేతిలోని గదతో దెబ్బ తగిలినవారు ఇంక లేవటంలేదు. ఆమె రోకటిపోటుకు నెత్తురు కక్కుకుని మరణిస్తున్నారు.

కొందరు రాక్షసవీరులను ఆ దేవి తన త్రిశూలంతో గుండెలు చీల్చి వేసింది. ఆమె ప్రయోగించిన బాణాలు ఒళ్ళంతా గుచ్చుకుని రాక్షసులు ముళ్ళసందులలాగా కనిపిస్తున్నారు. కొందరికి చేతులు తెగిపోయినాయి. కొందరికి కాళ్ళు తెగిపోయినాయి. కొందరికి కంఠాలు తెగిపోయినాయి. కొందరి తలలు భూమి మీద బంతులలాగా దొర్లుతున్నాయి. ఒక కన్ను, ఒక కాలు, ఒక చేయితో ఇంకా బ్రతికి ఉన్న రాక్షసులను దేవి ముక్కలు ముక్కలుగా నరుకుతున్నది.

తెగిపోయిన కొన్ని మొండాలు ఆయుధాలు ధరించి ఇంకా పరుగెదు తున్నాయి. మరికొన్ని మొండేలు మ్రోగుతున్న వాద్యాలకు అనుగుణంగా నృత్యం చేస్తున్నాయి.

కొంతమంది మహావీరుల శరీరాలు తెగిపోయినప్పటికీ, ఆ మొండాలు కత్తులు, బల్లాలు పట్టుకుని దేవి మీదికి పోతున్నాయి. అప్పుడే తెగిన తలలు కేకలు పెడుతున్నాయి. యుద్ధభూమి అంతా ఏనుగుల, గుర్రాల, సైనికుల శవాలతో చిందరవందరగా ఉన్నది. విరిగిపోయిన రథాలు, ముక్కలైన రక్తం ఏరులై పారుతున్నది. ఆయుధాలు అడ్డదిడ్డంగా పడిఉన్నాయి. రక్తం ఏరులై పారుతున్నది. ఆ ప్రదేశమంతా నడవడానికి కాదు కదా కాలుపెట్టటానికి కూడా వీలులేకుండా ఉన్నది.

ఏనుగులు, గుర్రాలు, మహాసైన్యము యొక్క రక్తము నదిలాగా ప్రవహిస్తున్నది. గడ్డిమోపును అగ్ని దహించి వేసినట్లుగా రాక్షస సైన్యాన్ని ఆ పరమేశ్వరి క్షణంలో నాశనం చేసింది.

దేవి వాహనమైన సింహము రాక్షసవీరుల దేహంలో ఇంకా ఎక్కడైనా ప్రాణమున్నదేమో అని ఆ ప్రదేశమంతా వెదుకుతున్నది.

**యథై షాం తుతుషు ర్దేవాః - పుష్పవృష్టిముచో దివి ॥**

ఆ సమయంలో దేవి చేసిన రాక్షస సంహారాన్ని కనులారా కాంచిన దేవతలు పూలవాన కురిపించారు అంటూ రెండవ అధ్యాయాన్ని పూర్తి చేశారు.



# మహిషాసుర వధ

## తృతీయాధ్యాయము

ఈ అధ్యాయంలో 44 శ్లోకాలున్నాయి.

ఋషిరువాచ ఋషి చెబుతున్నాడు.

ఇప్పటి వరకు రెండవ అధ్యాయంలో మహిషాసుర సైన్యవధను వివరించిన మహర్షి ఇప్పుడంటున్నాడు : రాజా!

**నిహన్య మానం తత్సైన్య మవలోక్య మహాసురః ।**
**సేనానీ శ్చిక్షురః కోపా ద్యయౌ యోద్ధు మథాఽంబికామ్ ॥**

**స దేవీం శరవర్షేణ వవర్ష సమరేఽసురః ।**
**యథామేరుగిరేః శృంగం తోయవర్షేణ తోయదః ॥**

తన యొక్క సైన్యమంతా నాశన మయిపోవటం చూసినటువంటి సేనాధిపతి అయిన చిక్షురాక్షుడు కోపంతో ఊగిపోయాడు. అశేష బలపరాక్రమాలు గలిగినటువంటి రాక్షససేన ఈ రకంగా పరాజయం పాలుకావటం అతడు భరించలేక, మితిమీరిన ఆవేశంతో దేవితో యుద్ధానికి వచ్చాడు. వచ్చేరావటంతోనే మేరుపర్వతం మీద వర్షం కురిసినట్లుగా ఆ దేవి మీద శరవర్షం కురిపించాడు. మేరుపర్వతం చాలా ఎత్తైనది చాలా విశాలమైనది. అందుచేత మేఘాలు ఆ పర్వతాన్ని దాటిపోలేవు. ఆ కారణంగా మేఘం పూర్తిగా ఆ పర్వతం మీద వర్షిస్తుంది. అదే విధంగా మహిషుని యొక్క సేనాని అయిన చిక్షురుడు కూడా మేరు పర్వతం మీద మేఘంలాగా ఎడతెరిపి లేకుండా శరవర్షం కురిపించాడు. పరమేశ్వరి ఎదురుదాడి చేసింది. ఆ రాక్షసుడు ప్రయోగించిన బాణాలన్నింటినీ మధ్యలోనే త్రుంచిపారేసింది. అదనుచూసి పదునైన బాణాలతో అతని రథానికి పూన్చిన అశ్వాలను, సారథిని సంహరించింది. ఈ హఠాత్పరిణామానికి నివ్వెరపోయినాడు చిక్షురుడు. అతడు తేరుకొనే లోపల ఆ రాక్షస వీరుని చేతిలో గల ధనుస్సు విరిగిపోయింది. చూస్తూండగానే అతని రథం విరిగి ముక్కలైపోయింది. ఏం చెయ్యాలో పాలుపోలేదు అతడికి. ప్రక్కనే ఉన్న ఇంకొక ఆయుధం తీసుకోపోయేంతలో పదునైన బాణాలు అతని శరీరమంతా గ్రుచ్చుకున్నాయి.

**స చ్ఛిన్నధన్వా విరథో హతాశ్వోహతసారథిః ।**
**అభ్యధావత తాం దేవీం ఖడ్గచర్మధరోఽ సురః ॥**

విల్లు విరిగిపోయింది. రథం లేదు. గుర్రాలు లేవు. సారథి చచ్చిపోయాడు. ఒళ్ళంతా గాయాలైనాయి. అయినప్పటికీ ఊరుకోలేదు అతడు. కత్తి డాలు తీసుకొని ఆ దేవి మీదికి ఉరికాడు. కన్నుమూసి తెరిచే లోపల కత్తితో సింహం తల మీద కొట్టాడు. మరుక్షణంలో ఆ కత్తితో పరమేశ్వరి ఎడమ భుజం మీద ఒక్క దెబ్బ వేశాడు. ఆ ఖడ్గం పరమేశ్వరిని తాకటంతోనే రాతిని తగిలిన మట్టిబెడ్డలాగా ముక్కలు ముక్కలైపోయింది. ఈ రకంగా తన కత్తి విరిగి ముక్కలు కావటం చూసేసరికి కోపంతో సేనాని అయిన చిక్షురుని కనులు ఎర్రబారినాయి. దగ్గరలో ఉన్న శూలాన్ని అందుకున్నాడు. ఆ శూలం గొప్ప కాంతితో ప్రకాశిస్తున్నది. ఆ రాక్షస వీరుడు శూలాన్ని ఆ దేవిపై విసిరాడు. అది ఆకాశం నుండి సూర్యబింబము క్రిందికి రాలిపడినట్టుగా ఆ దేవిని తాకబోయింది. ఆ సమయంలో పరమేశ్వరి తన చేతిలోని కత్తిని మెరుపు వేగంతో విసిరింది. ఆ దెబ్బకు శూలంతో పాటుగా రాక్షసుని శరీరం కూడా నూరు ముక్కలైపోయింది. ఈ రకంగా మహిషాసురుని సేనాని అయిన చిక్షురాక్షుడు యుద్ధంలో మరణించాడు.

**హతే తస్మి న్మహావీర్యే - మహిషస్య చమూపతౌ ।**
**ఆజగామ గజారూఢ - శ్చామర స్త్రిదశార్దనః ॥**

ఎప్పుడైతే సేనాని చిక్షురుడు మరణించాడో, అప్పుడు మహావీరుడైన 'చామరుడు' అనే రాక్షసవీరుడు ఏనుగునెక్కి ఆ దేవిని ఎదిరించటానికి బయలుదేరాడు. వచ్చీరావటంతోనే పదునైన బల్లెం ఒకటి ఆ దేవి మీద విసిరాడు. ఆ దేవి ఒక్క 'హుం' కారంతో ఆ బల్లేన్నికాస్తా నిర్వీర్యం చేసి వేసింది. ఆ బల్లెం నేలమీద పడిపోయింది.

తన బల్లెం ఉపయోగం లేకుండా నేల మీద పడిపోవటం చూసిన చామరుడు, రెట్టించిన పౌరుషంతో ఒక శూలాన్ని విసిరాడు. ఆ పరమేశ్వరి దాన్ని తన బాణాలతో ముక్కలు చేసిపారేసింది. పరమేశ్వరి వాహనమైన సింహము ఒక్క ఎగురు ఎగిరి ఏనుగు కుంభస్థలం మీద కూర్చుని ఆ

రాక్షసునితో తలపడింది. ఈ రకంగా వారిద్దరూ బాహుయుద్ధం చేస్తూ ఏనుగు మీద నుంచి నేలమీదికి వచ్చారు. సింహం భయంకరమైన గర్జనలు చేస్తూ రాక్షసుని మీద పడుతోంది. రాక్షసుడు ఆ సింహాన్ని సర్వ విధాలా ప్రతిఘటిస్తున్నాడు. వీరిద్దరి మధ్యనా పోరు ఘోరంగా సాగుతున్నది. ఈ పరిస్థితిలో ఉన్నట్టుండి దేవి వాహనమైన సింహము ఒక్కసారిగా ఆకాశం లోకి ఎగిరి క్రిందికి దూకుతూ తన ముందరి కుడి కాలి దెబ్బతో చామరుని శిరస్సు ఖండించి వేసింది. ఆ దెబ్బకు రాక్షసుడి తల ఎగిరి క్రింది పడిపోయింది.

చామరుడు కూడా మరణించేప్పటికి మిగిలిన రాక్షసవీరులు ఒక్కసారిగా ఆ పరమేశ్వరిని చుట్టుముట్టారు. అన్నివైపుల నుంచి ఆవిడ మీదకు ఆయుధాలను ప్రయోగిస్తున్నారు. పరిస్థితిని గమనించింది పరమేశ్వరి. ఇక ఉపేక్షించి లాభంలేదని నిశ్చయించుకుని వీర విహారం చెయ్యటం మొదలుపెట్టింది. 'ఉదగ్రుడు' అనే వాణ్ణి రాళ్ళతో కొట్టి చంపింది. 'కరాళుడు' అనే రాక్షసవీరుని పిడికిళ్ళతో పొడిచి చంపింది. 'ఉద్ధతుడు' అనే రాక్షసుణ్ణి తన గదతో మోది చూర్ణం చేసింది. 'భాష్కలుడి'ని ఇనుపకట్లు వేసిన గుదియతో తల పగలకొట్టి చంపింది. తామ్రుడు, బంధకుడు అనేవారిని బాణాలతో సంహరించింది. ఉగ్రాస్యుడు, ఉగ్రవీర్యుడు అనే వారిని త్రిశూలంతో గ్రుచ్చి చంపింది. బిడాలుని శిరస్సు కత్తితో తెగనరికింది. దుర్ధరుడు, దుర్ముఖుడు అనే వారిని బాణాలతో గ్రుచ్చి గ్రుచ్చి చంపింది.

**ఏవం సంక్షీయమాణే తు - స్వసైన్యే మహిషాసురః ।**
**మాహిషేణ స్వరూపేణ - త్రాసయామాస తాన్ గణాన్ ॥**

తన సైన్యమంతా ఈ రకంగా నాశనమైపోవటం చూశాడు మహిషాసురుడు. స్వయంగా తాను మహిష రూపం ధరించి పరమేశ్వరి సైన్యాన్ని ఎదిరించాడు. అతడి దెబ్బకు దేవతా సైన్యం భీతిల్లిపోయింది. ఇక విజృంభించాడు మహిషాసురుడు. దేవతా సైన్యంలో కొందరిని తన మోరతోకొట్టి పడగొట్టాడు. కొందరిని తన రంకెలతో అదరగొట్టి చంపేశాడు. కొందరిని తను గిరగిరా తిరుగుతూ త్రొక్కి చంపేశాడు. ఇంకొందరు అతడు వదలిన గాలికి మరణించారు.

మహావీరుడైన మహిషాసురుడు నేల మీద గిట్టలతో భూమిని దుమ్ముగా చేస్తున్నాడు. పెద్ద పెద్ద పర్వతాలను తన కొమ్ములతో ఎగురేస్తున్నాడు. భయంకరంగా రంకెలు పెడుతున్నాడు. అతడి రంకెలకు భూనభోంతరాళాలు దద్దరిల్లిపోతున్నాయి. అతడు గిరగిరా తిరుగుతూంటే భూమి అరిగిపోతోంది. అతడు తోకను విసురుతూంటే సముద్రాలు అల్లకల్లోలం అవుతున్నాయి. కొమ్ములు కదుపుతుంటే మేఘాలు చిందర వందర అవుతున్నాయి. గాలి వదులుతుంటే ఆ వేగానికి పర్వతాలు ఎగిరి పడుతున్నాయి. ఈ రకంగా భయంకరమైన యుద్ధం చేస్తూ దేవి వాహనమైన సింహాన్ని చంపబోయాడు. చూసింది చండిక. ఇక లాభం లేదనుకుని తన చేతిలోని పాశంతో అతణ్ణి బంధించి వేసింది.

ఈ రకంగా బంధించబడగానే ఆ రాక్షసుడు తన మహిష రూపాన్ని వదలిపెట్టి సింహం అయినాడు. అంబిక ఆ సింహం తలనరికి పారేసింది. ఆ రాక్షసుడు మనిషిగా మారి కత్తి చేత్తో తీసుకుని ఆమె మీదికి వెళ్ళాడు. మరుక్షణమే పరమేశ్వరి అతడి చేతిలోని కత్తిని, డాలును ముక్కలు చేసి వేసింది. దాంతో అతడు పెద్ద ఏనుగు అయి ఘీంకారం చేస్తూ తన తొండంతో దేవి వాహనమైన సింహాన్ని చుట్టేశాడు.. పరమేశ్వరి కత్తితో ఏనుగు తొండాన్ని నరికి వేసింది. వెంటనే ఆ రాక్షసుడు మహిష రూపందాల్చి ముల్లోకాలను అల్లకల్లోలం చెయ్యటం మొదలుపెట్టాడు.

**తతః క్రుద్ధా జగన్మాతా - చండికా పానముత్తమమ్ ।**
**పపౌ పునః పునశ్చైవ - జహాసారుణలోచనా ॥**

అదంతా చూసినటువంటి జగన్మాత అయిన ఆ చండిక తన చేతిలోని దివ్యపానీయాన్ని త్రాగుతూ కోపంతో వికటాట్టహాసం చేసింది. ఆ రాక్షసుడు కూడా మదోన్మత్తుడై మహానాదం చేసి, తన కొమ్ములతో పర్వతాలను ఎత్తి చండిక మీదికి విసిరాడు. తన మీదికి విసరబడిన పర్వతాలను ఆ దేవి తన బాణాలతో నుగ్గునుగ్గు చేసి మితిమీరిన కోపంతో మాటలు తడబడగా

**గర్జ గర్జ క్షణం మూఢ - మధు యావ త్పిబామ్యహమ్ ।**
**మయా త్వయి హతేఽత్రైవ - గర్జిష్యం త్యాశు దేవతా ॥**

"ఓరీ మూర్ఖుడా! ఇంకెంత సేపు. నేను ఈ దివ్యపానీయాన్ని త్రాగేవరకేరా నువ్వు గర్జించేది. ఆ తరువాత నిన్ను నేను చంపేస్తాను. అది చూసి దేవతలు త్వరలోనే ఆనందంతో కేకలు వేస్తారు" అని ఎగిరి ఆ రాక్షసుని మీదపడి, కాలితో అతని కంఠాన్ని త్రొక్కిపట్టి శూలంతో ఒక్క పోటు పొడిచింది. ఆ దెబ్బతో అతడు తన మహిష రూపం వదలి నిజరూపం అంటే శరీరం మాత్రం మనిషి, దున్నపోతు తల ధరించాడు. ఆ రకంగా ఉన్న మహిషాసురుని తలను పరమేశ్వరి తన కత్తితో నరికి చంపేసింది. ఆ దృశ్యాన్ని చూసిన రాక్షస గణాలన్నీ హాహాకారాలు చేస్తూ పారిపోయినాయి.

**తుష్టువు స్తాం సురా దేవీం - సహ దివ్యై ర్మహర్షిభిః ।**
**జగు ర్గంధర్వపతయో - ననృతు శ్చాప్సరోగణాః ॥**

దేవత లందరూ ఆనందంతో గంతులు వేశారు. మహర్షులు పరమేశ్వరిని పరిపరి విధాల స్తుతించారు. అప్సరలు ఆడారు. గంధర్వులు పాడారు.

అంటూ మూడవ అధ్యాయంలో మహిషాసుర వధను పూర్తి చేశారు.



# శక్రాది స్తుతి

## నాల్గవ అధ్యాయము

ఈ అధ్యాయంలో 42 శ్లోకాలున్నాయి.

శౌర్య, బల, పరాక్రమ సంపన్నుడు, వరబలగర్వితుడు, దుర్మార్గుడు, దురాత్ముడు, ధర్మ నాశకుడు, సురవైరి అయిన మహిషాసురుడు, అతని సేనాసమూహమూ పూర్తిగా నశించిపోయింది. పరమేశ్వరి వీరి నందరినీ సంహరించింది. అప్పుడు ఇంద్రాది దేవతలందరూ భక్తి వినమ్రులై చేతులు జోడించి, కనుల వెంట ఆనందబాష్పాలు చిందిస్తూ ముక్తకంఠంతో ఆ పరమేశ్వరుని పరిపరి విధాల కీర్తించారు. నాల్గవ అధ్యాయలలో ఇంద్రాది దేవతలు చేసిన ఈ స్తోత్రాన్ని పఠించినట్లైతే మధ్యమ చరితము పారాయణచేసిన ఫలితము వస్తుంది. ఇది లక్ష్మీప్రదము.

**దేవ్యా యయా తత మిదం జగ దాత్మశక్త్యా -**
**నిశ్శేషదేవగణశక్తి సమూహమూర్త్యా ।**
**తా మంబికా మఖిలదేవమహర్షిపూజ్యామ్ -**
**భక్త్యా నతా స్మ విదధాతు శుభాని సా నః ॥**

ఈ జగత్తు నందంతటను వ్యాపించి ఉండునది, సర్వ దేవగణముల యొక్క మూర్తిరూపమైనది, సర్వదేవతల చేత, మహర్షులచేత ఆరాధింప దగినది అయిన ఆ అంబికకు మేము నమస్కరిస్తున్నాము. ఆ దేవి మాకు శుభముల నిచ్చుగాక !

**యస్యాః ప్రభావ మతులం భగవా ననంతో -**
**బ్రహ్మా హరశ్చ న హి వక్తు మలం బలం చ ।**
**సా చండికాఽ ఖిల జగత్పరిపాలనాయ -**
**నాశాయ చాశుభభయస్య మతిం కరోతు ॥**

చండిక యొక్క శౌర్య బలపరాక్రమాలు అద్వితీయమైనవి. వాటిని త్రిమూర్తులుకూడా వర్ణించలేరు. అటువంటి అసమానమైన శౌర్య పరాక్రమాలు గలిగిన ఆ చండీదేవి తన యొక్క మహిమ వలన లోకాలను

పరిపాలిస్తూ, సర్వజీవులకు కూడా అమంగళము, భయము లేకుండా చూచునుగాక !

యా శ్రీ స్స్వయం సుకృతినాం భవనే ష్వలక్ష్మీః -
పాపాత్మనాం కృతధియాం హృదయేషు బుద్ధిః ।
శ్రద్ధా సతాం కులజనప్రభవస్య లజ్జా -
తాం త్వాం సతా స్స్మ పరిపాలయ దేవి విశ్వమ్ ॥

ఆ పరమేశ్వరి పుణ్యపురుషుల ఇండ్లయందు సంపదగా, పాపాత్ముల ఇండ్లయందు అశుభముగా, విద్వాంసుల హృదయములందు బుద్ధిగా - బుద్ధి అంటే ఇక్కడ 'జ్ఞానము' అని అర్థం. కాబట్టి విద్వాంసులకు జ్ఞానముగా, సత్పురుషుల హృదయముల యందు శ్రద్ధగా, సత్కుల సంజాతుల హృదయ ముల యందు లజ్జగా నిలిచి ఉంటుంది. అటువంటి దేవతామూర్తికి నేను నమస్కరిస్తున్నాను. ఆమె ఈ జగత్తును పాలించుగాక!

కిం వర్ణయామ తవ రూప మచింత్య మేతత్ -
కిం చాతివీర్య మసురక్షయకారి భూరి।
కిం చాహవేషు చరితాని తవాద్భుతాని
సర్వేషు దేవ్యసురదేవగణాదికేషు ॥

ఓ పరమేశ్వరీ! నీయొక్క రూపము ఇది అని ఊహించటానికి కూడా వీలుకాదు. అది మా మనసులకు అందనిది. రాక్షసులతో యుద్ధం చేసే సమయంలో నీ శౌర్య పరాక్రమాలు వర్ణనాతీతము. దేవాసురసంగ్రామం జరిగేటప్పుడు నీవు చేసే అద్భుతాలు ఊహించటానికి కూడా అలవి కాదు. అటువంటి నీ గొప్పదనాన్ని మేము ఏ రకంగా వర్ణించగలము తల్లీ?

హేతు స్సమస్తజగతాం త్రిగుణాఽపి దోషైః -
న జ్ఞాయసే హరిహరాదిభిర ప్యపారా।
సర్వాశ్రయాఽఖిల మిదం జగదంశభూత -
మవ్యాకృతా హి పరమా ప్రకృతి స్త్వమాద్యా ॥

ఓ దేవీ ! సర్వ జగత్తులకు కారణము నీవే. నీవు త్రిగుణాత్మికవు. అయినప్పటికీ ఆ గుణములలోని దోషములు నీకు అంటవు. హరిహరాదులు

కూడా నీ తత్త్వాన్ని తెలుసుకోలేరు. సర్వులకు నీవే అండవు. నీలోని కొంత భాగము నుంచే ఈ జగత్తు సృష్టించబడింది. నీవు అందరికన్నా అధికురాలవు. ఆద్య ప్రకృతివి.

ఇక్కడ చూడండి. ఇంద్రాది దేవతలు పరమేశ్వరిని స్తుతిచేస్తూ 'అమ్మా ! సర్వజగత్తులకు నీవే కారణము' అంటున్నారు. ఇదే విషయాన్ని బృహదారణ్య కోపనిషత్తులో చెబుతున్నారు. ఈ సృష్టికి పూర్వము మకారంలో ఉన్న విరాడాత్మ మాత్రమే ఉన్నది. అదే పరమేశ్వర స్వరూపము. దానికన్న భిన్నమైనది ఏదీలేదు. ఆ తరువాత జగన్నిర్మాణం కోసం పరమేశ్వరుడు తనను తాను రెండుగా విభజించుకున్నాడు. ఆ భాగాలే స్త్రీపురుషులు. వారే స్వాయంభువ మనువు, శతరూప.

ప్రజాపతివల్ల కలిగిన 'శతరూప' కుమార్తెలతో రమించటం నిషిద్ధం కదా ! తననుండి పుట్టిన నాతో ఈ ప్రజాపతి ఏ విధంగా రమిస్తాడు? ఎందుకయినా మంచిది అనుకుని తాను ఆవుగా మారింది. ఇది చూసిన పురుషుడు వృషభమైనాడు. గోసంతతి వర్ధిల్లింది. శతరూప ఆడుగుర్రం అయింది. పురుషుడు మగ గుర్రం అయినాడు. అశ్వసంతతి వర్ధిల్లింది. ఆమె ఆడుగాడిద అయింది. మనువు మగగాడిద అయినాడు. గార్ధభ సంతతి వృద్ధి చెందింది. ఈ రకంగా శతరూప అనేక రూపాలుదాల్చింది. అసలు 'శతరూప' అంటేనే వందరూపములు గలది అని అర్థం. ఇక్కడ వంద అనేది సంఖ్యావాచకము కాదు. అనేకము అనే అర్థంలో వాడబడింది. ఈ రకంగా ఆ స్త్రీ అనేక రూపాలు ధరించింది. పిపీలికాది బ్రహ్మ పర్యంతము స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తంతా సృష్టించబడింది. జగత్తులోని 84 లక్షల రకాలైన జీవరాసి ఉత్పన్నమైంది. నారాయణోపనిషత్తులోని మొదటి అనువాకం చూడండి. సృష్టి ప్రారంభంలో పరమ పురుషుడైన నారాయణుడు ప్రాణులను సృష్టించాడు. అందులో ముందుగా హిరణ్యగర్భుడు పుట్టాడు. తరువాత పంచభూతాలు నారాయణుని నుంచే ఆవిర్భవించినాయి. ఆ తరువాత నారాయణుని నుండి బ్రహ్మ ఉద్భవించాడు. రుద్రుడుద్భవించాడు. ఆ నారాయణుని నుంచే ఇంద్రుడు జన్మించాడు. మరీచి, కశ్యపుడు మొదలైన ప్రజాపతులు ఆవిర్భవించారు. చతుర్వేదములు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు ఆవిర్భవించారు. ఈ రకంగా ఈ

జగత్తంతా అతని నుండే సృష్టింపబడింది. అతడే పరమేశ్వరుడు అని చెప్పబడింది.

బహ్వృచోపనిషత్తులో "ఈ సృష్టికి ముందు ఆ పరమేశ్వరి ఒకతే ఉండేది. ఆమె నుంచే బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, సకల మరుద్గణాలు వచ్చినాయి. ఆ దేవి నుంచే దేవగరుడ గంధర్వ యక్ష కిన్నెర కింపురుష సిద్ధ సాధ్య, నాగగణాలు ఆవిర్భవించినాయి. అండజములు, ఉద్భిజములు, జారజములు, స్వేదజములు, ఊష్మజములు అన్నీ పుట్టినాయి.

అండజములు - గ్రుడ్డునుంచి పుట్టేవి. పాములు, పక్షులు

ఉద్భిజములు - విత్తనాల వలన భూమినుంచి పుట్టే చెట్లుచేమలు

జారజములు - స్త్రీ జనేంద్రియము నుంచి పుట్టేవి

స్వేదజములు - చెమట, మలిన పదార్థాలవలన పుట్టేవి

ఊష్మజములు - వెచ్చదనం వలన పుట్టేవి. క్రిమికీటకాలు

ఈ రకంగా స్థావరజంగమాత్మకమైన జగత్తంతా ఆ పరమేశ్వరుని నుంచే ఆవిర్భవించింది. ఇక్కడ పరమేశ్వరుడు అన్నా పరమేశ్వరి అన్నా రెండూ ఒకటే. ఎందుచేతనంటే - ఆ పరమేశ్వరతత్త్వానికి లింగభేదం లేదు. దేవీభాగవతంలో తారకాసుర సంహారం కోసం దేవతలంతా ఆ పరమేశ్వరిని పరిపరివిధాల ప్రార్థిస్తారు. అప్పుడు చైత్రశుద్ధనవమి శుక్రవారంనాడు ఆ దేవి వారికి ప్రత్యక్షమైంది. ఆమె ఎలా ఉన్నది అంటే-?

**కోటి సూర్యప్రతీకాశం చంద్రకోటి సుశీతలమ్ ॥**
**విద్యుత్కోటి సమానాభమరుణం తత్పరం మహః**
**నైవచోర్ధ్వంనతిర్యక్చునమధ్యే పరిజగ్రభత్ ॥**
**ఆద్యంత రహితం తత్తు నహస్తా ద్యంగ సంయుతం**
**నస్త్రీ రూపమథనానపుం రూపమథోభయమ్ ॥**

కొన్నివేలకోట్ల సూర్యుల కాంతులతో, చంద్రులచల్లదనంతో కొన్నికోట్ల మెరుపుతీగలు ఒక్కసారి ప్రకాశించినట్లుగా తళుక్కున మెరిసింది. దానికి పైన క్రింద మధ్యన అనేదిలేదు. ఆద్యంతాలు లేవు. కాళ్ళు, చేతులు, మొదలైన అంగాలు అసలే లేవు. అది స్త్రీ కాదు. పురుషుడు కాదు. అలా అని

నపుంసకుడు అంతకన్నా కాదు. అంటే పరమేశ్వరతత్త్వానికి లింగభేదం లేదు. కాబట్టి పరమేశ్వర తత్త్వాన్ని చెప్పేటప్పుడు ఉన్నది అన్నా ఉన్నాడు అన్నా తేడా ఏమీ లేదు.

అయితే ఈ సృష్టి చెయ్యాలని సంకల్పించిన పరమేశ్వరుడు తన నుండి కొంతశక్తిని బయటకు పంపాడు. ఆ శక్తి త్రికోణరూపంలో ఉన్నది. అదే మహాయోని. ఆ యోని అనేది స్త్రీలింగం కాబట్టే ఆవిణ్ణి పరమేశ్వరి అంటున్నాము. ఈ జగత్తంతా మహాయోని అంటే ఆ పరమేశ్వరి నుంచే ఆవిర్భవించింది. అందుకే దేవతలంతా 'అమ్మా ! సర్వజగత్తులకు కారణము నీవే' అంటున్నారు. దేవతలు చెబుతున్నారు. ఓ దేవీ ! నీవు త్రిగుణాత్మికవు. త్రిగుణాలు అంటే సత్త్వరజస్తమోగుణాలు. ఈ మూడు గుణాలతోనే జగత్తంతా నిర్మించబడింది. అమ్మవారిని గురించి చెప్పేటప్పుడు లలితా సహస్రంలో 264వ నామం 'సృష్టికర్త్రీ' పూర్వకల్పంలోని జీవరాసుల కర్మవాసనలే 'మాయ' అనబడుతుంది. ఇది జడము. అందుకనే పరమేశ్వరుని యందు అభివ్యక్తమవుతుంది.

సృష్టి చెయ్యటమనేది రజోగుణధర్మం. ఆ పరమేశ్వరి మూలప్రకృతి రూపం పొంది ఈ సృష్టిని చేస్తున్నది. మాయనుంచే త్రిగుణాలు ఆవిర్భవించినాయి. ఈ త్రిగుణాల ఆధారంగానే సృష్టి జరుగుతున్నది. అందుచేతనే సృష్టి మూడు విధాలు. 1. ఏకగుణసృష్టి 2. ద్విగుణసృష్టి 3. త్రిగుణసృష్టి. దీనిమీద వివరాలకోసం నేను వ్రాసిన 'శ్రీవిద్యాసారధి' లలితాసహస్రనామభాష్యంలోని 417వ పేజీలో 264వ నామం చూడండి.

త్రిగుణములు ఆ దేవి నుంచే ఆవిర్భవించాయి కాబట్టి ఆమె త్రిగుణాత్మిక. అయినప్పటికీ గుణాలవలన వచ్చే దోషాలు ఏవీ ఆమెనంటవు.

ఆమె యొక్క శక్తిని హరిహర బ్రహ్మాదులు కూడా తెలుసుకోలేరు. శంకరభగవత్పాదుల వారు తమ సౌందర్య లహరిలోని మొదటి శ్లోకంలో శివశక్త్యాయుక్తో....... ప్రభవతి.

"ఓ భగవతీ! సర్వమంగళ సహితుడైన ఈశ్వరుడు కూడా నీతో కూడితేనే కాని ఈ జగత్తును నిర్మించటానికి సమర్థుడు కాదు. నీవు లేకపోతే అతడు కదలటానికి కూడా అశక్తుడు. నీ తత్త్వము ఏమిటో హరిహర

బ్రహ్మాదులకు కూడా తెలియదు. అటువంటి నిన్ను పూజించాలన్నా, నీకు నమస్కరించాలన్నా పూర్వజన్మకృతము ఉండాలి కదా!"

పరమేశ్వరి తత్త్వము అనేది హరిహర బ్రహ్మాదులకు కూడా తెలియదు. సృష్టిలో మొదటగా వచ్చినవాడు బ్రహ్మ. ఆ తరువాత విష్ణువు. రుద్రుడు. వారే త్రిమూర్తులు. సనాతనులు. వీరికే ఆ దేవిని గురించి తెలియదు అంటే ఇంకెవరికి తెలుస్తుంది?

ఈ జగత్తంతా ఆ పరమేశ్వర స్వరూపంలోని కొంతభాగంనుంచి మాత్రమే ఆవిర్భవించింది. పరమేశ్వరిలోని 1/4 వంతు భాగంనుంచి మనకు తెలిసిన ఈ జగత్తు వచ్చింది. 'లలితాసహస్రంలోని' 620వ నామం 'ఏకకోటిబ్రహ్మాండజననీ' – అనేక కోట్ల బ్రహ్మాండాలను సృష్టించినటువంటిది. మనం నివసించే ఈ జగత్తంతా దిక్పాలకులతో, సూర్యచంద్రాదిగ్రహాలతో, త్రిమూర్తులు, త్రిశక్తులు మొదలైన వారితో నిండి ఉన్నది. ఇదే ఒక బ్రహ్మాండం. ఇటువంటివి అనేక కోట్ల బ్రహ్మాండాలను సృష్టించింది. మహాసంకల్పంలో **మహాజలౌఘస్యమధ్యేపరిభ్రమమాణానాం, అనేక కోటిబ్రహ్మాండానాం ఏకతయే...**

మహాజలరాశి నడుమ పరిభ్రమిస్తున్నటు వంటి అనేక కోట్ల బ్రహ్మాండాలయందు ఒకదానిలో మనం ఉన్నాము. ఇది భూలోకం. దీని క్రింద ఏడు లోకాలు పైన ఆరు లోకాలు ఉన్నాయి.

**అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల,**
**పాతాళ సప్తలోకానాం ఉపరితలే.....**

అవన్నీ అధోలోకాలు. వాటికి పైభాగాన

**భూ, ర్భువ, స్సువ, ర్మహ, ర్జన, స్తప, స్సత్య మితి సప్త లోకానాః అధోభాగే...**

భూలోక, భువర్లోక, సువర్లోక, మహాలోక, జనోలోక, తపోలోక, సత్యలోకాలు – ఇవి ఊర్ధ్వలోకాలు. మనం ఎలా ఉన్నామో ఆ లోకాలవారు కూడా అలాగే ఉంటారు. సైన్సు ప్రకారం ఇతర గ్రహాలలో కూడా నీరున్నది. ఆక్సిజనున్నది. అక్కడ జీవులు నివసించిన ఛాయ లున్నాయి. సౌరకుటుం

బానికి సుమారు 150 కాంతి సంవత్సరాల దూరంలో ఉన్న ఒక గ్రహం మీద ప్రాణవాయుఉన్నది. ఆ గ్రహం పేరు 'ఒసిరిస్' 7-2-04 ఆంధ్రజ్యోతి.

కాబట్టి మనకు తెలియనివి, మన కంటికి కనుపించనివి అనేక లోకాలున్నాయి. వాటన్నింటినీ కూడా సృష్టించినది ఈ పరమేశ్వరియే.

దేవీ భాగవతంలో మధుకైటభ సంహారం జరిగింది. అప్పుడు త్రిమూర్తులు పరమేశ్వరిని ప్రార్థించారు.

ఇంతలో ఆకాశం నుండి ఒక దివ్యమైన విమానం వచ్చింది. అందులో ఒక దివ్యకాంత కూర్చుని ఉన్నది. త్రిమూర్తులు ఆ విమానం అధిరోహించారు. అది మహావేగంతో బయలుదేరింది. కొంతసేపటికి నీరులేని చోటు వచ్చింది. అక్కడ ఒక మహానగరం. అందమైన ఫలవృక్షాలు, పుష్పవృక్షాలు, ఆకాశసౌధాలు, యజ్ఞశాలలు ఉన్నాయి. ఆ పట్టణానికి దగ్గరలో ఒక అడవి ఉన్నది. ఆ అడవిలో ఒక రాజు వేటాడుతున్నాడు. ఆ పట్టణం ఎవరు నిర్మించారో తెలియదు. ఇంతలో కల్పవృక్షం, కామధేనువు, ఐరావతం కనిపించాయి. కొంచెం దూరంలో అప్సరసలు. అదిగో ఇంద్రుడు .... అది స్వర్గం అనుకున్నారు త్రిమూర్తులు.

విమానం పోయి పోయి బ్రహ్మలోకం చేరింది. అక్కడ ఒక బ్రహ్మ ఉన్నాడు. హరిహరులు తిరిగి ప్రక్కకు చూశారు. బ్రహ్మ ఇక్కడే ఉన్నాడు. మరి ఆ బ్రహ్మ ఎవరు? ఇంతలో విష్ణులోకం వచ్చింది. అక్కడ ఒక విష్ణువున్నాడు. కైలాసం వచ్చింది. అక్కడ శివపార్వతులున్నారు.

ఇక్కడ ఉన్న త్రిమూర్తులు ఇక్కడే ఉన్నారు. వీరు ఇంకా సృష్టి ప్రారంభించలేదు. మరి వారెవరు? అంటే అది ఇంకో బ్రహ్మాండము. ఈ రకంగా అనేక బ్రహ్మాండాలను సృష్టించింది దేవి. అందుచేతనే ఈ జగత్తంతా ఆ పరమేశ్వరిలో ఒక భాగము అంటున్నారు.

ఆవిడ అందరికన్నా అధికురాలు. సృష్టి ప్రారంభం కాక ముందు ఈ జగత్తంతా పరమేశ్వరుడు ఆవరించి ఉన్నాడు. అతని కన్న అధికులు కాని, అతనితో సమానులు కాని ఎవరూ లేరు. అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. అందుకే ఆ పరమేశ్వరి అందరికన్నా అధికురాలు.

'ప్రకృతి స్త్వమాద్యా' - ఆమె ఆద్య ప్రకృతి. సృష్టికారిణి. ఇది రూపరహితమైనది, రూపసహితమైనది. లలితాసహస్రంలో 399వ నామంలో చెప్పినట్లుగా వ్యక్తావ్యక్త స్వరూపిణి. వ్యక్తము అంటే మహత్తత్త్వము. ఇది అవ్యక్తం నుంచి వచ్చింది. అంతటా వ్యాపించినది. సృష్టిలో మొదటగా అవ్యక్తమునుంచి మహత్తత్వము, మహత్తత్త్వము నుంచి అహంకారము పుట్టినాయి. ఈ రకంగా వ్యక్తమైనది అంటే కంటికి కనిపించేది. అవ్యక్తమైనది - కంటికి కనిపించనిది. ఈ రెండూ ఆ పరమేశ్వరియే.

దీన్ని సాంఖ్యులు - ప్రకృతి అంటారు
వేదాంతులు - అవిద్య అంటారు
వైయాకరణులు - శబ్దశక్తి అంటారు
శైవులు - శివశక్తి అంటారు
వైష్ణవులు - విష్ణుమాయ అంటారు
శాక్తేయులు - మహామాయ అంటారు

పౌరాణికులు దీన్నే దేవి అంటారు. అదే ఆద్య ప్రకృతి.

**యస్యా స్సమస్తసురతా సముదీరణేన -**
**తృప్తిం ప్రయాతి సకలేషు మఖేషు దేవి ।**
**స్వాహాఽ సి వై పితృగణస్య చ తృప్తిహేతు -**
**రుచ్చార్యసే త్వ మత ఏవ జనై స్స్వధా చ ॥**

ఓ దేవీ ! యజ్ఞయాగాదులు చేస్తున్నప్పుడు ఏ మంత్రము చెప్పటం చేత సమస్త దేవతలు తృప్తి పొందుతున్నారో, ఆ 'స్వాహా' మంత్రము నీవే. అలాగే పితృదేవతలను తృప్తిపరచే స్వధామంత్రము నీవే. అందుచేతనే జనులు నిన్ను స్వాహా, స్వధా అని అంటారు.

స్వాహా, స్వధా అనేవి పరమేశ్వరి యొక్క రూపాలే తప్ప వేరుకాదు. ఈ విషయమై దేవీ భాగవతంలో వివరంగా చెప్పబడింది.

సృష్టి ప్రారంభమైంది. బ్రహ్మదేవుడు లోకాలన్నింటినీ సృష్టించాడు. ఆ తరువాత దేవతలంతా బ్రహ్మ దగ్గరకు వచ్చి, "విధాతా! మేమంతా ఆకలి బాధకు తట్టుకోలేకుండా ఉన్నాము. దీనికి ఏదైనా ఉపాయం చెప్పవలసినది"

అన్నారు. ఆ మాటలు విన్న బ్రహ్మదేవుడు "ఇలాంటి విషయాలు చెప్పటానికి స్థితికారకుడైన విష్ణుమూర్తి ఉన్నాడు. అతన్ని ప్రార్థించినట్లైతే తరుణోపాయం చెప్పగలడు" అన్నాడు. ప్రజాపతి సలహామీద దేవతలంతా విష్ణులోకానికి వెళ్ళి శ్రీహరిని ప్రార్థించారు. దేవతల ప్రార్థనలాలకించిన విష్ణుమూర్తి "దేవతలారా! భూలోకంలో బ్రాహ్మణులు క్షత్రియులు చేసే యజ్ఞయాగాలకు సంబంధించిన హవ్యము మీ ఆకలిని పోగొడుతుంది. ఆ హవ్యము మీపేరు చెప్పి అగ్నిలో వేస్తారు. కాబట్టి దాన్ని అగ్ని మూలాన మీకు అందించే శక్తి వేరే ఉన్నది. ఆ శక్తి కోసం మీరంతా ఆ పరదేవతను ఆరాధించండి. ఆవిడ ప్రపన్నురాలైతే ఆ శక్తిని పంపుతుంది" అన్నాడు.

దేవతలంతా పరమేశ్వరిని అత్యంత శ్రద్ధాభక్తులతో ఆరాధించారు. దేవి వారి దీక్షకు మెచ్చి ఆ శక్తిని పంపింది. బ్రహ్మ ఆ శక్తికి నమస్కరించి "తల్లీ ! నువ్వు అగ్నికి వాహకశక్తివై ఉండి, అతని యందు హోమం చేసిన హవ్యాన్ని దేవతలకు అందించు" అన్నాడు. దానికి ఆ శక్తి "నేను శ్రీహరికే చెందుతాను తప్ప ఇతరులకు చెందను. కాబట్టి అగ్నికి దాహకశక్తిగా ఉండను" అని చెప్పి తపోవనానికి వెళ్ళిపోయింది.

ఇలా కొంతకాలం గడిచిపోయింది. ఆ శక్తియొక్క తపస్సుకు మెచ్చి శ్రీహరి ప్రత్యక్షమై "దేవీ! నీ మనసు నాకర్థమయింది. వచ్చే జన్మలో నగ్నజితి అనే రాజు యొక్క కుమార్తె 'నాగ్నజితి'గా జన్మించి, నా అంశతో పుట్టిన శ్రీకృష్ణుని వివాహమాడవలసినది. కాని ఈ జన్మలో మాత్రం 'స్వాహా' అనే పేరుతో అగ్నిదేవుని ఇల్లాలివి కావలసింది" అన్నాడు. చేసేదిలేక సరేనంది స్వాహాదేవి. అగ్నిదేవుడికీ, స్వాహాదేవికీ వివాహం జరిగింది.

వారికి ముగ్గురు సంతానం కూడా కలిగారు. వారే 1. ఆహవనీయాగ్ని 2. గార్హపత్యాగ్ని 3. దక్షిణాగ్ని. ఈ రకంగా స్వాహాదేవి యొక్క అనుజ్ఞవల్ల దేవతల ఆకలి తీరింది.

పితృదేవతల శ్రాద్ధకర్మలో తర్పణము ద్వారా ఆహారం లభించేటట్టు చేశాడు బ్రహ్మ. కాని వారికి ఆహారం సక్రమంగా అందటం లేదు. పితృదేవతలంతా బ్రహ్మ దగ్గరకు పోయి వారి బాధలు చెప్పుకున్నారు. వారి బాధలు తీర్చటానికి బ్రహ్మ పరమేశ్వరి అనుగ్రహంవల్ల ఒక కన్యను

సృష్టించాడు. ఆమె పేరు స్వధ. ఆమెను పితృదేవతలకు సమర్పించాడు. శ్రాద్ధకర్మలో పితృదేవతలకు సమర్పించిన దానిని వారికి సవ్యంగా అందించటమే ఈమె పని.

ఈ రకంగా దేవతలకు ఆహుతులందించే స్వాహాదేవి, పితృదేవతలకు తర్పణలందించే స్వధాదేవి ఇద్దరూ కూడా పరమేశ్వరి ప్రతిరూపాలే. అందుకే జనులు ఆ దేవిని స్వాహా అని, స్వధా అని కూడా అంటారు.

**యా ముక్తి హేతు రవిచింత్యమహావ్రతా త్వ -**
**మభ్యస్యసే సునియతేంద్రియ తత్త్వసారైః ।**
**మోక్షార్థిభిర్మునిభి రస్తసమస్తదోషైః -**
**విద్యాఽసి సా భగవతీ పరమా హి దేవీ ॥**

ఓ దేవీ ! నీవు భగవతివి. మోక్ష హేతువువు. మహా తపస్సంపన్నులు కోరుకునే పరావిద్యవు. మోక్షాన్ని కోరేవారు, ఇంద్రియాలను అదుపులో ఉంచుకున్నవారు, నీయొక్క తత్త్వము తెలిసికొనుట యందు ఆసక్తి గలవారు, దోషరహితులు అయిన మునులు పరావిద్యవైన నిన్ను అభ్యసిస్తారు. అంటే సాక్షాత్తూ పరమేశ్వరియే 'పరావిద్య' అంటున్నారు. అసలు పరావిద్య అంటే ఏమిటి?

ముండకోపనిషత్తులో శునకుని కుమారుడైన శౌనకుడు తన గురువైన అంగిరస మహర్షి దగ్గరకు వెళ్ళి "గురువర్యా ! దేన్ని గురించి తెలుసుకుంటే సర్వమూ తెలుస్తాయో ఆ విషయాన్ని దయచేసి నాకు వివరించండి" అన్నాడు. ఆ మాటలువిన్న అంగిరసుడు చెబుతున్నాడు : "నాయనా! లోకములో మనం తెలుసుకోవలసిన విద్యలు రెండున్నాయి. 1. పరావిద్య 2. అపరావిద్య. వేదాలలో ఈ రెండు విద్యలే చెప్పబడ్డాయి. ముందుగా అపరావిద్యను గురించి వివరిస్తాను. అపరావిద్య అనేది లౌకిక ప్రయోజనాలకు ఉపకరిస్తుంది. బుద్ధిసంపన్నులైన మహర్షులు వేదాలలో స్వర్గసాధనాలయిన యజ్ఞకర్మలను కనుగొన్నారు. కర్మాచరణపరాయణులు, కర్మవాదులు అందరూ ఆ కర్మలనాచరించి సత్ఫలితాలు పొందారు. కర్మ ఫలాన్ని ఆచరించే వారందరూ అపరావిద్యను ఆశ్రయిస్తారు. చతుర్వేదాలు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, సంగీతము, సాహిత్యము అన్నీ అపరా

విద్యకు సంబంధిచినవి. వీటివల్ల మానవుడు లోకంలో గౌరవం పొందుతాడు, ఉన్నత పదవులు పొందుతాడు. ధనధాన్యాలు భోగభాగ్యాలు, స్వర్గసుఖాలు పొందుతాడు.

వేదాలలో యజ్ఞయాగాదికర్మలు చెప్పబడ్డాయి. ఈ కర్మలను ఆచరిస్తే ఫలితం వస్తుంది. ఈ రకంగా సంసార సుఖాలనుభవించటానికి కావలసిన ధనము, పలుకుబడి లభిస్తాయి. అపరావిద్య ధర్మాధర్మాలు, పుణ్యాపాపాలతో మిళితమై ఉంటుంది. వేదవేదాంగాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు అన్నీ అందులోని భాగాలే. ఈ అపరావిద్యవల్ల జన్మ, జరా, మృత్యు భయం పోదు. ప్రపంచంలో చాలామంది ధనము, కీర్తి, పదవి కావాలని ఇష్టపడతారు. స్వర్గసుఖాలు కావాలని కోరుకుంటారు. వీరందరూ అపరా విద్యను ఉపాసిస్తారు. వీరు విషయవాంఛలలో పడి సతమతమవుతుంటారు. అంతే కాని వీరికి మోక్షం మాత్రం రాదు.

పరావిద్య అనేది మోక్ష విద్య. జ్ఞానేంద్రియాలకు లొంగనిది, కర్మేంద్రియాల విషయంకానిది, గోత్రము, వర్ణము, నేత్రములు, శ్రోత్రములు, కాలుచేతులు లేనిది, నిత్యమైనది, సర్వాత్రావ్యాపించి ఉండునది, సూక్ష్మాతి సూక్ష్మమైనది, అవ్యయమైనది, పంచభూతాలకు కారణమైనది, పరబ్రహ్మ తత్త్వము. అటువంటి తత్త్వాన్ని జ్ఞానియైన వాడు సర్వత్రా చూడగలడు. అటువంటి పరతత్త్వాన్ని గూర్చి బోధించేదే పరావిద్య. పరావిద్యవల్ల ఆత్మానుభవము, బ్రహ్మలోకప్రాప్తి కలుగుతాయి. మోక్షం సిద్ధిస్తుంది.

ఛాందోగ్యోపనిషత్తులో నారదుడు సనత్కుమారుడి దగ్గరకు వచ్చి "స్వామీ! వేదవేదాంగాలు చదివాను. ఎన్నో కళలు నేర్చుకున్నాను. శాస్త్రాలు అభ్యసించాను. సంగీత సాధనచేశాను. కాని మనశ్శాంతి కలుగలేదు. ఆత్మజ్ఞానం కలగటం లేదు. కాబట్టి ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించండి" అని అడుగుతాడు. దానికి సనత్కుమారుడు

"నారదా! ఇంతవరకు నువ్వు అభ్యసించినది కష్టసాధ్యమైన పరావిద్య కాదు. నీకు ఎన్నో సిద్ధాంతాలు తెలుసు. కాని ఆచరణలేదు. వాటి ఆంతర్యం నీకు తెలియదు. నీకు తెలిసిందంతా అపరావిద్య. అదంతా పదాలగారడి. కాబట్టి దాన్ని వదిలి పెట్టి విశ్వమంతా వ్యాపించి ఉన్న ఆత్మతత్త్వాన్ని

తెలుసుకో అది సాధించటానికి మానసిక పవిత్రత కావాలి. మనస్సు మలిన రహితమైతేనే ఆత్మానుభవం కలుగుతుంది. అంతఃకరణ నిర్మలమవుతుంది. అప్పుడు సత్యదర్శనమవుతుంది. సత్యం బాలభానుని లాగా హృదయాం తరాళాలలో ప్రకాశిస్తుంది. అదే పరావిద్య. దీనివల్ల శాశ్వతమైన ఆనందం లభిస్తుంది" అని చెబుతాడు.

లలితాసహస్రంలో 790వ నామము 'పరాపరా' ఆ పరమేశ్వరియే పరావిద్య, అపరావిద్యకూడా. ఇక్కడ దేవతలంతా ఆమెను పరావిద్య అని కీర్తిస్తున్నారు.

**శబ్దాత్మికా సువిమలర్గ్యజుషాం నిధాన -**
**ముద్గీథరమ్యపదపాఠవతాం చ సామ్నామ్ ।**
**దేవీ త్రయీ భగవతీ భవభావనాయ -**
**వార్తాఽసిసర్వజగతాం పరమార్తిహంత్రీ ॥**

ఓ తల్లీ ! నీవు శబ్ద బ్రహ్మమునకు ఆత్మవు. అతినిర్మలమయిన ఋగ్వేదమంత్రాలకు, గానంచేసేటప్పుడు వినటానికి ఉద్గీతవల్ల రమ్యంగా ఉండే సామవేదమంత్రాలకు ఉనికిపట్టువు. నీవే త్రయీవిద్యవు. వేద స్వరూపిణివైన భగవతివి. సంసార జీవనోపాయానివి సర్వదుఃఖాలను పోగొట్టే శ్రేష్ఠురాలవు.

'శబ్దబ్రహ్మము' అంటే ఓంకారము. ఈ ఓంకారమనేది పరబ్రహ్మ స్వరూపము. నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ అతడే గనక ఒక రూపం దాల్చినట్లైతే, ఆ ఆకారం పేరే ఓంకారము.

**ఓంకార మంత్రసంయుక్తం నిత్యం ధ్యాయంతి యోగినః**
**కామదం మోక్షదం తస్మై ఓంకారాయ నమోనమః**

ఓంకారమనే మంత్రాన్ని గనక ధ్యానించినట్లైతే సాధకుడికి ఇహము పరము కూడా సిద్ధిస్తుంది. అంటే ఈ లోకంలో కావలసిన సిరిసంపదలు, భోగభాగ్యాలు అష్టైశ్వర్యాలు లభించటమే కాక చివరిదశలో మోక్షం కూడా కలుగుతుంది. అందుచేత పరబ్రహ్మ స్వరూపమైన ఓంకారానికి నమస్కరిస్తున్నాను.

ఓంకారము యొక్క పవిత్రత, ప్రాముఖ్యతల గురించి ఉపనిషత్తులలో అనేక చోట్ల చెప్పబడింది. ముందుగా 'మాండూక్యోపనిషత్తు'ను చూద్దాం

**ఓ మిత్యేతదక్షర మిదగ్ం సర్వం**

అది హిమాలయ పర్వత ప్రాంతము. వెండిలాగా మెరుస్తున్న తెల్లని మంచు పర్వతాలు. గలగలపారే గంగానది. ప్రశాంతమైన వాతావరణం. ఆ పర్వత ప్రాంతంలో ఒక ఋష్యాశ్రమమం. ఆ ఆశ్రమ ప్రాంగణంలో ఒకచెట్టు క్రింద కొంచెం ఎత్తైన ప్రదేశంలో బ్రహ్మజ్ఞాని అయిన గురువుగారు. అతడి ఎదురుగా కొద్దిగా దిగువన భక్తి శ్రద్ధలతో కూడిన బ్రహ్మజిజ్ఞాసి అయిన శిష్యుడు.

ఈ శిష్యుడు పరమనిష్ఠా గరిష్ఠుడు. సాకారబ్రహ్మోపాసనలో ఆరితేరినవాడు. అతణ్ణి ఒక అనుమానం పట్టి పీడిస్తోంది. 'చరాచరజగత్తంతా నడుస్తున్నది కదా! ఈ జగత్తుకు మూలకారణం ఏది? నానాత్వ విశిష్టమైన ఈ ప్రపంచం వెనుక సత్యమైన తత్త్వము ఏదైనా ఉన్నదా?' ఇదే ప్రశ్న గురువుగారి ముందుంచాడు శిష్యుడు. ఇప్పుడు గురువుగారు చెబుతున్నాడు.

**ఓ మిత్యే త దక్షరమిదగ్ం సర్వం**

"ఓంకారమనే అక్షరము ఈ జగత్తంతా నిండి ఉన్నది" అన్నాడు. ఆ మాటలు విన్న శిష్యుడు ఆశ్చర్యపోయాడు. చరాచర జగత్తు అంటే సామాన్యమైనది కాదు. కొన్ని వేల లక్షల కోట్ల కోటానుకోట్ల మైళ్ళ దూరం ఆక్రమించి ఉన్నది. ఇందులో బోలెడన్ని అడవులు. కొండలు, కోనలు, పర్వతాలు, నదులు, సముద్రాలు, లోయలు, మహాపట్టణాలు ఉన్నాయి. అనేక రాజ్యాలున్నాయి. రాజులున్నారు. ఇంతమందితో కూడిన ఈ జగత్తును ఓంకారమనే చిన్న అక్షరం ఆవరించి ఉన్నదా? చాలా ఆశ్చర్యంగా ఉన్నదే అనుకుంటూ గురువుగారి ముఖంలోకి చూశాడు. అర్థమయింది. గురువుగారికి అందుచే చెబుతున్నాడు. తస్యోపవ్యాఖ్యానమ్. ఆ విషయాన్ని వివరిస్తున్నాడు.

నాయనా! కొన్ని వేల కుండలు తయారు చేసినప్పటికీ, ఆ కుండ లన్నింటికీ మూలము మట్టి అయినట్లుగానే దృశ్యరూపమైన ఈ ప్రపంచానికి

శాశ్వతమైన ఒక దివ్యశక్తి మూలమై ఉన్నది ఆ కుండలన్నీ మట్టిలోనే పుట్టి, మట్టిలోనే పెరిగి, చివరకు మట్టిలోనే కలిసిపోతాయి. అలాగే ఈ ప్రపంచంకూడా పరమేశ్వరుని కృపతో సృష్టించబడింది. ఈశ్వరుని వల్లనే రక్షింపబడుతున్నది. చివరకు ఆ ఈశ్వరునిలోనే లీనమవుతున్నది. ఈ రకంగా సృష్టిస్థితిలయాలకు ఆధారమైన సర్వవ్యాపి, శుద్ధచైతన్యమే ఓంకారము. ప్రపంచాన్ని ఒక శబ్దం ద్వారా సూచిస్తే, ఆ శబ్దమే ఓంకారము. ప్రతివస్తువుకూ ఒక రూపం ఉంటుంది ఆ రూపానికి ఒక పేరు ఉంటుంది. ఈ జగత్తు అనే పరబ్రహ్మకు నామమే ఓంకారము.

భూతంభవద్భవిష్యదితి సర్వమోంకార ఏవ
యచ్చాన్యత్త్రికాలాతీతం తదప్యోంకారమేవ

భూత భవిష్యద్వర్తమానకాలాలు మూడూ ఓంకారమే. త్రికాలము లకు అతీతమైనది ఏదైనా ఉంటే, అది కూడా ఓంకారమే.

ఓంకారమనేది సమస్తలోకాలకు ప్రతీక. సమస్త జగత్తులకు ప్రతీక. పరమేశ్వరుడు దృశ్యరూపమయితే శబ్దం ఓంకారమవుతుంది. అక్కడ చిన్న అనుమానం వస్తుంది. పరమేశ్వరుడు త్రికాలములకు ప్రతీక అన్నారు. బాగుంది. కాలాతీతమైన దాంతో ఆయనకు సంబంధం ఏమిటి? అని అంటే పరమేశ్వరుడు పరిమితమైన దానికే కాదు అపరిమితమైన దానికి కూడా ప్రతీకయే. అందుకనే త్రికాలాలకే కాదు, కాలాతీతమైన దానికి కూడా ప్రతీక. కాలజ్ఞానమనేది మనసు యొక్క ఇంద్రజాలం. మనసు లేకపోతే కాలం ఉండదు. మనసు జడము, అచేతనము. అటువంటి అచేతనమైన మనసు జీవము పొందినట్లైతే చేతనమవుతుంది. జీవము పొందిన మనసు చలిస్తుంది. చలనవంత మవుతుంది. కాబట్టి త్రికాలాతీతమైనది ఆ దివ్యచైతన్యము తప్ప వేరుకాదు. దానివల్లనే ఈ శరీరంలోని మనసు, బుద్ధి కూడా పనిచెయ్యగలుగుతున్నాయి. ఆ చైతన్యమే ఓంకారము.

'ప్రశ్నోపనిషత్తు'లో సత్యకాముడు పిప్పలాద మహర్షికి నమస్కరించి "మహర్షీ! మానవుడు మరణించేదాకా ఓంకార ధ్యానం చేసినట్లైతే ఏ లోకాలకు పోతాడో వివరించండి" అని అడుగుతాడు. దానికి పిప్పలాదుడు "సత్యకామా! ఓంకార మనేది పరబ్రహ్మము అపరబ్రహ్మముకూడా.

పరబ్రహ్మము అంటే సర్వాతీతమైన నిర్గుణబ్రహ్మ. అపరబ్రహ్మము అంటే సాకారము, వ్యక్తరూపం గల హిరణ్యగర్భుడు. అందుచేత పండితులు జ్ఞానులు ఓంకారాన్నే ధ్యానిస్తారు.

ఓంకారము నాదబ్రహ్మము. దీన్నే ప్రణవము అంటారు. దీన్నుంచే సమస్త శబ్దాలు, మంత్రాలు ఉత్పన్నమయినాయి. అందుకనే ఓంకారము సర్వ మంత్రాలకు హేతువు.

సగుణ బ్రహ్మను ఓంకారంతో ఉపాసించవచ్చు. అలాగే అవ్యక్తమైన పరబ్రహ్మను శబ్దంతో సూచించటానికి ఓంకారమే గుర్తు. ఓంకారంలో అకారఉకారమకారాలనే మూడక్షరా లున్నాయి. ఓంకారమనేది మూడువేదా లకు ప్రతీక. ఇందులోని

అకారము - ఋగ్వేదము

ఉకారము - యజుర్వేదము

మకారము - సామవేదము

వేదపురుషుడు పరబ్రహ్మ స్వరూపమే. అందుచేతనే ఓంకారము పరబ్రహ్మ స్వరూపము. దీనిని ఉపాసించినవాడు జీవితంలో సర్వసుఖాలు అనుభవించి, అంత్య కాలంలో మోక్షం పొందుతాడు" అని చెబుతాడు.

'అధర్వశిఖోపనిషత్తు'లో పిప్పలాదుడు, అంగిరసుడు, సనత్కుమారుడు అనేవారు ముగ్గురూ అధర్వణముని దగ్గరకు వెళ్ళి "సృష్టిసమయంలో బ్రహ్మాది దేవతలు ఏం ఉపయోగించారు? ధ్యానమంటే ఏమిటి? ధ్యానింపతగినది ఏది? ధ్యానానికి సాధనము ఏది? మాకు తెలియజేయండి" అని అడుగుతారు. దానికి అధర్వణముని "నాయనలారా! ప్రణవాక్షరమే మొదటగా ఉపదేశించబడింది. అదే ధ్యానము. ఆ ప్రణవాన్నే ధ్యానించాలి. ప్రణవము అనేది పరబ్రహ్మ స్వరూపము. దీనికి నాలుగుపాదాలు లేదా నాలుగుమాత్ర లుంటాయి. ఈ నాలుగు పాదాలే నాలుగు వేదాలు. దీనిలో

మొదటిమాత్ర - అకారము. ఋగ్వేదము

దీనికి భూతము - పృథివి

| | | |
|---|---|---|
| అధిదేవత | - | బ్రహ్మ |
| ఛందస్సు | - | గాయత్రి |
| రెండవమాత్ర | - | ఉకారము. యజుర్వేదము |
| దీనికి భూతము | - | ఆకాశము |
| అధిదేవత | - | విష్ణువు |
| ఛందస్సు | - | త్రిష్టుప్ |
| మూడవ మాత్ర | - | మకారము. సామవేదము |
| దీనికి భూతము | - | స్వర్గము |
| అధిదేవత | - | రుద్రుడు |
| ఛందస్సు | - | జగతిఛందస్సు |
| అలాగే నాల్గవమాత్ర | - | అర్ధమాత్ర. అధర్వణవేదము |
| దీనిభూతము | - | సోమలోకము |
| అధిదేవత | - | విరాట్టు |

అకార ఉకార మకారములకు చివర ఉండే సూక్ష్మమైనది అర్ధమాత్ర. ఇదే నాదము.

ఒక్కసారి ప్రణవాన్ని ఉచ్చరించినంత మాత్రం చేతనే ఉత్తమస్థానాలు లభిస్తాయి. పరమపదము లభిస్తుంది అంటూ వివరిస్తాడు. కాబట్టి ఓంకారము అంటే పరబ్రహ్మ స్వరూపమే కాని వేరుకాదు. అందుకే ఇంద్రాది దేవతలు పరమేశ్వరిని స్తుతిచేస్తూ "అమ్మా ! నీవు శబ్దబ్రహ్మకు ఆత్మవంటి దానవు" అంటున్నారు అంటే తల్లీ! నీవే సృష్టిస్థితిలయాలకు అతీతమైన పరమేశ్వర స్వరూపానివి అని అర్థం.

ఇక ఉద్గీతవలన రమ్యంగా ఉండే సామవేదమంత్రాలకు నీవే ఉనికి పట్టువు అంటున్నారు. 'ఉద్గీత' అంటే ఏమిటి? సామవేదానికి సంబంధించిన ఛాందోగ్యోపనిషత్తులో

**ఓమిత్యే తదక్షరం ఉద్గీతముపాసీత**

ఓంకారాన్ని ఉద్గీతదృష్టితో ఉపాసించాలి. యజ్ఞం చేసేటప్పుడు సామగీతాలను గానం చేసేవాడు 'ఉద్గాత'. అతడు గానం చేసే సామగాన భాగాన్ని 'ఉద్గీత' అంటారు. ఓంకారాన్ని ఉద్గీత దృష్టితో ఉపాసించాలి. అంటే ఓంకారము ఉద్గీత రెండూ ఒక్కటే. ఓంకారము పరబ్రహ్మకు శబ్ద ప్రతీక. ఇది కేవలం ఉపాసనకోసం ఏర్పరచుకున్న గుర్తు. ఉపాసన అంటే ఒకే శబ్దాన్ని జపం చెయ్యటం. అనగా - మనసును దాని మీద లగ్నం చేసి ఆ శబ్దాన్ని నిరంతరం ధ్యానం చెయ్యటమే ఉపాసన. కర్మకాండలో ఒక భాగంగా, పరబ్రహ్మకు శబ్దప్రతీకగా ఓంకారము ఉపయోగించబడుతుంది.

తైత్తిరీయోపనిషత్తు మూడు భాగాలుగా ఉంటుంది. అందులో మొదటి భాగం శిక్షావల్లి. శిక్షావల్లిలోని నాల్గవ అనువాకంలో ఓంకారము యొక్క మాహాత్మ్యము చెప్పబడింది. ఓంకారము అన్ని వేదాలకు మూలమైనది. వేదాల సారమంతా ఓంకారంలోనే ఉన్నది. ఇది అమృత స్వరూపము, శాశ్వతము. పరమేశ్వర స్వరూపమైన ఓంకారమే మానవులకు మేధస్సును, బుద్ధిని ఇస్తుంది. ఈ జగత్తంతా ఓంకార స్వరూపమే.

అందుకే ఇంద్రాదిదేవతలు చెబుతున్నారు. ఆ పరమేశ్వరి ఓంకార రూపిణి. వేదత్రయ స్వరూపిణి.

వేదత్రయము అంటే మూడు వేదాలు. అవి 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము. ఈ మూడు వేదాలు అకార ఉకార మకారాలకు ప్రతీక. వేదాలు పరమేశ్వర స్వరూపాలు. అందుకే ఆ దేవి వేదత్రయరూపిణి అన్నారు.

**మేధాసి దేవి విదితాఖిలశాస్త్రసారా -**
**దుర్గాసి దుర్గభవసాగరనౌ రసంగా ।**
**శ్రీః కైటభారిహృదయైకకృతాధివాసా -**
**గౌరీ త్వమేవ శశిమౌళికృతప్రతిష్ఠా ॥**

దేవీ! సర్వశాస్త్రములు తెలుసుకొనే మేధాశక్తివి నీవు. సంసార సాగరాన్ని దాటించే దుర్గవు నీవు. విష్ణుమూర్తి హృదయమందు

నివాసమేర్పరచుకున్న లక్ష్మీదేవిని నీవు. శివుని యందు శాశ్వతముగా నిలిచి ఉండే గౌరీదేవివి నీవే.

ఇంద్రాది దేవతలు ఆ పరమేశ్వరిని 'మేధాశక్తి' అంటున్నారు. లలితాసహస్రంలో 539 వ నామము 'మేధా'. మేధా అంటే బుద్ధి అని అర్థం. సకల శాస్త్రసారమైనది మేధ. అన్ని ప్రాణుల యందు ఆ పరమేశ్వరి మేధారూపంలో ఉంటుంది. కాశ్మీరుదేశంలో మేధాదేవి పూజించబడుతున్నది అని పద్మపురాణంలో చెప్పబడింది. అలాగే లలితాసహస్రంలోని 510వ నామము 'మేధోనిష్టా'. తల లోపలి ఉండే మెత్తని తెల్లని మాంసాన్నే మేధస్సు అంటారు. ఇదే మెదడు. స్వాధిష్టాన చక్రంలో ఉంటే సిద్ధేశ్వరీదేవత మేధోధాతువునందు ఉంటుంది అని చెప్పబడింది.

ఇదేవిధంగా విష్ణుసహస్రంలో 752వ నామము 'సుమేధా' - మంచితలంపు గలవాడు. తనను ఆరాధించేవారిని గురించి మంచిగా ఆలోచించేవాడు. చక్కని ప్రజ్ఞాపాటవములు గలవాడు. విశేషజ్ఞానము గలవాడు. ఇక్కడ జ్ఞానము, విశేష జ్ఞానము అని రెండున్నాయి. ఇనుపముక్క ఎర్రగాకాలి ప్రకాశిస్తున్నది అని తెలియటం జ్ఞానం. అలాకాకుండా అందులోని వెలుతురు, వేడి అగ్నియొక్క ధర్మమేకాని అది లోహము యొక్క ధర్మం కాదు అని తెలియటం విశేషజ్ఞానం. ఈ రకంగా 'సుమేధా' విశేషజ్ఞానం గలవాడు ఆ పరమేశ్వరుడు.

విష్ణుసహస్రంలోని 77వ నామం 'మేధావే' అంటే - సర్వజ్ఞుడు. అపారమైన తన మహిమకు తగినటువంటి సర్వజ్ఞత్వము కలవాడు.

మేధ అంటే స్వభావసిద్ధంగా ఉండే సర్వజ్ఞత. ఇది శాస్త్ర పరిజ్ఞానం వల్లకాని, అభ్యాసం వల్లకాని రాదు. అది సహజ సిద్ధంగా ఉంటుంది. మేధ అంటే - చాలా గ్రంథాలను తన బుద్ధియందు నిలుపుకొనే శక్తి. అటువంటి శక్తి గలవాడు పరమేశ్వరుడు.

మేధ అంటే - బుద్ధి. సకల శాస్త్రసారమైనది. సర్వ భూతములందు ఆ పరమేశ్వరుడు మేధారూపంలో ఉన్నాడు. ఇక్కడ అమ్మవారిని గురించి చెబుతూ మధ్యలో విష్ణుమూర్తి అంటారేమిటి? అని అనుమానం రావచ్చు. పరమేశ్వరుడికి లింగ భేదంలేదు అని గతంలో చెప్పుకున్నాం. పరమేశ్వరుడు ఒక్కడే అనేక రూపాలలో పూజించబడుతుంటాడు అని గుర్తించాలి.

ఇక దుర్గమమైన సంసారసాగరాన్ని దాటించే నౌక అంటున్నారు. జీవి చేసిన కర్మ అంతా ఒకచోట చేరుతుంది. అదే సంచిత కర్మ. దీని యొక్క ఫలితము మంచిగాని, చెడుగాని అంటే పాపముగాని పుణ్యముగాని ఆ జీవుడే అనుభవించాలి. కర్మఫలం అనుభవించాలి అంటే అతడు మళ్ళీ జన్మించి తీరాలి. ఈ రకంగా ఎంతకాలం జన్మించాలి? కర్మ క్షయం అయ్యే వరకు. మరి ఆ కర్మ క్షయం ఎప్పుడవుతుంది? కల్పాంతము వరకు అనుభవించినప్పటికీ కర్మ క్షయం కాదు. మరి కర్మ క్షయం ఏ రకంగా అవుతుంది? అంటే కేవలము 'జ్ఞానంవల్ల'. జ్ఞానము అంటే పరమేశ్వర స్వరూపాన్ని గురించి తెలుసుకోవటం వల్ల ఆత్మస్వరూపాన్ని గురించి తెలుసుకోవటం వల్ల, ఈ రకంగా తన భక్తులకు ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించి వారి యొక్క భవబంధాలను త్రెంచి వేస్తుంది. ఇదే విషయాన్ని శంకర భగవత్పాదుల వారు తమ సౌందర్యలహరిలోని మూడవ శ్లోకంలో

**అవిద్యానా మంతస్తిమిర మిహిరద్వీపనగరీ -**
**జడానాం చైతన్య స్తబక మకరంద స్రుతిఝరీ ।**
**దరిద్రాణాం చింతామణి గుణనికా జన్మజలధౌ**
**నిమగ్నానాం దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి ॥**

"అమ్మా ! నిన్ను నమ్మి నటువంటి వాడు అజ్ఞాని మూఢుడు అయినప్పటికీ, అతని జీవితంలో జ్ఞాన జ్యోతులు ప్రకాశిస్తాయి. ఒకవేళ అతడు దరిద్రుడైతే అతడికి చింతామణి దొరికినట్లు అవుతుంది. అతడి దరిద్రం తీరిపోయి లెక్కలేనంత సిరి, సంపద పొందుతాడు. సంసార సాగరంలో మునిగి, కొట్టుమిట్టాడుతున్నవాడికి విష్ణుమూర్తి వరహావతారంలో సముద్రంలో మునిగి పోయిన భూమిని రక్షించినట్లుగా అతడి భవబంధనాలను నాశనం చేస్తావు" అంటున్నారు.

ఈ రకంగా భక్తుల భవబంధనాలను నాశనం చేసి వారికి మోక్షమిచ్చే పరమేశ్వరి ఆ దేవి. ఇంకా ఇంద్రాది దేవతలు ఆ పరమేశ్వరితో "అమ్మా ! త్రిశక్తి స్వరూపిణివి" అంటున్నారు. అది ఎలాగంటే?

కృతయుగానికి ముందు సృష్టి ప్రారంభంకావటానికి పూర్వం ఈ జగత్తంతా జలమయంగా ఉండేది. ఆ సమయంలో శ్రీమహావిష్ణువు ఆ

అపారమైన జలరాశి మధ్యన వటపత్రశాయియై పవళించి ఉన్నాడు. అతని నాభి నుంచి వచ్చిన కమలం నుంచి ఆవిర్భవించిన బ్రహ్మ వేదపారాయణ చేస్తున్నాడు.

అందుకే ఇంద్రాది దేవతలంటున్నారు : ఓ తల్లీ !

బ్రహ్మ నాలుకయందు నివశించే సరస్వతివి

విష్ణువు హృదయమందు నివశించే లక్ష్మీదేవివి

శివునికి అర్ధశరీరమైన గౌరీదేవిని కూడా నీవే తల్లీ.

ఈషత్సహాస మమలం పరిపూర్ణచంద్ర
బింబానుకారి కనకోత్తమకాంతికాంతమ్ ।
అత్యద్భుతం ప్రహృత మాత్తరుషా తథాఽపి
వక్త్రం విలోక్య సహసా మహిషాసురేణ ॥

అమ్మా ! ఎల్లవేళల యందు చిరునగవుతో ప్రకాశించునది, నిర్మల మైనది, పూర్ణమైన చంద్రబింబ వంటిది, మనోజ్ఞమైనది అయిన నీ ముఖ పద్మమును చూసి మహిషాసురుడు కోపోద్దీపితుడై, నీతో యుద్ధానికి రావటం ఆశ్చర్యం కలిస్తోంది తల్లీ.

పరమేశ్వరి యొక్క ముఖము సదాచిరునగవుతో ప్రకాశిస్తుంటుంది. లలితా సహస్రంలో 603వ నామం 'దరహాసోజ్వలన్ముఖీ'. చిరునవ్వుతో ప్రకాశించే ముఖము గలది. సుందరమైన మందహాసముతో ప్రకాశించే ముఖము గలది. ఆనందమే స్వరూపముగా గలది. హృదయంలో ఉన్న ఆనందం ముఖంలో కనిపిస్తుంది కాబట్టి ఆ పరమేశ్వరి 'దరహాసోజ్వలన్ముఖి' అనబడుతోంది. అలాగే 923వ నామము 'దరస్మేరముఖాంబుజా' చిరునవ్వుతో కూడిన ముఖము గలది

దరము అనగా - శంఖము

స్మేర అంటే - ప్రకాశము

పరమేశ్వరి ముఖపద్మము శంఖంలాగా తెల్లగా ప్రకాశిస్తున్నది. కల్పాంతము నందు కూడా అంటే మహాప్రళయం జరిగినప్పుడు కూడా ఆ

విష్ణుమూర్తి చెవిలోని మలిన పదార్థం నుంచి మధుకైటభులు ఉద్భవించారు. వారిద్దరినీ విష్ణువు పరమేశ్వరి కృపతో సంహరించాడు అని గతంలో చెప్పుకున్నాం. ఆ తరువాత ఒక దివ్యవిమానం వచ్చింది. త్రిమూర్తులు అందులో ఎక్కారు. ఆ విమానం వాయువేగ మనోవేగాలతో వెళ్ళి ఒక ద్వీపం దగ్గర ఆగింది. ఆ ద్వీపంలో కల్పవృక్షాల వనం. ఆ వనం మధ్యన చింతామణులతో నిర్మించిన భవనం. ఆ భవనంలో త్రికోణాంకార మంచం మీద ఒక దివ్యమంగళ విగ్రహం. ఎర్రని వస్త్రాలు ధరించి, ఎర్రచందనము శరీరానికి పూసుకుని, సర్వాలంకృతయై కోట్లాది సూర్యుల కాంతితో ప్రకాశిస్తున్నదావిడ. ఆమె శ్రీచక్రము అనే యంత్రం మీద ఆసీనురాలై ఉన్నది. ఆమె చేతులయందు ధనుర్బాణాలు, పాశాంకుశాలు ఉన్నాయి. దేవతలంతా ఆమెకు సపర్యలు చేస్తున్నారు. అక్కడ తిరుగాడే అందరూ హృల్లేఖీ, భువనేశీ అని జపం చేస్తున్నారు. అక్కడ తిరిగే చిలుకలు గోరు వంకలు కూడా హ్రీంకారజపం చేస్తున్నాయి.

త్రిమూర్తులు ఆ దేవిని పరిపరివిధాల స్తుతించారు. ఆ తరువాత బ్రహ్మదేవుని కోరిక ప్రకారము ఆ పరమేశ్వరి తన తత్త్వాన్ని వివరించి, తన అంశతో మూడు శక్తులను సృష్టించింది. వారే మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులు.

బ్రహ్మదేవునికి - మహా సరస్వతిని
విష్ణుమూర్తికి - మహాలక్ష్మిని
రుద్రునకు - మహాకాళిని

ఇచ్చి, త్రిమూర్తులారా ఈ ముగ్గురు శక్తులూ సత్వరజస్తమోగుణాలకు ప్రతీకలు. సృష్టికార్య క్రమంలో వీరు మీకు సహాయంగా ఉంటారు. వీరిని ఎప్పుడూ అవమానించవద్దు అని చెప్పింది. అప్పుడు సరస్వతీదేవికి - బ్రహ్మ తన నాలుకమీద, లక్ష్మీదేవికి - విష్ణువు తన హృదయమందు, స్థానాలు కల్పించగా గౌరీదేవికి - శివుడు అర్ధశరీరమిచ్చి గౌరవించాడు.

పరమేశ్వరి ఆనంద స్వరూపిణి. అందుచేతనే ఆమె ముఖము చిరునగవుతో ప్రకాశిస్తుంది. ఆనందరూపిణి అంటే ఏమిటి? ఈ విషయం తెలుసుకునే ముందు కొన్ని పదాలకు అర్థాలు తెలుసుకోవాలి. అవి

1. ప్రియము - తనవారిని చూసినప్పుడు కలిగే సంతోషము
2. మోదము - కోరుకున్నది లభించినప్పుడు కలిగే సంతోషము
3. ప్రమోదము - మోదము ఎక్కువ అయినప్పుడు కలిగేది.
4. ఆనందము - అన్నింటికీ మించిన సంతోషము.

ఈ లోకంలోని సంపద అంతా యువకుడు, సదాచార సంపన్నుడు, వేదాధ్యాయి, బలమైనవాడు అనుభవించటానికే ఉన్నది. దీన్ని అనుభవించటం వల్ల కలిగే ఆనందము మానుషానందము.

1. మానుషానందానికి నూరురెట్లు - మానుష్య గంధర్వానందము. మానుష్య గంధర్వులు అంటే మానవులుగా పుట్టి పుణ్యకర్మల వల్ల గంధర్వత్వం పొందినవాళ్ళు.
2. మానుషానందానికి నూరురెట్లు - దేవగంధర్వానందం. సృష్టికాలంలో గంధర్వలోకంలో జన్మించినవారు.
3. దేవగంధర్వానందానికి నూరురెట్లు - చిరలోకపితరానందము. చిరకాలం ఉండే లోకంలో ఉండే పితృదేవతలు చిరలోక పితరులు.
4. చిరలేక పితరానందానికి నూరురెట్లు - అజానజదేవానందము. దేవలోకానికి పైన ఈ లోకమున్నది. అక్కడ ఉండేవారు అజానజ దేవతలు.
5. అజానజదానందానికి నూరురెట్లు కర్మ దేవానందము. పుణ్యఫలం వల్ల దైవత్వం పొందినవారు కర్మదేవతలు.
6. కర్మదేవానందానికి నూరురెట్లు - నిజదేవానందం - సృష్టికాలంలో దేవలోకంలో జన్మించినవారు.
7. దేవానందానికి నూరురెట్లు - ఇంద్రానందం
8. ఇంద్రానందానికి నూరురెట్లు - బృహస్పతి ఆనందం
9. బృహస్పతి ఆనందానికి నూరురెట్లు - ప్రజాపతి ఆనందం. అతడే విరాట్పురుషుడు.

10. ప్రజాపతి ఆనందానికి నూరురెట్లు - బ్రహ్మానందం. ఇతడే మానవు లందరిలోనూ ఉన్నాడు. ఈ విషయాలన్నీ తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడ్డాయి. పరమేశ్వరి ఎల్లవేళల యందు బ్రహ్మానందంతో ఉంటుంది కాబట్టే లలితాసహస్రంలోని 677వ నామంలో 'బ్రహ్మానందా' అనబడుతోంది. ఆవిడ అనుభవించే బ్రహ్మానందానికి గుర్తుగానే ఆ దేవి ముఖం చిరునవ్వుతో ప్రకాశిస్తున్నది అంటున్నారు.

ఇంకా పరమేశ్వరి ముఖపద్మం గురించే చెబుతున్నారు. ఆ ముఖము నిర్మలమైనది. పూర్ణ చంద్రబింబము లాగా ఉన్నది. ఇదే మాటని శంకరభగవత్పాదులవారు తమ సౌందర్యలహరిలోని 7వ శ్లోకంలో

**క్వణత్కాంచీదామా కరికలభ కుంభస్తననతా**
**పరిక్షీణా మధ్యే పరిణితశరశ్చంద్రవదనా ।**
**ధనుర్బాణాన్ పాశంసృణిమపిదధానా కరతలైః**
**పురస్తా దాస్తాం నః పురమథితురాహోపురుషికా ॥**

పరిణితశరశ్చంద్రవదనా - శరత్కాలమున ఉన్నటువంటి, పరిణిత - పూర్తిగా వికసించిన, చంద్రవదనా - చంద్రుని బోలిన ముఖముగలది.

చాంద్రమానంలో సంవత్సరానికి 12 మాసాలున్నాయి. అవి చైత్రము, వైశాఖము, జ్యేష్టము, ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వీయుజము, కార్తీకము, మార్గశిరము, పుష్యమి, మాఘము, ఫాల్గుణము. వీటిలో రెండు రెండు మాసాలను కలిపి ఒక ఋతువు అంటారు.

| | | |
|---|---|---|
| చైత్ర, వైశాఖ మాసములు | - | వసంతఋతువు |
| జ్యేష్ట, ఆషాఢ మాసములు | - | గ్రీష్మఋతువు |
| శ్రావణ, భాద్రపద మాసములు | - | వర్షఋతువు |
| ఆశ్వీయుజ, కార్తీక మాసములు | - | శరదృతువు |
| మార్గశిర, పుష్య మాసములు | - | హేమంత ఋతువు |
| మాఘ, ఫాల్గుణ మాసములు | - | శిశిర ఋతువు |

ఈ రకంగా సంవత్సరానికి ఆరు ఋతువులున్నాయి. వీటిలో శ్రావణ భాద్రపదాలు వర్షఋతువు. ఆ సమయంలో వర్షాలు బాగా కురుస్తాయి. ఆ తరువాత వచ్చేది ఆశ్వయుజ, కార్తీకమాసములు - శరదృతువు. ఈ కాలంలో తెల్లని వెన్నెలకాస్తుంది. చంద్రబింబం చాలా స్వచ్ఛంగా, కళంకరహితంగా ఉంటుంది. ఇంకా చెప్పాలంటే పుచ్చపువ్వులాటి వెన్నెల, పిండారబోసినట్లు వెండివెన్నెలకాస్తుంది. అందుకే ఇంద్రాది దేవతలు పరమేశ్వరి ముఖము శరత్కాలపు చంద్రబింబంలాగా ప్రకాశిస్తున్నది అంటున్నారు. ఇక ఆ దేవి ముఖము మనోజ్ఞమైనది, ప్రసన్నమైనది. దుర్వాసుడు తన దేవీమహిమ్నః స్తుతిలోని 35వ శ్లోకంలో

ఉద్యతూర్ణ కలానిధిశ్రి వదనం భక్తప్రసన్నాం సదా
సంపుల్లాంబుజపత్రకాంతి సుషమాధిక్కారదక్షేక్షణం ।
సానందంకృతమందహాస మసకృత్ప్రాదుర్భవంకౌతుకం
మందాకారసుదంత పంక్తిశశిభా పూర్ణం స్మరామ్యంబికే ॥

"తల్లీ నీ ముఖము పున్నమినాటి చంద్రబింబములాగా ప్రకాశిస్తూ, భక్తుల యందు ప్రసన్నమై ఉన్నది. పద్మములకన్నా కూడా అందమైన నేత్రాలను కలిగి ఉన్నది. ఆనందంతో నిండి ఎప్పుడూ మందహాసముతో ఉండేది. ఎన్నిసార్లు చూసినా మళ్ళీమళ్ళీ చూడాలనిపించేది. మల్లె మొగ్గలను పోలు పలువరుసగల నీ ముఖపద్మాన్ని ధ్యానిస్తున్నాను" అంటున్నాడు.

చూడండి. ఆ పరమేశ్వరి ముఖారవిందము శరత్కాల పున్నమినాటి చంద్రబింబము వలె వెండికాంతులు ప్రసరింపచేస్తున్నదట. చిరునవ్వుతో వెలిగిపోతున్నదట. ఎన్నిసార్లు చూసినా తనివితీరనిది. మళ్ళీమళ్ళీ చూడాలనిపించేది, భక్తుల యెడల ప్రసన్నమైనది. అటువంటి ముఖపద్మాన్ని చూసికూడా మహిషుడు కోపంతో ఆ దేవి మీదికి యుద్ధానికిపోయాడు. చూడండి అతడు ఎంత మూర్ఖుడో?

దృష్ట్వా తు దేవి కుపితం భ్రుకుటీకరాల -
ముద్యచ్ఛశాంకసదృశచ్ఛవి యన్న సద్యః ।
ప్రాణా న్ముమోచ మహిష స్తదతీవ చిత్రమ్ -
కైర్జీవ్యతే హి కుపితాంతకదర్శనేన ॥

కోపంతో, కనుబొమలు ముడివడి భయంకరంగా, బాలభానుని వలె ఎఱ్రని కాంతి గలిగిన నీ ముఖాన్ని చూడగానే ఆ మహిషుడు ప్రాణాలు వదల్లేదు. ఇది అత్యంతాశ్చరకమైన విషయం. ఎందుకంటే కోపంతో ఉన్న మృత్యుదేవతను చూసికూడా ఎవడూ జీవించి ఉండలేదు కదా?

ప్రసన్నమైన పరమేశ్వరి ముఖాన్ని చూసి కూడా ఆ రాక్షసుడు ఆమెపై ఆయుధాలు ప్రయోగించాడు. అది చూసేసరికి ఆ దేవికి ఆగ్రహం వచ్చింది. కనుబొమలు ముడివడినాయి. ముఖం ఎఱ్ఱనైంది. అది ఎలా అంటే బాలభానుని లాగా.

అసలు పరమేశ్వరి శరీరచ్ఛాయ ఎరుపు వర్ణము. లలితాసహస్రంలోని 6వ నామం చూడండి. 'ఉద్యద్భాను సహస్రాభా' ఉదయిస్తున్న వేయి సూర్యుల కాంతి గలది. ఉదయిస్తున్న సూర్యుడు అరుణారుణచ్ఛాయలో ఉంటాడు. ఆ పరమేశ్వరి ఉదయిస్తున్నటువంటి వేయిమంది సూర్యుల కాంతులతో ప్రకాశిస్తున్నది. ఇక్కడ వేయి అనేది ఒక సంఖ్య కాదు. అనంతము అని అర్థం. అంటే అనేక వేల కోట్ల సూర్యుల కాంతులతో ఆ పరమేశ్వరి ప్రకాశిస్తున్నది. అరుణారుణచ్ఛాయలో ఉన్నది. అందుకే ఆమెను ప్రార్థించేటప్పుడు

**అరుణాంకరుణా తరంగితాక్షీం**
**ధృతపాశాంకుశ పుష్పబాణ చాపాం**

అంటారు. అలాగే సకుంకుమ విలేపనా మళికచుంబి కస్తూరికాం అంటారు. అసలే ఎఱ్రని వర్ణముతో, అరుణారుణచ్ఛాయలతో ప్రకాశించే ఆ దేవి ముఖపద్మము రాక్షసుని మీద కోపంతో మరింత ఎఱ్రబడింది. అలా ఎఱ్రబడి సాక్షాత్తూ మృత్యుదేవత లాగా భయంకరంగా మారింది.

దేవీ ప్రసీద పరమా భవతీ భవాయ -
సద్యో వినాశయతి కోపవతీ కులాని ।
**విజ్ఞాత మేత దధునైవ య దస్తమేత -**
**న్నీతం బలం సువిపులం మహిషాసురస్య ॥**

దేవీ! ప్రసన్నురాలివి కావలసినది. నీవు సర్వాధికురాలవు. నువ్వు తలచుకుంటే లోకకల్యాణం కోసం రాక్షసులందరినీ త్రుటిలో నశింపచేయ

గలవు. మహిషాసురుని సైన్యాన్నంతటినీ సంహరించినప్పుడే ఆ విషయం తేటతెల్లమైంది.

పరమేశ్వరి మహిషుని మీద ఆగ్రహించింది అని గతంలో చెప్పారు. ఇప్పుడు దేవతలు ఆమెను ప్రసన్నురాలు కమ్మని ప్రార్థిస్తున్నారు. అమ్మా ! నీవు సర్వాధికురాలవు అంటున్నారు.

ఈ జగత్తులో ఉన్నవాడు పరమేశ్వరుడు ఒక్కడే. అతడు ఏకాకి. అతనితో సమానమైన వారుకాని, అతనికన్న అధికులుకాని ఎవరూలేరు. జగత్తులోని చరాచరములన్నీ అతని అధీనంలోనే ఉన్నాయి. అవన్నీ అతడికి వశమై ఉన్నాయి. పరమేశ్వరుడు ఉన్నాడనే భయంతోనే గాలి వీస్తున్నది. సూర్యుడు ఎండకాస్తున్నాడు. చంద్రుడుచల్లదనాన్ని ఇస్తున్నాడు. ఆ పరమేశ్వ రుని యందు గల భయంతోనే సముద్రాలు తమ చెలియలికట్టను దాటటంలేదు. పరమేశ్వరుని యందు గల భయంతోనే అష్టదిక్పాలకులు తమ విధులను జాగ్రత్తగా నిర్వహిస్తున్నారు. గ్రహాలు గతులు తప్పకుండా చలిస్తున్నాయి. ఈ రకంగా లోకంలో ఉన్న సమస్త వస్తుసముదాయము, ప్రాణసముదాయము అంతా పరమేశ్వరుని అధీనమై ఉన్నది. అందుచేతనే ఆ పరమేశ్వరుడు సర్వాధికుడు.

అధర్వశిరోపనిషత్తులో దేవతలంతా స్వర్గలోకానికి వెళ్ళి అక్కడ మహా రుద్రుణ్ణి దర్శించి, "దేవా! నీ వెవరవు?" అని అడుగుతారు. దానికి ఆ రుద్రుడు –

"నేను ఒక్కడనే మొదట ఉన్నాను. ఇప్పుడున్నాను. భవిష్యత్తులో ఉంటాను. నాకన్న వేరైనది భూతభవిష్యద్వర్తమానాలలో ఏదీ లేదు. నేను త్రికాలాతీతుడను. నిత్యానిత్యుడను. సృష్టిచేయటానికి బ్రహ్మను నేనే. జ్ఞానేం ద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు నేనే, దశదిశలు నేనే, పురుషుడు, స్త్రీ, నపుంసకుడు కూడా నేనే. సావిత్రి నేనే, గాయత్రి నేనే, త్రిష్టప్, అనుష్టప్, జగతి మొదలైన అన్ని ఛందస్సులూ నేనే. నేనే జ్యేష్టుడను, శ్రేష్టుడను అందరికన్నా, అన్నింటి కన్నా అధికమైన వాడను, చతుర్వేదాలు, ఓంకారము, కూడా నేనే, పవిత్రుడను నేనే అపవిత్రుడను నేనే. దశదిశలయందు ఉన్నది లేనిది కూడా నేనే, నాకన్న అధికమైన వారు ఎక్కడాలేరు" అంటాడు. ఇక్కడ రుద్రుడు అంటే పరమేశ్వరుడు. ఇది శైవోపనిషత్తు.

అలాగే వైష్ణవోపనిషత్తు అయిన నారాయణోపనిషత్తులో "సృష్టి ప్రారంభంలో పరమపురుషుడైన నారాయణుడు ఒక్కడే ఉన్నాడు. అతని నుంచి హిరణ్యగర్భుడు; అతని నుంచి పంచతన్మాత్రలు, పంచభూతాలు ఆవిర్భవించినాయి. బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మొదలైన దేవతలు అతని నుండే ఉద్భవించారు. మరీచి, కశ్యపుడు మొదలైన ప్రజాపతులు, అష్టవసువులు, నవగ్రహాలు, దశదిశలు, ఏకాదశరుద్రులు. ద్వాదశాదిత్యులు, చతుర్వేదాలు ఆవిర్భవించినాయి.

అధసత్యోనారాయణః, నిత్యోనారాయణః, బ్రహ్మోనారాయణః, శివశ్చ నారాయణః, శక్రశ్చనారాయణః, ద్యావాపృధివ్యైత నారాయణః, కాలశ్చ నారాయణః, దిశశ్చనారాయణః, ఊర్ధ్వంచనారాయణః, అధశ్చనారాయణః, అంతర్బహిశ్చనారాయణః, నారాయణయే వేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యం, నిష్కళంకో, నిరంజనో, నిర్వికల్పో, నిర్వఖ్యాతద్ధోదేవ ఏకో నారాయణః నద్వితీయోస్తి కశ్చిత్, యయేవంవేద సవిష్ణురేవభవతి, సవిష్ణురేవభవతి, సవిష్ణురేవభవతి.

శ్రీమన్నారాయణుడే సత్యము నిత్యము అయినవాడు. బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, సకల దేవతా సమూహము, దశదశలు, నారాయణుడే. ఆది అంతము లేనివాడు. ఉన్నదంతా అతడే. అతడు తప్ప ఈ జగత్తులో మరొకటి లేదు. జగత్తులోని సమస్తము అతడికి లోబడే ఉంటాయి. అన్నింటికన్నా అతడే అధికుడు" అని చెప్పబడింది. ఈ రకంగా జగత్తులోని అన్నింటికన్నా పరమేశ్వరుడే అధికుడు. అందుచేతనే పరమేశ్వరిని శక్రాది దేవతలంతా అమ్మా! జగత్తులో నీవే అధికురాలవు అంటున్నారు.

ఇక పరమేశ్వరి పని ఏమిటి అంటే భగవానుడు గీతలో చెప్పినట్లుగా

**యధాయధాహి ధర్మశ్చ గ్లానిర్భవతి భారత**
**అభ్యుత్థానమధర్మశ్చ తదాత్మానం సృజామ్యహం ॥**

ఎప్పుడైతే ఈ లోకంలో ధర్మానికి హాని కలుగుతుందో, అధర్మ పెచ్చరిల్లుతుందో అప్పుడు

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతాం**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥**

భూమి మీద అవతరించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసి ధర్మాన్ని కాపాడతాను అంటాడు.

పరమేశ్వరి అసుర సేనలను తృటిలో నాశనం చెయ్యగల శక్తి సంపన్నురాలు. భండాసురుడితో యుద్ధం చేసేటప్పుడు గాని, మహిషాసురునితో యుద్ధం చేసేటప్పుడుగాని రాక్షససేనను తృటిలో నాశనం చేసి పారేసింది. ఆ విషయాన్నే దేవతలు, "అమ్మా! నువ్వు తలచు కుంటే అసుర సేన అంతా క్షణకాలంలో నాశనం చేసి వేయగలవు. ఆ విషయాన్ని మహిషునితో యుద్ధం చేస్తున్నప్పుడు మేము కళ్ళారా చూశాము" అంటున్నారు.

**తే సంమతా జనపదేషు ధనాని తేషామ్ -**
**తేషాం యశాంసి న చ సీదతి బంధువర్గః ।**
**ధన్యాస్తఏవ నిభృతాత్మజభృత్యదారా -**
**యేషాం సదాభ్యుదయదా భవతీ ప్రసన్నా ॥**

తల్లీ! నీవు సర్వదా శుభకారిణివి. నీ కృపకు పాత్రులైన వారు ధన ధాన్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు, భార్యాబిడ్డలతో సుఖంగా ఉంటారు.

పరమేశ్వరి యొక్క రూపం ఏమిటి? ఆవిడ తత్త్వం ఏమిటి? అంటే ఆ దేవి శాంతమూర్తి. మంగళాకారిణి. నిత్యశుభంకరి. తన యొక్క భక్తులకు, తనను నమ్మిన వారికి సకల శుభాలను చేకూరుస్తుంది. లలితాసహస్రంలోని 503వ నామం 'సమస్త భక్తసుఖదా' తనయొక్క భక్తులకు సమస్త సుఖాలను ఇచ్చే దేవత. ఏమిటా సుఖాలు? 670వ నామంలో చెబుతున్నారు 'అన్నదా' అన్నంజనేభ్యోదధాతి. జనులకు అన్నము నిచ్చేది. అన్నము అంటే బియ్యంతో వండిన పదార్థం మాత్రమే కాదు. జీవి బ్రతకటం కోసం తీసుకునే ఆహారం ఏదైనా అన్నమే.

వేదంలో చెప్పినట్లుగా సృష్టి కాలంలో పంచభూతాలు ఆవిర్భవించినాయి. ముందుగా అకాశం వచ్చింది.

ఆకాశాద్ - వాయుః, వాయో - రగ్నిః, అగ్నిర్ - ఆపః, ఆపః - పృథ్వీ, పృథివ్యా - దోషదయః, ఓషధయా - దన్నం.

పంచభూతాలలోను ముందుగా ఆకాశం వచ్చింది. ఆకాశం నుంచి -

వాయువు, వాయువునుంచి - అగ్ని, అగ్నినుంచి - జలము, జలము నుంచి - భూమి, భూమినుంచి - ఓషధులు, ఓషధులనుంచి - అన్నము పుట్టింది. ఈ రకంగా లోకంలోని ప్రాణులందరికీ ఆహారము నిస్తుంది కాబట్టే ఆ దేవి 'అన్నదా' అనబడుతోంది.

యజ్ఞయాగాదులు చేసేటప్పుడు అగ్నిలో ఆదిత్యుడికి ఆహుతులు సమర్పించటం జరుగుతుంది. ఆ ఆహుతులవల్ల సూర్యుడికి ప్రకాశం పెరుగుతుంది. దాంతో నదులు, సముద్రాలలోని నీరు ఆవిరి అయి మేఘాలుగా మారుతుంది. వర్షరుతువు రాగానే ఈ మేఘాలు వర్షిస్తాయి. ఈ వర్షాలవల్ల వాగులు, వంకలు, యేరులుగా నీరు ప్రవహించి నదులుగా మారి సముద్రంలో కలుస్తుంది. ఈ వర్షపునీటితోను, ప్రవహించే నీటితోను సాగుబడి జరిగి పంటలు పండుతాయి. ఆ పంటలవల్లనే జీవులకు ఆహారం లభిస్తుంది.

లోకంలో 84 లక్షల రకాలైన జీవరాశి ఉన్నది. వాటిలో

స్థావరములు అంటే

| | | |
|---|---|---|
| చలనం లేనివి | - | 20 లక్షలు |
| మృగాలు | - | 30 లక్షలు |
| క్రిములు | - | 11 లక్షలు |
| పక్షులు | - | 10 లక్షలు |
| జలచరాలు | - | 9 లక్షలు |
| మానవులు | - | 4 లక్షలు |
| వెరసి | | 84 లక్షలు |

ఈ జీవులన్నింటికీ ఒకటే ఆహారం కాదు. ఎక్కువ లక్షణాలు గల జీవులు తక్కువ లక్షణాలు గల జీవులను ఆహారంగా తీసుకుంటాయి. ఇది ప్రకృతి సహజము. కాని మానవుడు మాత్రం జగత్తులోని అన్ని పదార్థాలను ఆహారంగా తీసుకుంటాడు.

అయితే విజ్ఞుడైనవాడు శాఖాహారం మాత్రమే తీసుకోవాలి. ఆహారం

లోని సూక్ష్మాంశ భోక్త యొక్క మనస్సుగా రూపు దాల్చుతుంది. అందుచేతనే మనం తినే ఆహారాన్ని బట్టే మన మనస్సు యొక్క ప్రభావము, ప్రవృత్తి ఉంటాయి.

రాజసాహారం వల్ల - మనోచాంచల్యం కలుగుతుంది.

తామసాహారం వల్ల - నిద్ర ఎక్కువ అవుతుంది

అందుచేత సాత్వికాహారమే శ్రేష్ఠము.

మనం తీసుకునే ఆహారంలో మూడురకాల దోషాలున్నాయి. అవి :

1. జాతిదోషము - ఉల్లి, వెల్లుల్లి, ముల్లంగి మొ॥వి.

2. ఆశ్రయదోషము - పాలు సాత్వికాహారము. కాని రాగిపాత్రలో పోస్తే దోషము.

3. నిమిత్తదోషము - స్మశానంలో పండినవి. మలమూత్రాదులతో కలసిన మురుగునీటితో పండించిన పంటలు.

ఇటువంటివి తినటానికి పనికిరావు. అలాగే పిల్లి, ఎలుక, కాకి, కుక్క ముట్టుకున్న ఆహారం తినకూడదు. అంతే కాదు. ఆహారం వండేవారు, వడ్డించేవారు కూడా పరిశుభ్రంగా ఉండాలి. వారు ప్రేమతో, వాత్సల్యంతో వడ్డించాలి. అటువంటి ఆహారం తిన్నవాడి మనసు నిశ్చలంగా ఉంటుంది. అతడి ఉపాసనకు మంచి ఫలితము ఉంటుంది.

ఈ రకంగా పరమేశ్వరి ఎవరి ప్రాప్తాన్నిబట్టి వారికి అన్నము సమకూరుస్తుంది.

671వ నామం 'వసుధా'. వసు అంటే ధనము. ధన్నాన్ని ఇచ్చేది. వసు ధనం రత్నంచ దదాతి. పరమేశ్వరి తమ భక్తులకు ధనాన్ని, రత్నాలను ఇస్తుంది. 552వనామం చూడండి. 'సర్వవ్యాధిప్రశమనే' సమస్త వ్యాధులను నాశనం చేసేది. వ్యాధులు రెండు రకాలు. 1. శారీరకములు 2. మానసికములు. తలనొప్పి, జ్వరము, రోగము శరీరానికి సంబంధించినవి. ఇక రెండవది మానసికము. తనవారు దూరమైనారనో, కోరుకున్నది దొరకలేదనో పొందే వ్యథ. ఈ రెండురకాల బాధలను కూడా ఆ పరమేశ్వరి

ఉపశమింపచేస్తుంది. అంతే కాదు. 553వ నామంలో చెప్పినట్లుగా 'సర్వమృత్యునివారిణీ' అన్నిరకాల మృత్యువులను నివారించేది. మృత్యువు రెండు రకాలు 1. అప మృత్యువు. 2. కాలమృత్యువు. ఇందులో అపమృత్యువు అంటే ఆయువు తీరకుండా మరణించటం. కాలమృత్యువు అంటే ఆయువు పూర్తి అయి మరణించటం. ఈ రెండు రకాల మృత్యువులను కూడా నివారిస్తుంది ఆ దేవి. 698వ నామంలో చెప్పినట్లుగా ఆ దేవి 'సర్వలోక వశంకరి' సమస్త లోకాలను వశం చేసుకునేది. చతుర్దశ భవనాలలోనూ ఉన్న జీవుల్ని, తన భక్తులకు వశం చేస్తుంది. దుర్వాసుడు తన దేవీమహిమ్నః స్తుతిలోని 40వ శ్లోకంలో చెప్పినట్లుగా

**ఏవంయః స్మరతి ప్రబుద్ధసుమతిశ్రామత్స్వరూపంపరం**
**వృద్ధోఽప్యాశుయవా భవత్యనుపనుః స్త్రీణామనంగాయతే**
**సోష్టైశ్వర్య కితస్కృతాఖిల శ్రీజృంభితాత్మాలయః**
**పృధ్వీపాల కిరీటకోటివలభీ పుష్పార్చితాంఘ్రిర్భవేత్.**

ఆ పరమేశ్వరిని ఆరాధించేవాడు ముల్లోకాలనూ సమ్మోహనం చెయ్యగలుగుతాడు. అష్టైశ్వర్యాలు పొందుతాడు. లోకంలోని పాలకులు, రాజులు, అధికారులు అందరూ అతని పాదాలకు శిరసువంచి నమస్కరిస్తారు. ఈ రకంగా పరమేశ్వరి ఐహిక సుఖాలనే కాదు, భక్తుల యొక్క అర్హతలను బట్టి వారికి మోక్షాన్ని కూడా ప్రసాదిస్తుంది. అందుకే 764వ నామంలో 'స్వర్గాపవర్గదా' అనబడుతోంది. స్వర్గము అంటే - నిత్యసుఖము, అపవర్గము అంటే మోక్షము. ఆ దేవిని అర్చించే వారు జీవించి ఉన్నంతవరకు సుఖాలనుభవించి, మరణానంతరము వారి అర్హతను బట్టి మోక్షము పొందుతారు. అందుకే

**శ్రీ సుందరీసేవన తత్పరాణాం**
**భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ**

ఆ దేవిని అర్చించే వారికి భోగము, మోక్షము కూడా లభిస్తాయి. ఇదేమాటని చెబుతున్నారు ఇంద్రాది దేవతలు.

**ధర్మాణి దేవి సకలాని సదైవ కర్మా -**
**ణ్యత్యాదృతః ప్రతిదినం సుకృతీకరోతి ।**

**స్వర్గం ప్రయాతి చ తతో భవతీ ప్రసాదా -**
**ల్లోకత్రయేఽపి ఫలదా నను దేవి తేన ॥**

దేవీ! నీ ప్రసాదము చేత ధన్యుడైనవాడు ప్రతిరోజూ ధర్మకార్యాలన్నీ చేస్తూ ఉంటాడు. కాబట్టి స్వర్గాన్ని పొందుతాడు. అందుచేత ఓ తల్లీ! ముల్లోకాలలోనూ ఫలితాలను ఇచ్చేది నువ్వేనమ్మా.

పరమేశ్వరుడు ధర్మరక్షకుడు. కాబట్టి ధర్మాన్ని కాపాడుతూ ఉంటాడు. జీవులు చేసిన కర్మను బట్టి వారికి ఏది ఎంతవరకు ఇవ్వాలో అంతే ఇస్తాడు. అతడు శుద్ధబుద్ధముక్త స్వరూపుడు. శుద్ధసత్య గుణము ప్రధానముగా గలవాడు. జీవి చేసే కర్మను అనుసరించి అతడికి ఇహము లేదా పరాన్ని ఇస్తాడు. అంటే లౌకికమైన సిరిసంపదలు, భోగ భాగ్యాలుగాని, మోక్షము గాని ప్రసాదిస్తాడు. విష్ణుసహస్రంలో 867 నుంచి 876 వరకు గల నామా లలో ఈ విషయం వివరించబడింది. 867వ నామం సత్త్వవాన్ - శుద్ధ సత్వగుణము గలవాడు. శ్వేతాశ్వరోపనిషత్తులో గొప్పప్రభువగు ఇతడు సత్యప్రవర్తకుడు అని చెప్పబడింది. శౌర్యము, వీరత్వము మొదలైన గుణములు గల సత్వము - అనగా సత్తువ ఇతనికి కలదు.

*సాత్త్వికః* :- సత్యగుణఫలమైన జ్ఞానము, వైరాగ్యము, ధర్మములను తన అధీనంలో ఉంచుకొని, అర్హులైనవారికి వాటిని ఇచ్చేవాడు.

*సత్యః* :- నిజమైన వైభవము గలవాడు, సత్యమున నిలిచిఉండేవాడు. సాత్వికశాస్త్రము లన్నింటి యందు కొనియాడబడిన వైభవము గలవాడు.

*సత్యధర్మ పరాయణః* :- సాత్వికులు చేసే ధర్మాలను అత్యంతప్రీతితో స్వీకరించేవాడు.

*అభిప్రాయః* :- ధర్మముతోను, సత్యనిష్టతోను సర్వకాల సర్వావస్థల యందు అందరిచేత సేవించబడేవాడు. అందరిచేత కోరబడేవాడు.

*ప్రియార్హః* :- జ్ఞానులను అనుగ్రహించేవాడు.

*అర్హః* :- ఇతర ఫలాపేక్షలేనటువంటి జ్ఞానులకు మాత్రమే తగినవాడు.

*ప్రియకృత్* :- ఇతర దేవతలను సేవించే భక్తుల కోరికలు ఆ దేవతల

చేత పూర్తిచేయిస్తూ, క్రమంగా ఆ భక్తులను తన వైపుకు త్రిప్పుకునే వాడు. భక్తులు ఒకవేళ సిరిసంపదలు, భోగభాగ్యాలు ఆశించి తనను ఆశ్రయించి నప్పటికీ, వారి కోరికలు తీర్చి, చివరకు వారు తననే కోరుకునేటట్లు చేసేవాడు. అంటే భక్తుణ్ణి ఏ విధంగానైనా సరే మోక్షమార్గం వైపు త్రిప్పేవాడు.

*ప్రీతివర్ధన* :- ప్రీతి అంటే భక్తి అని అర్థం. కాబట్టి ప్రీతివర్ధనః. అంటే భక్తిని వృద్ధిచేయువాడు. ఈ రకంగా ఇతర దేవతలనారాధించే భక్తులకు తన మహిమలు చూపిస్తూ, వారికి తనయందు భక్తిని పెంపొందింపచేసేవాడు. తనయందు నమ్మకం లేని వారికి కూడా తమ మహిమలు చూపించి వారిని తన వైపుకు తిప్పుకునేవాడు.

*విహాయసగతి* :- పరమపదాన్నిచ్చేవాడు. భక్తి తత్పరులైన వారికి పునరావృత్తి లేనటువంటి పరమపదానిచ్చేవాడు. ఈ రకంగా జీవికి ముందుగా ఇహము, తరువాత పరము రెండూ ఇచ్చేవాడు పరమేశ్వరుడు. ఇదేవిషయం లలితాసహస్రంలోని 764వ నామం చూడండి. స్వర్గాపవర్గదా - పుణ్యకర్మలు చేసినవారు మరణానంతరము అనుభవించేది స్వర్గము. అక్కడ ఆకలి దప్పికలుండవు. ముసలితనము, మరణము ఉండవు. రోగ భయము అసలే ఉండదు. అక్కడ ఉన్న జీవి నిత్యయవ్వనుడు. సర్వసుఖాల లోనూ తేలియాడుతాడు. ఇక అపవర్గము అంటే - మోక్షము.

పరమేశ్వరి భోగాన్ని, మోక్షాన్ని రెండింటినీ ఇస్తుంది. మామూలుగా అయితే ఐహికసుఖాలు కావాలంటే మోక్షం వదలుకోవాలి. అలాగే మోక్షం కావాలంటే ఐహికవాంఛలు ఉండకూడదు.

**యత్రాపి భోగోన చ తత్ర మోక్షః**
**యాత్రాపి మోక్షో న చ తత్ర భోగః**

భోగంకావాలంటే మోక్షం ఉండదు. మోక్షం కావాలంటే భోగం ఉండదు. కాని

**శ్రీ సుందరీ సేవనతత్పరాణాం**
**భోగశ్చమోక్షశ్చకరస్థ ఏవ ॥**

పరమేశ్వరిని ఆరాధించేవారికి ఇహము, పరము రెండూ లభిస్తాయి.

అందుకే ఇంద్రాది దేవతలు అంటున్నారు. "ఓ పరమేశ్వరీ! నీ భక్తుడైన వాడు ముందుగా ధర్మకార్యాలు చేస్తాడు. స్వర్గాన్ని పొందుతాడు. అందుచేత లోకంలో ఏ రకమైన ఫలితమైన సరే. దాన్ని ప్రసాదించేది నువ్వేనమ్మా!.

**దుర్గే స్మృతా హరసి భీతి మశేషజంతోః -**
**స్వస్థైః స్మృతా మతి మతీవ శుభాం దదాసి**
**దారిద్ర్యదుఃఖభయహారిణి కా త్వదన్యా**
**సర్వోపకారకరణాయ దయార్ద్రచిత్తా ॥**

ఓ పరమేశ్వరీ! కష్టాలు కలిగినప్పుడు కాని, భయం కలిగినప్పుడు కాని, నిన్ను స్మరించినట్లైతే వారికష్టాలు, భయము పోగొడతావు. ఏరకమైన కష్టాలు, భయాలు, బాధలు లేనివారు నిన్ను ప్రార్థించినట్లైతే, వారికి అంతకన్న శుభాలనిస్తావు. భక్తులయొక్క పేదరికము కష్టాలు, భయములను పోగొట్టే ఓ దేవీ, జీవులకందరికి ఉపకారము చెయ్యాలనే మెత్తనిచిత్తము నీకు తప్ప ఇంకేదేవతకూ ఉండదు.

దేవతలంతా పరమేశ్వరిని ధ్యానిస్తున్నారు. "ఓ దేవీ! కష్టాలు కలిగి నప్పుడు కాని, భయం కలిగినప్పుడు గాని నిన్ను స్మరించినట్లైతే, ఆ భక్తుల భయాన్ని పోగొడతావు". దీనికి అనేక ఉదాహరణలున్నాయి. దేవీ భాగవతంలోని తృతీయస్కంధంలో సుదర్శన వృత్తాంతము ఇందుకు చక్కని ఉదాహరణ.

పూర్వంకాలంలో సరయూనదీ తీరాన ఉన్న అయోధ్యానగరాన్ని రాజధానిగా చేసుకుని సూర్యవంశపు రాజైన ధృవసంధి పాలిస్తున్నాడు. అతడికి ఇద్దరు భార్యలు మనోరమ, లీలావతి. ధ్రువసంధికి పెద్దభార్య మనోరమ యందు 'సుదర్శనుడు', చిన్నభార్య లీలావతి యందు 'శత్రుజిత్తు' అని కుమారులు కలిగారు. సుదర్శనుడు మంచిఅందగాడు, బుద్ధిమంతుడు శత్రుజిత్తు అందంతో పాటుగా శౌర్యపరాక్రమాలు, మాటకారితనము కూడా కలవాడు. ఆ కారణంగా రాజుతో పాటుగా అందరూ శత్రుజిత్తుని ప్రత్యేకమైన అభిమానంతో చూసేవారు.

ఒకనాడు రాజైన ధ్రువసంధి వేటకు వెళ్ళి ఒక గుహలో నిద్రపోతున్న సింహాన్ని కొట్టాడు. ఆ దెబ్బకు సింహం చావలేదు సరికదా, అదిలేచి రాజు మీదకి దూకింది. రాజుకీ, సింహానికీ ఘోరమైన పోరు జరిగింది. ఆ పోరులో సింహం పంజాదెబ్బకి రాజు, రాజు కత్తిదెబ్బకి సింహము ఇద్దరూ మరణించారు.

రాజుగారు మరణించారు కాబట్టి చేసేదిలేక మంత్రిసామంతులు అంతా కలిసి ఒక సమావేశం ఏర్పాటు చేసి, పెద్దరాణి కుమారుడైన సుదర్శనుని రాజుగా చెయ్యాలని తీర్మానించారు.

కళింగ దేశాధీశుడైన వీరసేనుని కుమార్తె మనోరమ ధ్రువసంధి పెద్దభార్య. ఉజ్జయినీ పురాధీశ్వరుడైన యూధాజిత్తు కుమార్తె లీలావతి. రెండవభార్య ధ్రువసంధి మరణవార్త వినగానే వీరసేనుడు, యూధాజిత్తు అయోధ్యకు వచ్చారు. ఇప్పుడు మళ్ళీ చర్చలు, మంతనాలు మొదలైనాయి. పట్టాభిషేకం ఎవరికి జరగాలి? అనే మీమాంస వచ్చింది. 'శాస్త్రప్రకారం పెద్దభార్య కుమారుడే రాజు' అన్నారు పండితులు. 'రాజరికానికి కావలసిన శౌర్యపరాక్రమాలు, మాటకారితనము ఉన్న శత్రుజిత్తే రాజుకావాలి' అన్నాడు యూధాజిత్తు. కొంతమంది ఈ వాదనను సమర్థించారు. సభ రెండు పక్షాలుగా విడిపోయింది. సుదర్శనుడే రాజని కొంతమంది శత్రుజిత్తు రాజని కొంతమంది. వాదనలు పెరిగాయి. పౌరుషాలు పెరిగాయి. ఆయుధాలు బయటకి వచ్చాయి. ఒక పక్షానికి నాయకుడు వీరసేనుడు. రెండవ పక్షానికి నాయకుడు యూధాజిత్తు. ఇరుపక్షాలకు యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో వీరసేనుని సంహరించాడు యూధాజిత్తు. వెంటనే తన మనుమడు, లీలావతి కుమారుడు అయిన శత్రుజిత్తును రాజుగా అభిషేకించాడు.

ఈ రకంగా భర్తనీ, తండ్రీ కూడాకోల్పోయిన మనోరమ కుమారుణ్ణి తీసుకుని మంత్రిగారి సహాయంతో అరణ్యాలకు వెళ్ళిపోయింది. త్రోవలో దొంగలు దోపిడీ చేశారు. చివరకు కట్టుబట్టలతో గంగానదీ తీరాన ఉన్న భరద్వాజుని ఆశ్రమం చేరింది.

మనోరమ ఋషి ఆశ్రమంలో కాలం వెళ్ళబుచ్చుతోంది. సుదర్శనుడు దినదిన ప్రవర్థమానుడవుతున్నాడు. అతడు అక్కడి ముని బాలకులతో

ఆడుకుంటూ ఉండగా. ఒక ముని బాలకుడు మంత్రిగారైన విదల్లుడిని 'క్లీబా' అని పిలిచాడు. క్లీబా అనే మాటకు ప్రత్యేకమైన అర్థం ఏమీలేదు. అది కేవలం ఎగతాళిగా అన్నమాట. కానీ అందులోని మొదటి అక్షరాన్ని తీసుకొని, దానికి బిందువు చేర్చి దాన్ని సర్వకాల సర్వావస్థలయందు జపం చెయ్యటం మొదలుపెట్టాడు సుదర్శనుడు. అది క్లీంకారము. కామరాజ బీజం ఈ రకంగా జపం చెయ్యటంవల్ల పరమేశ్వరి కరుణించింది. సకలశాస్త్రాలు, సర్వవిద్యలు చెప్పగానే వచ్చేసినాయి.

కాశీనగరాన్ని 'సుబాహుడు' అనే మహారాజు పాలిస్తున్నాడు. అతని కుమార్తె శశికళ. మంచి రూపవతి, గుణవతికూడా. ఒక రోజు కలలో పరమేశ్వరి కనిపించి "సుదర్శనుడు నీకు భర్త అవుతాడు" అని చెప్పింది. అప్పటినుంచీ సుదర్శనుణ్ణే తన భర్తగా ఊహించుకుంటోంది శశికళ.

సుబాహుడు తన కుమార్తెకు స్వయంవరం ప్రకటించాడు. దేశదేశాల రాజులందరూ ఆ స్వయంవరానికి విచ్చేశారు. సుదర్శనుడు కూడా కాశీ నగరానికి బయలుదేరాడు. తల్లి మనోరమ కుమారుణ్ణి స్వయంవరానికి వెళ్ళవద్దని వారించింది. వినలేదు సుదర్శనుడు. భారమంతా ఆ దేవిమీదనే వేసి ప్రయాణానికి సిద్ధమైన కుమారుని దీవిస్తున్నది.

అగ్రస్తేంబికాపాతు । పార్వతీపాతుపృష్ఠతః

వారాహీవిషయేపాతు । దుర్గా దుర్గేషుకర్హచిత్ ॥

కాళికాకలహేఘోరే పాతుత్వాం పరమేశ్వరీ

మండపే తత్ర మాతంగీ తథా సౌమ్యా స్వయంవరే

భవానీ భూపమధ్యేతు పాతుత్వాం భవమోచనీ

గిరిజాగిరి దుర్గేషు చాముండాచత్వరేషు చ

కామగా కాననేష్వేవం రక్షతుత్వాంసనాతనీ

వివాదేవైష్ణవీశక్తి రవతాత్త్వాం రఘూద్వహా

భైరవీ చరణే సౌమ్య శత్రూణాంవై సమాగమే

సర్వదా సర్వదేశేషు పాతుత్వాం భువనేశ్వరీ
మహామాయా జగద్ధాత్రీ సచ్చిదానందరూపిణి ॥

| | | |
|---|---|---|
| అగ్రభాగంలో | - | అంబిక |
| వెనుకవైపు | - | పార్వతి |
| విషమములందు | - | వారాహి |
| దుర్గములందు | - | దుర్గ |
| కలహమందు | - | కాళి |
| స్వయంవర మంటపంలో | - | మాతంగి |
| రాజమధ్యమందు | - | భవ మోచని అయిన భవాని |
| గిరి దుర్గములయందు | - | గిరిజ |
| చత్వరములయందు | - | చాముండ |
| కాననములయందు | - | సనాతినీదేవి |
| వివాదములయందు | - | వైష్ణవిదేవి |
| శత్రువుల యందు | - | భైరవి |

నిన్ను సర్వదా రక్షించుగాక. సచ్చిదానంద స్వరూపిణి అయిన భువనేశ్వరి నిన్ను సర్వదా రక్షించుగాక !

ఈ రకంగా తల్లి దీవెన లంది స్వయంవర ప్రాంగణం చేరాడు సుదర్శనుడు. శశికళా సుదర్శనుల వివాహం జరిగింది. తిరుగు ప్రయాణం కట్టాడు సుదర్శనుడు. తోవలో యుధాజిత్తు తనసేనతో అడ్డునిలిచాడు. తను ఒక్కడు శత్రువు లనేకురు. కామరాజ బీజాన్ని జపించాడు సుదర్శనుడు. మరుక్షణమే ఆ దేవి ప్రత్యక్షమై వివిధరూపాలతో, వివిధరకాలైన ఆయుధాలు ధరించి అన్ని వైపులనుంచి శత్రుసేనను ముట్టడించింది. వారిని పరాజితు లను చేసింది.

ఈ రకంగా పరమేశ్వరి కృపవల్ల రక్షింపబడిన సుదర్శనుడు అయోధ్యానగరానికి రాజై ప్రజలను కన్నబిడ్డల వలె చాలాకాలం పాలించాడు.

కాబట్టి కష్టాలలో ఉన్నవారెవరైనా సరే పరమేశ్వరిని స్మరించినట్లైతే వారి కష్టాలు తీరిపోతాయి. ఇదే మాటను విష్ణుసహస్రంలో చెబుతూ...

**"యస్యస్మరణమాత్రేణ జన్మ సంసార బంధనాత్"**

ఆ పరమేశ్వరుని తలచినంతమాత్రం చేతనే సంసారబంధనాలు, జన్మపరంపరలు వదలిపోతాయి అంటారు.

ఈ రకంగా కష్టంలో ఉన్నవారి కోరికలే కాదు. కష్టాలు లేకుండా సుఖంగా ఉండేవారు గనక ఆ పరమేశ్వరిని ధ్యానించి నట్లైతే

**"వేదాంతగోబ్రాహ్మణస్యాత్, క్షత్రియో విజయీభవేత్**
**వైశ్యోధనసమృద్ధిప్స్యాత్, శూద్ర సుఖమవాప్నుయాత్ ।**
**ధర్మార్థీప్రాప్ను యాద్ధర్మ మర్థార్థీచార్థమాప్నుయాత్**
**కామూనవాప్నుయాత్కామే ప్రజార్థీచాప్నుయాత్ ప్రజామ్ ॥**

ఆ పరమేశ్వరిని ధ్యానించినట్లైతే

బ్రాహ్మణుడు - వేదాంతజ్ఞానాన్ని

క్షత్రియుడు - విజయాన్ని

వైశ్యుడు - ధనాన్ని

శూద్రుడు - సుఖాన్ని పొందుతాడు. అంతేకాదు. ధర్మాని కోరితే - ధర్మాన్ని, ధనం కోరితే -ధనాన్ని

భోగంకావాలంటే - భోగము

సంతానం కావాలంటే - సంతానము పొందుతారు.

అలాగే దేవీభాగవతం చివరలో దేవీభాగవత శ్రవణ ఫలితాన్ని చెబుతూ

**అపుత్రోలభతే పుత్రా అర్థార్థీ అర్థమాప్నుయాత్**
**విద్యార్థీ ప్రాప్ను యాద్విద్యాకీర్తి మండిత భూతలః**

దేవీ భాగవతాన్ని చదివటం లేక వినినంత మాత్రం చేతనే

పుత్రులు లేని వారికి - పుత్రులు కలుగుతారు

ధనం లేనివారికి - ధనం వస్తుంది.

విద్యార్థి సంపూర్ణమైన విద్యను పొంది అఖండమైన కీర్తిని ఆర్జిస్తాడు.

**వంధ్యాము కాక వధ్యావా మృతవంధ్యాచయాంగనా**
**శ్రవణాదస్య తద్దోషానివర్తేత న సంశయః ॥**

వంధ్య అంటే గొడ్రాలు. వంధ్యత్వముపోయి. సంతానవతి అవుతుంది.

ఈ రకంగా భక్తుల కోరికలు తీరుస్తుంది పరమేశ్వరి. అందుచేతనే "అందరికీ ఉపకారం చెయ్యాలనే తలంపు ఆ దేవికి తప్ప ఇంకెవరికీలేదు" అంటున్నారు దేవతలు.

**ఏభి ర్హతై ర్జగదుపైతి సుఖం తథైతే -**
**కుర్వంతు నామ నరకాయ చిరాయ పాపమ్ ।**
**సంగ్రామమృత్యు మధిగమ్య దివం ప్రయాంతు -**
**మత్వేతి నూన మహితా న్వినిహంసి దేవి ॥**

"వీళ్ళని చంపటం వలన లోకాలకు శుభంకలుగుతుంది. వీళ్ళు ఘోర మైన పాపం చేశారు. కాబట్టి చాలాకాలం నరకలోక బాధలు అనుభవించాలి. అయినప్పటికీ చివరకు నాతో యుద్ధంచేసి, నాచే సంహరించబడ్డారు కాబట్టి స్వర్గాన్నే పొందుతారు" అని ఆలోచించి మా శత్రువులను సంహరిస్తావు తల్లీ.

పరమేశ్వరి రాక్షసంహారం చేస్తుంది. ఇక్కడ మనం గమనించాల్సిన విషయం ఒకటుంది. రాక్షసు లందరినీ భగవంతుడు సంహరించడు. బలి చక్రవర్తి, విభీషణుడు మొదలైన వారుకూడా రాక్షసులే. వారిని సంహరిం చలేదు. హిరణ్యకశపుణ్ణి సంహరించాడు. అతని కుమారుడు ప్రహ్లాదుడికి పట్టాభిషేకం చేశాడు. రాక్షసులలో కూడా ఎవరివల్లనైతే లోకాలకు ముప్పు ఏర్పడుతున్నాదో, వారిని మాత్రమే సంహరింస్తాడు. అసలు రాక్షసు లెవరు? దేవదానవు లందరూ కశ్యపుడి సంతానమే. కాకపోతే వారి తల్లులు వేరు. కశ్యపప్రజాపతికి

అదితియందు పుట్టినవారు - దేవతలు

దితియందు పుట్టినవారు - దైత్యులు

దనువునందు పుట్టినవారు - దానవులు

సత్యగుణ ప్రధానులైనవారు దేవతలు. కాగా తమోగుణ ప్రధానులు రాక్షసులు. వీరిలోకూడా లోకకంటకులైన వారిని మాత్రమే సంహరించాడు. వారు రాక్షసులైనప్పటికీ వారి దుర్మార్గాలు, దుష్కృత్యాలు మితిమీరే వరకు వారి జోలికి పోలేదు. వారి మనుగడ లోకాలకు ప్రమాదము అని భావించినప్పుడు, వారిని సంహరించటంవల్ల లోకాలకు శుభం కలుగుతుంది అనుకున్నప్పుడు మాత్రమే వారిని సంహరించాడు.

అలాగే మహాపాపాలు చేసినటువంటివారు, అంటే పరస్త్రీలను చెర బట్టినవారు; ధర్మాన్ని నాశనం చేసినవారు, వేదదూరులు, భ్రష్టులు అయినవారు మరణానంతరము చాలాకాలము నరకలోక బాధలు అనుభవిం చాలి. అటువంటి వారికికూడా యుద్ధంలో తన చేతిలో సంహరింపబడ్డారు అనే మిషతో శాశ్వత స్వర్గలోక ప్రాప్తి కలిగించాడు.

భగవంతుడు ఎవరిని సంహరించినప్పటికీ వారిని శిక్షించాలనే ఉద్దేశంతో మాత్రం సంహరించలేదు. గజేంద్రమోక్ష ఘట్టంలో మొసలి ఏనుగును పట్టుకుంది. గజరాజు మొర ఆలకించి మొసలిని సంహరించి ఏనుగును రక్షించాడు. మొసలికి శాప విమోచనం చేసి గంధర్వత్వాన్ని ప్రసాదించాడు. అంతేకాని మొసలిని శిక్షించలేదు. అలాగే అజామీళుడు.

**క్రూరుత్ము దజామీళుడు**

**నారాయణ అనుచు ఆత్మనందను బిలువన్**

**ఏ రీతి నేలుకొంటివి**

**ఏరీ నీ సాటివేల్పులు ఎందును కృష్ణా !**

అజామీళుడు బ్రాహ్మణబాలుడు. వేదవేదాంగాలు అభ్యసించాడు. కాని కర్మవశాన భ్రష్టుడై గిరిజన యువతిని వివాహమాడి జంతువులను వేటాడి భార్యాబిడ్డలను పోషించాడు. కాని అవసానదశలో తన కుమారుడైన నారాయణుని నోరారాపిలవటం చేత అతడికి స్వర్గాన్నిచ్చాడు శ్రీమహావిష్ణువు.

అదే విధంగా శివపురాణంలో గుణనిధి.

పూర్వకాలంలో కాంపిల్యనగరంలో యజ్ఞదత్తుడు అనే పండితుడుండే వాడు. అతని కుమారుడు గుణనిధి. తండ్రి మహాపండితుడు. కాని కుమారుడికి ఏమాత్రం చదువులేదు. పైపెచ్చు చెడు సహవాసాలకు కూడా అలవాటుపడ్డాడు. ఒక రోజున అతడి సంగతి అంతా బయటపడింది. దాంతో తండ్రి కోప్పడతాడనే భయంతో ఇల్లు వదలిపారిపోయాడు గుణనిధి. అలా వెళ్ళి వెళ్ళి ఒక గ్రామం చేరాడు. చీకటిపడింది. దగ్గరలో ఒక ఆలయం కనిపించింది. అందులోకి వెళ్ళాడు. అది శివాలయం. ఆ రోజు శివరాత్రి. ఊరి వారంతా పగలు ఉపవాసం ఉండి, రాత్రికి గుడిలో జాగారం చేస్తున్నారు. వారితో పాటుగా తానూ జాగారం చేశాడు. అప్పటికే రెండు రోజుల నుంచీ భోజనం లేదు. తెల్లవారబోతోంది. భక్తులందరూ తాము వండి తెచ్చిన పదార్థాలను గుడిలో పెట్టి స్నానం చేసి రావటానికి బయటకు వెళ్ళారు. అది అదనుగా తీసుకున్న గుణనిధి గుడిలో ప్రవేశించి ఆహార పదార్థాలను దొంగిలించబోయాడు. ఇంతలో తిరిగి వచ్చిన భక్తులు అతణ్ణి చూసి దొంగదొంగ అని అరచి పట్టుకోబోయారు. ఆ తడబాటులో గుణనిధి కాలుజారి నందీశ్వరుడి మీద పడ్డాడు. ఆయువు పట్టున దెబ్బ తగిలి మరణించాడు. అతణ్ణి తీసుకుపోవటానికి యమకింకరులు వచ్చారు.

అదేసమయంలో శివభటులు వచ్చి "గుణనిధి ఎంత పాపాత్ముడై నప్పటికీ, దురాత్ముడైనప్పటికీ అవసాన దశలో శివరాత్రి పర్వదినాన ఉపవాసముండి, జాగారం చేసి, శివాలయంలో మరణించాడు కాబట్టి అతడు కైలాసం చేరతాడు." అని చెప్పి గుణనిధిని కైలాసానికి తీసుకుపోతారు.

ఈ విధంగా దుర్మార్గుడు కాని దుష్టుడు కాని దురాచారపరుడు కాని భ్రష్టుడు కాని చివరకు రాక్షసుడు కాని ఆ పరమేశ్వరుని స్మరిస్తూ మరణించిన వారికి శాశ్వత స్వర్గలోకము ప్రాప్తిస్తుంది. మరి అటువంటప్పుడు ఆ పరమేశ్వరుని చేతిలో సంహరించబడ్డ రాక్షసులకు మాత్రం స్వర్గలోకం ప్రాప్తించదా?

అందుకే దేవతలు "అమ్మా! నీ చేతిలో మరణించిన రాక్షసులకు స్వర్గలోకం ప్రాప్తించాలనే తలంపుతోనే వారిని సంహరిస్తున్నావు" అంటున్నారు.

దృష్ట్వైవ కిం న భవతీ ప్రకరోతి భస్మ -
సర్వాసురా నరిషు య త్ప్రహిణోషి శస్త్రమ్ ।
లోకాన్ ప్రయాంతు రిపవో ఽపి హి శస్త్రపూతా -
ఇత్థం మతి ర్భవతి తే ష్వహితేషు సాధ్వీ ॥

అమ్మా శత్రువుల యందుకూడా నీవు ఎనలేని కరుణ కలిగి ఉంటావు. తల్లీ! రాక్షసులందరినీ కేవలము వీక్షణ మాత్రం చేతనే భస్మం చేసెయ్యగలవు. కాని వారి మీద బాణాలు ప్రయోగిస్తావు. ఎందుకంటే నీ బాణాలు తగిలి ఆ రాక్షసులు పవిత్రులవుతారనే ఉద్దేశంతోనే అలా చేస్తావు. అంతేకాని వేరుకాదు.

పరమేశ్వరుడు అపారమైన శక్తి సంపన్నుడు. అతనితో సమానమైన వారుకాని, అతని కన్న అధికులు కాని ఎవరూ లేరు. అందుకే లలితా సహస్రంలో అమ్మవారిని "ఏకాకీ" అని సంబోధిస్తారు. ఆ పరబ్రహ్మ కేవలము సంకల్పమాత్రంచేతనే ఈ జగత్తులో సృష్టి స్థితి లయాలన్నీ చేస్తున్నాడు. అతడు ఘటనాఘటన సమర్థుడు. అటువంటి పరమేశ్వర తత్త్వానికి శత్రు సంహారం చెయ్యటం అనేది కష్టమైన పనికాదు. ఆ దేవిని గురించి చెప్పేటప్పుడు "ఉన్మేషనిమితోత్పన్న విపన్నభువనావళిః" అంటారు. ఆమె కనులు తెరిస్తే సృష్టి. కనులు మూస్తే ప్రళయం. "అందుచేత ఓ దేవీ! నీవు కనులను మూయవద్దు" అంటారు శంకరభగవత్పాదులవారు.

తన కనులు మూయటంతోనే ఈ జగత్తుకు ప్రళయం సృష్టించగల ఆ పరమేశ్వరి, కేవలము వీక్షణ మాత్రంచేతనే రాక్షసులను భస్మంచేయగలదు అనటంలో సందేహంలేదు. కాని ఆమె అలా చెయ్యటం లేదు, వారితో యుద్ధం చేస్తున్నది. వారి మీద బాణాలు ప్రయోగిస్తున్నది. రాక్షసులు ప్రయోగించిన అస్త్రాలను, శస్త్రాలను నాశనం చేస్తున్నది. దేనికి? రాక్షసులు అంటే అజ్ఞానులు. ఈ శరీరమే ఆత్మ అని నమ్మేవారు.

ఛాందోగ్యోపనిషత్తులో ఒక కథ ఉన్నది.

పూర్వకాలంలో ఒకసారి ప్రజాపతి ఆత్మతత్త్వాన్ని గురించి ఒక ప్రకటనచేశాడు.

"ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు కబళించదు. శోకం తాకదు. ఆత్మకు ఆకలిదప్పికలు ఉండవు. మానవుడు

సత్యకాముడు సత్యసంకల్పుడు అయి ఆత్మ జిజ్ఞాసను అలవరచుకోవాలి. ఆత్మకోసం అన్వేషించినవాడు, ఆత్మను అనుభవించినవాడు ఆత్మస్వరూపాన్ని పొందుతాడు. అతనికి పరిపూర్ణత్వము వస్తుంది."

దేవతలు, రాక్షసులు కూడా ఆ మాటలు విన్నారు. ఆత్మ గురించి మనంకూడా అన్వేషిద్దాం. ఆత్మవల్ల కోరికలు తీరతాయని బ్రహ్మ చెప్పాడు కదా! అని వారు భావించారు.

దేవతల రాజు ఇంద్రుడు, రాక్షసులరాజు విరోచనుడు ఇద్దరూ ఆత్మ జ్ఞానం సంపాదిద్దామని చేతితో దర్భలు పట్టుకుని బ్రహ్మ వద్దకు వెళ్ళారు. బ్రహ్మ వీరిద్దరినీ ముప్పై రెండుసంవత్సారాలు బ్రహ్మచర్య దీక్ష వహించమని చెప్పాడు. ప్రజాపతి చెప్పినట్లుగానే దీక్ష పూర్తి చేశారు వారిద్దరూ.

"వత్సలారా! మీరు నాకోసం దేనికి వచ్చారు?" అన్నాడు బ్రహ్మ.

"భగవాన్! ఆత్మతత్త్వాన్ని గురించి మీరు చెప్పిన మాటలు విన్నాం. ఆత్మను గురించి పూర్తిగా తెలుసుకోవాలని వచ్చాం" అన్నారు ఇంద్ర విరోచనులు.

"మనుష్యుల కనుపాపలలో మెదలుతూ కనిపించే పురుషుడే ఆత్మ. ఆత్మ అభయం. అమృతమయం. అదే బ్రహ్మము" అన్నాడు బ్రహ్మ.

ఆ మాటలు విన్న ఇంద్రవిరోచనులు "దేవా! నీటిలో కనిపించే ప్రతి బింబము, అద్దంలో కనిపించే ప్రతిబింబము. ఈ రెండింటిలో ఏది, ఆత్మరూపం?" అని అడిగారు.

"నేను మొదటగా కళ్ళలో మెరిసే ఏ పురుషుని వర్ణనచేశానో, అతడే వీటన్నింటిలోనూ ప్రతిఫలిస్తాడు. ఒకసారి నీళ్ళలో మీ రూపాలు చూసుకుని మీ అనుభవాలు నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ.

ఇంద్రవిరోచను లిద్దరూ నీటిలో తమ ప్రతిబింబాలను వీక్షించి ప్రజాపతి దగ్గరకు వెళ్ళారు. ప్రజాపతి వీరిని చూసి "మీరు ఏం చూశారు"? అని అడిగాడు.

"నఖశిఖ పర్యంతము కేశపాశాలతో నిండిఉన్న మా శరీరాల ప్రతిరూపమే మాకు నీటిలో కనిపించింది" అన్నారు.

"అయితే శరీరాలు శుభ్రపరచుకుని మంచి వస్త్రాలు ఆభరణాలు ధరించి నీటిలో మీ ముఖాలను చూసుకోండి. ఆ తరువాత మీరు ఏం చూశారో నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ. అలాగే అని వాళ్ళిదరూ వెళ్ళి పోయి కొంతసేపటికి తిరిగి వచ్చి "స్వామీ! చక్కని వస్త్రాలు, ఆభరణాలతో అలంకరించిన మా శరీరాలే నీటిలో కనిపించాయి" అన్నారు.

"అభయమూ, అమృతమయమూ అయిన ఆత్మ అదే. అదే బ్రహ్మము" అన్నాడు ప్రజాపతి.

అది విన్న ఇంద్రవిరోచనులు ఆత్మను గురించి తమకు అంతా తెలిసిందనుకుని తిరిగి వెళ్ళిపోయారు. అలా వెళ్ళిపోతున్నవారిని చూసి "అసలు ఆత్మజ్ఞానం లభించకుండానే వారు తెలిసింది అనుకుని వెళ్ళి పోతున్నారు. వారు దేవతలైనా, రాక్షసులైనా శరీరాన్నే ఆత్మ అని భావించటం పతనహేతువు" అనుకున్నాడు ప్రజాపతి.

విరోచనుడు ఆత్మను గురించిన ఈ సిద్ధాంతాన్నే ప్రబోధించాడు. అసలైన పరమసత్యం తమకు లభించిందని తృప్తిచెందాడు. దేహమే ఆత్మ అని ప్రచారం చేశాడు.

కాని ఇంద్రుడు దీనితో తృప్తిచెందక మళ్ళీ బ్రహ్మ దగ్గరకు వచ్చి అసలైన బ్రహ్మజ్ఞానం సంపాదించాడు.

ఈ రకంగా 'దేహమే ఆత్మ' అని భావించిన రాక్షసులు అజ్ఞానులు. అందుచేత ఆ పరమేశ్వరి తనబాణాలతో వారి అజ్ఞానాన్ని పటాపంచలు చేసి, వారికి ఉత్తమలోకాలను అనుగ్రహిస్తుంది.

**ఖడ్గప్రభానికర విస్ఫురణైస్తథోగ్రైః -**<br>
**శూలాగ్రకాంతినివహేన దృశో౽ సురాణామ్ ।**<br>
**య న్నాగతా విలయ మంశుమదిందుఖండ -**<br>
**యోగ్యాననం తవ విలోకయతాం త దేతత్ ॥**

తల్లీ! నీఖడ్గము నుంచి, శూలాగ్రము నుంచి భయంకరమైన కాంతులు వెలువడుతున్నాయి. అటువంటి కాంతులను వీక్షించిన వారికి దృష్టిదోషము తప్పక కలుగుతుంది. కాని రాక్షసులు చంద్రబింబమునుబోలిన చల్లని కాంతులను వెదజల్లు నీ ముఖపద్మమును వీక్షిస్తున్నారు కాబట్టే వారికి దృష్టిదోషము కలగటం లేదు.

పరమేశ్వరిని వర్ణిస్తూ దేవీ భాగవతం కోటిసూర్య ప్రతీకాశం చంద్రకోటి సుశీతలం ఆ దేవి కొన్నికోట్ల సూర్యులకాంతితో ప్రకాశిస్తున్నది. ఒక సూర్యుని కాంతికే తట్టుకోలేకుండా ఉన్నాం కదా? మరి కొన్ని కోట్ల సూర్యుల కాంతికి జీవరాసి అంతా మండిమసై పోదా? అని అనుమానం వస్తుంది. అలా జరగదు. ఎందుకంటే కొన్ని కోట్లచంద్రుల చల్లదనాన్ని ప్రసరింపచేస్తుంటుంది. అందుకనే దేవతలు "బాలచంద్రుని బోలు నీ ముఖము చల్లని కాంతులను ప్రసరింపచేస్తున్నది" అంటున్నారు.

ఇక దేవి చేతిలో ధనుర్బాణాలు, పాశము అంకుశము ఉంటాయి కదా! మరి ఈ ఖడ్గము, శూలము ఎక్కడనుంచి వచ్చాయి? అని అనుమానం.

సప్తశతిలో ఇది మధ్యమచరితం. ఇక్కడ మహాలక్ష్మీ స్వరూపిణి అయిన పగమేశ్వరి మహిషాసురసంహారం చేసింది. ఆ మహాలక్ష్మీ ఎలా ఉన్నది అంటే

**ఓం అక్షస్రక్పరశుంగదేషుకులిశం పద్మం ధనుః కుండికాం**
**దండం శక్తి మసించ చర్మజలజం ఘంటాంసురా భాజనం**
**శూలం పాశసుదర్శనేన దధతీం హస్తైః ప్రవాళీప్రభాం**
**సేవేసైరిభమర్దినీమిహా మహాలక్ష్మీం సరోజస్థితాం ॥**

ఈ దేవి మొత్తం 18 చేతులు కలిగి ఉన్నది.

ఆ చేతుల యందు

1. అక్షమాల, 2. గండ్రగొడ్డలి, 3. గద, 4. బాణము, 5. వజ్రాయుధము, 6. కమలము, 7. ధనుస్సు, 8. కలశము, 9. దండము, 10. శక్తి, 11. ఖడ్గము, 12. డాలు, 13. శంఖము, 14. ఘంట, 15. పానపాత్ర, 16. శూలము. 17. పాశము, 18. చక్రము.

ధరించి 'ప్రవాళప్రభాం' అంటే పగడపు ఛాయ గలిగి, మహిషాసురుని సహరించిన ఆ మహాలక్ష్మిని ధ్యానిస్తున్నాను అని రెండవ అధ్యాయము ప్రారంభంలో ప్రార్థనాశ్లోకంలో చెప్పబడింది. కాబట్టి మహిషాసురుని సంహరించిన ఆ దేవి యొక్క 11వ చేతిలో ఖడ్గము 16వ

చేతిలో శూలము ఉన్నాయి. అవి భయంకరమైన కాంతులను ప్రసరింప చేస్తున్నాయి.

**దుర్వృత్తవృత్తశమనం తవ దేవి శీలమ్ -**
**రూపం తథైత దవిచింత్య మతుల్య మన్యైః ।**
**వీర్యం చ హంతృ హృతదేవపరాక్రమాణామ్ -**
**వైరిష్వసి ప్రకటితైవ దయా త్వయేత్థమ్ ॥**

దేవీ! దుష్టుల ప్రవర్తనమును అణచివేయుటయే నీ స్వభావము. దేవతలయొక్క పరాక్రమాన్ని అపహరించిన నీ శక్తి నాశనం చేస్తుంది.

**యథాయథాహి ధర్మశ్చ గ్లానిర్భవతి భారత**
**అభ్యుత్థానమధర్మశ్చ తథాత్మానం సృజామ్యహం ॥**

ఈ లోకంలో ధర్మానికి ఎప్పుడైతే హాని కలుగుతుందో అప్పుడు నేను ఇక్కడ ఉద్భవిస్తాను.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతాం**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥**

దుష్టశిక్షణ శిష్ట రక్షణ చేసి ధర్మాన్ని సంస్థాపనచెయ్యటం కోసం ఆత్రత్రాణ పరాయణుడైన శ్రీమన్నారాయణుడు ప్రతియుగంలోనూ ఈ లోకంలో ఆవిర్భవిస్తుంటాడు. ఇక్కడ యుగము అంటే కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము అని కాదు. ధర్మానికి ఎప్పుడైతే హాని కలుగుతుందో అప్పుడు ఆ పరమేశ్వరుడు ఈ లోకంలో ఉద్భవించి ధర్మసంస్థాపన చేస్తాడు.

పరమేశ్వరుడు ధర్మస్వరూపుడు.

**సాధారణోపకరణం ధర్మోయస్యాస్తికేవలం**

లోకంలో ప్రసిద్ధమైన ధర్మాన్ని జగద్రక్షణ కోసం సాధనంగా గ్రహించే వాడు.

ఈ జగత్తును రక్షించటానికి లోకంలో ప్రసిద్ధమైన ధర్మమే ఇతనికి సాధారణమైన ఉపకరణము. ఆ ధర్మముతోనే ఇతడు లోకాలను రక్షిస్తాడు.

రామావతారంలో 'రాముడు మూర్తీభవించిన ధర్మస్వరూపుడు' అని చెప్పబడ్డాడు. ధర్మాన్ని తప్పి తమ్ముని భార్యను చెరబట్టినవారిని వధించాడు. ఆ తరువాత వాలి "రామా! నన్నెందుకు వధించావు?" అని అడిగినప్పుడు "నువ్వు రాజువు. ధర్మం తప్పావు. తమ్ముని భార్యను చెరబట్టావు. రాజే అధర్మపరుడైతే దేశం ఏమవుతుంది? ధర్మం ఎలా నిలుస్తుంది? అందుచేత ధర్మాన్ని నిలపటానికి నేను నిన్ను సంహరించాను" అన్నాడు. అలాగే ధర్మం తప్పాడు కాబట్టే రావణబ్రహ్మను సంహరించాడు.

పరమేశ్వరుడు సూక్ష్మమైనవాడు. ధర్మము కూడా సూక్ష్మమైనదే. అందుకే ధర్మము, ధర్మసూక్ష్మము అంటారు.

రావణ బ్రహ్మను సంహరించాడు రాముడు. అతడికి బ్రహ్మాహత్యా పాతకం అంటలేదు. వృత్రాసురుని సంహరించాడు ఇంద్రుడు. అతడికి బ్రహ్మాహత్యాపాతకం చుట్టుకుంది. సంహరింపబడ్డవారు ఇద్దరూ బ్రాహ్మ ణులే. అయినా ఒకరిని చంపితేనే పాతకం అంటుకుంది. ఎందుకంటే .....

రావణబ్రహ్మను యుద్ధరంగంలో ఎదిరించి సంహరించాడు రాముడు. వృత్రునితో సహవాసం చేసి, అతణ్ణి నమ్మించి, అతడు తపస్సు చేసు కుంటుండగా సంహరించాడు ఇంద్రుడు. ఇది కపటోపాయం. అందుకే ఇంద్రుడికి బ్రహ్మాహత్యాపాతకం చుట్టుకుంది. ఇది ధర్మసూక్ష్మము. ధర్మము, ధర్మసూక్ష్మము రెండూ పరమేశ్వరుడే. అందుకే విష్ణుసహస్రంలోని 403వ నామము 'ధర్మః' అని చెప్పబడింది. అలాగే లలితాసహస్రంలో 958వ నామం 'ధర్మిణీ'.

**ధర్మశీలత్వాత్ ధర్మిణీ**

ధర్మగుణం కలది కాబట్టి ధర్మిణీ అనబడుతున్నది. పరమేశ్వరి శ్రుతి, స్మృతులలో చెప్పిన ధర్మగుణం కలది.

**ధర్మాన్ ధారయతీతి ధర్మీ**

ధర్మాలను ధరించునది. ధర్మాలను ఆచరించునది. అందుచేతనే ఆమె ధర్మిణీ అనబడుతున్నది.

ధర్మము అంటే - పుణ్యము, న్యాయము, స్వభావము, ఆచారము వేదోక్తవిధి, సత్కార్యము, నీతి అని అర్థం. సమాజంలో ఎక్కువమందికి

మంచిని చేకూర్చేది ధర్మము. శిష్టరక్షణ కోసం రాక్షస సంహారం చెయ్యటం ధర్మం. ఈ రకంగా స్వయంగా తాను ధర్మాన్ని ఆచరిస్తూ, తన భక్తులచేతకూడా ధర్మాన్ని ఆచరింపచేసేది కాబట్టి ఆ పరమేశ్వరి 'ధర్మిణీ' అనబడుతున్నది.

అటువంటి ధర్మసంస్థాపన కోసం ధర్మదూరులైన రాక్షస సంహారంచేసేది.

ధర్మసంస్థాపన అంటే - ధర్మశాస్త్రాలలో చెప్పినట్లుగా తాను ప్రవర్తించి, ధర్మాన్ని ప్రచారం చెయ్యటం, వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, పరలోకము, మహాపురుషులు, భగవంతుడు, మొదలైనవాటి మీదగట్టి విశ్వాసాన్ని ఏర్పరచటం కోసం అందరి హృదయాలలోనూ పాతుకు పోతున్నట్లుగా సహేతుకము, సమర్థము అయిన ప్రవచనాల ద్వారా ఉపదేశాలివ్వటము. తిరుగులేని విధంగా అదేశాలివ్వటము. సదాచారాల పట్ల శ్రద్ధను పెంపొందింప చేయటము. ఇటువంటి పనులు చేస్తూ ఇవి ప్రజల హృదయాలలోకి నాటుకుపోయేటట్లుగా చెయ్యటం. వీటిని ప్రజలు ఆచరించేటట్లుగా చెయ్యటము.

ఇటువంటి ధర్మాన్ని స్థాపించటం కోసం, ధర్మదూరులైన రాక్షస సంహారం చేస్తుంది పరమేశ్వరి.

**కేనోపమా భవతు తే ఽస్య పరాక్రమస్య -**
**రూపం చ శత్రుభయకార్యతిహారి కుత్ర ।**
**చిత్తేకృపా సమరనిష్ఠురతా చ దృష్టా -**
**త్వయ్యేవ దేవి వరదే భువనత్రయేఽపి ॥**

తల్లీ! నీ పరాక్రమాన్ని దేనితో పోల్చగలము? అత్యంత మనోహరమై కూడా శత్రువులకు భయాన్ని కలిగించే నీ సౌందర్యము ఇంకెక్కడా కనిపించదు. హృదయమందు కృప, యుద్ధమునందు నిష్ఠురత అనేవి ముల్లోకాల్లోనూ నీయందు తప్ప ఇంకెక్కడా కనిపించవు.

ఇక్కడ పరమేశ్వరి సౌందర్యాన్ని గురించి చెబుతున్నారు. ఆ దేవి సౌందర్యాన్ని వర్ణిస్తూ శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలోని 12వ శ్లోకంలో

**త్వదీయం సౌందర్య తుహిన గరికన్యే తులయితుం**
**కవీంద్రాః కల్పంతే కథ మసి విరించి ప్రభతయః**

"ఓ తల్లీ ! లోకోత్తరమైన నీ సౌందర్యాన్ని వర్ణించటము బ్రహ్మాది దేవతలకు కూడా సాధ్యం కాదు" అన్నారు.

ఆ సౌందర్యము ఎలాటిది అంటే తన భక్తులకు సాయుజ్యాన్నిస్తుంది. అదే స్వరూపం శత్రువులకు సింహస్వప్నంగా ఉంటుంది. ఈ రకంగా హృదయంలో కృప, యుద్ధంలో నిష్ఠురత కలిగిఉండటం ఆ పరమేశ్వరి యొక్క లక్షణం. ఇది ఇంకెవరికీ సాధ్యం కాదు.

**త్రైలోక్య మేత దఖిలం రిపునాశనేన -**
**త్రాతం త్వయా సమరమూర్ధని తేఽపి హత్వా ।**
**నీతా దివం రిపుగణా భయమప్యపాస్త -**
**మస్మాక మున్మదసురారిభవం నమస్తే ॥**

అమ్మా! రాక్షససంహారం చేసి ముల్లోకాలను రక్షించావు. రణరంగంలో సంహరించబడిన శత్రుమూకలకు కూడా స్వర్గాన్ని అనుగ్రహించావు. ఓ తల్లీ! మదోన్మత్తులైన సురవైరులవలన మా భయాన్ని పోగొట్టావు. నీకు అనేక నమస్కారాలు.

**శూలేన పాహి నో దేవి - పాహి ఖడ్గేన చాంబికే ।**
**ఘంటాస్వనేన నః పాహి - చాపజ్యానిస్వనేనచ ॥**

ఓ దేవీ ! నీ శూలముతో మమ్మల్ని రక్షించు. అంబికా! నీ ఖడ్గంతో మమ్మల్ని కాపాడు. దేవీ! నీ ఘంటానాదంతో మమ్ములను కాపాడు. నీ వింటి ఠంకారధ్వనితో మమ్ములను రక్షించు.

**ప్రాచ్యాం రక్షప్రతీచ్యాం చ - చండికే రక్ష దక్షిణే ।**
**భ్రామణే నాత్మశూలస్య - ఉత్తరస్యాం తథేశ్వరి ॥**

ఓ చండికా! నీ శూలాన్ని తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము నాలుగు వైపులకు గిరగిరా త్రిప్పుతూ మమ్ములను కాపాడవలసినది.

**సౌమ్యాని యాని రూపాణి - త్రైలోక్యే విచరంతి తే ।**
**యాని చాత్యంతఘోరాణి - తై రక్షాస్మాం స్తథా భువమ్ ॥**

ముల్లోకాలలోనూ చరించే నీవు నీ యొక్క సౌమ్యరూపంతోను, అత్యంత ఘోరమైన రూపముతోను మమ్ములను, ఈ భూలోకాన్ని కూడా కాపాడవలసినది.

**ఖడ్గశూలగదాదీని - యాని చాస్త్రాణితేఽమ్బికే ।**
**కరపల్లవసంగీని తై రస్మాన్ రక్ష సర్వతః ॥**

ఓ అంబికా! ఖడ్గము, శూలము, గద ఒకటేమిటి? నీచేతిలో ఉన్న అన్ని రకాలయిన ఆయుధాలతోను అన్ని దిక్కులయందు మమ్ములను రక్షించ వలసినది. అంటూ నాల్గవ అధ్యాయం మొదటినుంచి 27 శ్లోకాలవరకు దేవతలు ఆ పరమేశ్వరిని పరిపరి విధాల ప్రార్థించారు. ఆ తరువాత స్వర్గానికి పూతోట అయిన నందనోద్యానవనంలోని దివ్యపుష్పాలతోను, సుగంధ ద్రవ్యాలతోను, పైపూతలతోను పరమేశ్వరిని అర్చించారు. సుగంధద్రవ్యాలు అంటే - దేవతా పూజలో వాడబడే కుంకుమ, అగరు, కస్తూరి, చందనము మంచి గంధము, కర్పూరము మొదలైన వాటితో ఆ దేవిని అర్చించారు. ధూపదీపనైవేద్యాలు సమర్పించారు. ఆ తరువాత ఆ దేవికి సాష్టాంగ ప్రణామము చేశారు. దేవతల సపర్యలకు సంతసించిన దేవి

**ప్రియతాం త్రిదశాస్సర్వే - యదస్మత్తోఽభి వాంఛితమ్।**

"దేవతలారా! నావల్ల మీకు ఏం కావాలి?" అని అడిగింది. ఆ మాటలు విన్న దేవతలు "అమ్మా! మహిషాసురుని సంహరించి మమ్మల్ని రక్షించావు. తల్లీ అదేవిధంగా మేము కోరినప్పుడు వచ్చి ఆపదనుంచి మమ్ములను రక్షించవలసినది. అంతేకాదు తల్లీ! ఈ శ్లోకాలను పారాయణచేసినవారికి పట్ల ప్రసన్నవు కావలసినది" అన్నారు. అంతట ఆ దేవి ప్రసన్నమై 'తథాస్తు' 'అట్లే అగుగాక' అని చెప్పి అంతర్ధానమైపోయింది. "ఓ రాజా! ఇప్పటివరకు మహిషాసురవధ గురించి చెప్పాను. ఇక ఇప్పుడు శుంభనిశుంభులవధ చెబుతాను వినవలసింది" అంటూ ఉత్తమ చరితాన్ని ప్రారంభిస్తున్నాడు సుమేధుడు.

# ఉత్తమ చరితము

**ఓం ఘంటాశూలహలాని శంఖముసలే - చక్రం ధనుః సాయకమ్**
**హస్తాబ్జై ర్దధతీం ఘనాంతవిలస - చ్ఛీతాంశుతుల్యప్రభామ్ ।**
**గౌరీదేహసముద్భవాం త్రిజగతా - మాధారభూతాం మహా**
**పూర్వా మత్ర సరస్వతీ మనుభజే - శంభాదిదైత్యార్దినీమ్ ॥**

ఉత్తమ చరితాన్ని ప్రారంభించబోయే ముందు సరస్వతీదేవిని ధ్యానిస్తున్నాడు మహర్షి.

సరస్వతీదేవికి ఎనిమిది చేతులున్నాయి. ఆ చేతులయందు

1. ఘంట 2. శూలము 3. నాగలి 4. శంఖము 5. రోకలి 6. చక్రము 7. ధనుస్సు 8. బాణములు.

ధరించినది, మబ్బుయొక్క అంచున ప్రకాశించు చంద్రునితో సమానమైన కాంతి గలది, పార్వతీదేవి శరీరమునుండి ఉద్భవించినది, ముల్లోకములకు ఆధారభూతమైనది, శుంభనిశుంభాదులను వధించినది అయిన మహా సరస్వతిని ధ్యానిస్తున్నాను.

మనకు తెలిసిన సరస్వతి చదువులతల్లి.

**యా కుందేందుతుషార హారధవళా యాశుభ్రవస్త్రాన్వితా**
**యా వీణా వరదండ మండితకరాయా శ్వేత పద్మాసనా ।**
**యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిర్దేవైస్సదా పూజితా**
**సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా ॥**

మల్లెపూవులవలె తెల్లని వస్త్రములు ధరించినది, చేతులయందు పుస్తకము అక్షమాల, వీణధరించి తెల్లని పద్మము నందు ఆసీనురాలై బ్రహ్మాది దేవతలచేత ఆరాధించబడునది అయిన ఆ సరస్వతీదేవి నన్ను రక్షించుగాక అని ప్రార్థిస్తాము.

**శ్వేతపద్మాసనా దేవీ శ్వేత గంధానులేపనా**
**అర్చితా మునిభి సర్వైః ఋషిభిస్తూయతే సదా**
**ఏవంధ్యా త్వా సదా దేవీం వాంఛితం లభతేనరః ॥**

శ్వేతగంధానులేపనము గావించబడి, శ్వేతపద్మము నందు ఆశీనయైన ఆ దేవి మహర్షులచేత అర్చించబడుతూ ఉంటుంది. ఆ దేవిని గనక అర్చించినట్లైతే మానవులకు తీరని కోరికలు ఉండవు. ఆవిడ జ్ఞానప్రదాయిని.

**నిత్యానందే నిరాధారే నిష్కళాయై నమో నమః**
**విద్యాధరే విశాలాక్షీ శుద్ధజ్ఞానే నమో నమః ॥**

చిన్నపిల్లలు చదువు ప్రారంభించేటప్పుడు ముందుగా సరస్వతీ ప్రార్థన చేస్తారు.

**సరస్వతీ సమస్తుభ్యం వరదే కామరూపిణీ**
**విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మేసదా॥**

ఈ రకంగా చదువుల తల్లిగా జ్ఞాన ప్రదాయినిగా మనకు తెలిసిన ఆ సరస్వతీదేవి శుంభనిశుంభాది రాక్షస సంహారం కూడా చేసింది. అందుకే ముందుగా మహాసరస్వతీ ధ్యానం చేసి, ఆ తరువాత ఉత్తమచరితం ప్రారంభిస్తున్నాడు మహర్షి. ఉత్తమ చరితములో 5వ అధ్యాయం దగ్గరనుండి 13వ అధ్యాయం దాకా ఉంటాయి. ఇందులో మొత్తం 441 శ్లోకాలుంటాయి. ముందుగా 5వ అధ్యాయం చూద్దాం.



# దేవీ దూత సంవాదము

## 5వ అధ్యాయము

కశ్యప ప్రజాపతి, దక్షప్రజాపతి యొక్క కుమార్తెలను వివాహం చేసుకున్నాడు అని గతంలో చెప్పుకున్నాం. వారిలో దనువు ఒకర్తె కశ్యపుడికి దనువు యందు పుట్టినవారు దానవులు.

కశ్యపుడికీ, దనువుకూ శుంభనిశుంభులు అనేవారు జన్మించారు. వస్తుతః వీరు బలాఢ్యులు. శివుని గురించి తపస్సు చేసి పురుషుని వల్ల మరణం లేకుండా వరం పొందారు. ఆ వరబలంతో చెదరిపోయిన రాక్షస మూహాలన్నింటినీ చేరదీసి ముల్లోకాలను జయించారు. ఇంద్రాది దిక్పాలకులను ఓడించాగు. స్వర్గాన్ని కూడా వశం చేసుకున్నారు. వీరిలో పెద్దవాడయిన శుంభుడు రాజుకాగా నిశుంభుడు యువరాజైనాడు.

ముల్లోకాలను జయించిన తరువాత మునులను, ఋషులను, దేవతలను నానారకాలుగా హింసించటం మొదలుపెట్టారు. యజ్ఞాలలో దేవతల కర్పించే హవిర్భాగము వారికి అందకుండా చేశారు. వీరి బాధలుపడలేక దేవతలందరూ హిమాలయాలకు పోయి అక్కడ మాయాస్వరూపిణి అయిన దేవిని ప్రార్థించటం మొదలు పెట్టారు. సప్తశతిలో చదవవలసిన స్తోత్రాలలో ఇది ఒకటి. ఈ స్తోత్రం మహాద్భుతమైనది. అనన్యసామాన్యమైనది. దీన్ని చదవటం వల్ల అమోఘమైన ఫలితం వస్తుంది.

**నమో దేవ్యై మహాదేవ్యై - శివాయై సతతం నమః**

**నమః ప్రకృత్యై భద్రాయై - నియతాః ప్రణతాః స్మ తామ్ ॥**

**రౌద్రాయై నమో నిత్యాయై - గౌర్యై ధాత్ర్యై నమో నమః**

**జ్యోత్స్నాయై చేందురూపిణ్యై - సుఖాయై సతతం నమః ॥**

**కల్యాణ్యై ప్రణతాం వృద్ధ్యై సిద్ధ్యై కూర్మ్యై నమో నమః**

**నైర్ఋత్యై భూభృతాం లక్ష్మ్యై శర్వాణ్యై తే నమో నమః ॥**

దుర్గాయై దుర్గపారాయై సారాయై సర్వకారిణ్యై

ఖ్యాత్యై తథైవ కృష్ణాయై ధూమ్రాయై సతతం నమః ॥

అతిసౌమ్యాతిరౌద్రాయై నతా స్తస్యై నమో నమః

నమో జగత్ప్రతిష్ఠాయై దేవ్యై కృత్యై నమో నమః ॥

ఓ దేవీ! మహాదేవీ! నిత్య శుభంకరివైన నీకు నమస్కారము. సమస్త జగత్తులకు మూల ప్రకృతివి, రక్షాశక్తివి అయిన నీకు మేము సమస్కరిస్తున్నాము. నీవు శాశ్వతమైన దానవు. దుర్మార్గులపాలిట భయంకరమైన దానవు. నీవే గౌరీ దేవివి. జగత్తులను పోషించేదానవు. వెన్నెల రూపంలో చల్లదనాన్ని ఇచ్చేదానవు. భక్తులకు సర్వసుఖాలను ఇచ్చేదానవు. నీవు శుభస్వరూపిణివి. విజయరూపిణివి. భాగ్యదేవత, అభాగ్యదేవతకూడా నువ్వే నమ్మా. అటువంటి నీకు నమస్కారము.

కష్టాలను గట్టెక్కించే ఓ దేవీ! సర్వకార్యాలను ఒనగూర్చే ఓ తల్లీ ! జ్ఞానస్వరూపిణీ ! కృష్ణవర్ణము (నలుపురంగు) ధూమవర్ణము (పొగరంగు) గల ఓ దుర్గాదేవీ నీకు నమస్కారము.

అమ్మా! నీవు అతి సాధు స్వరూపిణివి. అతి రౌద్రరూపిణికూడా నీవే ఈ జగత్తును భరించేదానవు. అటువంటి నీకు మా నమస్కారము. సంకల్పశక్తి రూపిణి అయిన ఓ దేవీ నీకు నమస్కారము.

యా దేవీ సర్వభూతేషు విష్ణుమాయేతి శబ్దితా।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥

యా దేవీ సర్వభూతేషు చేతనే త్యభిధీయతే ।

నమస్తస్యై నమస్తస్యై నమ సమస్తస్యై నమో నమః ॥

యా దేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥

యా దేవీ సర్వభూతేషు నిద్రారూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు క్షుధారూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు ఛాయారూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యాదేవీ సర్వభూతేషు తృష్ణారూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు క్షాంతిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు జాతిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు లజ్జారూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు శాంతిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు శ్రద్ధారూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు కాంతిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు లక్ష్మీరూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు వృత్తిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు స్మృతిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు దయారూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు తుష్టిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

యా దేవీ సర్వభూతేషు భ్రాంతిరూపేణ సంస్థితా ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

ఇంద్రియాణా మధిష్ఠాత్రీ భూతానా మఖిలేషు యా ।

భూతేషు సతతం తస్యై వ్యాప్త్యై దేవ్యై నమో నమః ।

చితిరూపేణ యాకృత్స్న మేత ద్వ్యాప్య స్థితా జగత్ ।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ।

స్తుతా సురైః పూర్వ మభీష్ట సంశ్రయా ।

తథా సురేంద్రేణ దినేషు సేవితా ।

కరోతు సా నః శుభహేతు రీశ్వరీ ।

శుభాని భద్రా; ణ్యభిహంతు చాపదః ॥

యా సాంప్రతం చోద్ధతదైత్యతాపితై ।

రస్మాభి రీశా చ సురై ర్నమస్యతే ।

యా చ స్మృతా తత్క్షణమేవ హంతి నః

సర్వాపదో భక్తివినమ్రమూర్తిభిః ॥

సర్వ భూతములందు విష్ణుమాయ అనే పేరుతో ఉండే ఓ దేవీ! నీకు నమస్కారము. అన్ని ప్రాణుల యందు చేతనా రూపమైన ఓ దేవీ, అన్ని భూతముల యందు బుద్ధి రూపంలో ఉండే ఓ దేవీ, అన్ని జీవులయందు నిద్రారూపంలో ఉండే ఓ దేవీ, అన్ని జీవులయందు ఆకలిరూపంలో ఉండే ఓ దేవీ, అన్ని ప్రాణులయందు ఛాయ అంటే ప్రతిబింబము రూపంలో ఉండే ఓ దేవీ, అన్ని ప్రాణుల యందు శక్తిరూపంలో ఉండే ఓ దేవీ, అన్ని భూతము లందు తృష్ణ కోరిక రూపంలో ఉండే ఓ దేవి, అన్ని జీవులయందు క్షాంతి ఓర్పు రూపంలో ఉండే ఓ దేవీ, అన్ని ప్రాణుల యందు జాతి రూపంలో ఉండే ఓ దేవీ, అన్ని భూతము లందు లజ్జ వినమ్రత రూపంలో ఉండే ఓ దేవీ, అన్ని జీవులయందు శాంతిరూపంలో ఉండే ఓ దేవీ, అన్ని ప్రాణులయందు శ్రద్ధరూపంలో ఉండే ఓ దేవీ, అన్ని జీవులయందు కాంతి రూపంలో ఉండే ఓ దేవీ, అన్ని ప్రాణులయందు లక్ష్మీరూపంలో ఉండే ఓ దేవీ. అన్నిభూతములయందు వృత్తిరూపంలో ఉండే ఓ దేవీ, అన్ని భూతముల యందు స్మృతి జ్ఞప్తిరూపంలో ఉండే ఓ దేవీ, అన్ని ప్రాణులయందు దయారూపంలో ఉండే ఓ దేవీ, అన్ని జీవులయందు తుష్టి తృప్తి రూపంలో ఉండే ఓ దేవీ, అన్ని భూతములందు తల్లి రూపంలో ఉండే ఓ దేవీ, అన్ని జీవులయందు భ్రాంతి రూపంలో ఉండే ఓ దేవీ, నీకు పదేపదే నమస్కారము.

అన్ని భూతముల ఇంద్రియాలను లోబరచుకొని, అన్ని భూతముల మీద అధికారం గల ఓ దేవీ! నీకు నమస్కారము. జ్ఞానరూపంలో జగత్తంతా వ్యాపించిన ఓ దేవీ! నీకు నమస్కారము.

పూర్వకాలంలో దేవతలచే తమ కోరికలు తీరటం కోసం సేవించబడినది. ఇంద్రునిచే ప్రతి నిత్యము పూజించబడేది, సర్వశుభాలకు మూలమైనది అయిన ఓ దేవీ! మా ఆపదలను అంతమొందించవలసినది. ఇప్పుడు రాక్షసులు మమ్మల్ని అనేక రకాలుగా బాధలుపెడుతున్నారు. మా ప్రార్థనలు మన్నించి, ఆ బాధలనుంచి తక్షణమే మమ్మల్ని విముక్తి చెయ్యవలసినది" అని వేడుకున్నారు.

ఈ రకంగా దేవతలు ఆ పరమేశ్వరిని ప్రార్థిస్తుండగా పర్వతరాజ

కుమార్తె పార్వతి గంగానదిలో స్నానం చెయ్యటాని అక్కడికి వచ్చి, దేవగణా లను చూసి "మీరెవరు?" అని అడిగింది. ఆ సమయంలో పార్వతి దేహము నుంచి ఒక దేవత ఉద్భవించి "వీరంతా శుంభుడు అనే రాక్షసుని చేతిలో ఓడిపోయి, నిశుంభునిచే అవమానింపబడిన దేవగణాలు. వీరందరూ నిన్ను గురించే ప్రార్థిస్తున్నారు" అని సమాధానం చెప్పింది. ఈ రకంగా పార్వతి శరీరము నుంచి బయటకు వచ్చిన దేవతయే 'కౌశికి'.

పార్వతీ దేహమునుంచి కౌశికి బయటకు రాగానే, పార్వతి నల్లని రంగుతో కాళి అనే పేరుతో హిమాలయాలలో ఉండిపోయింది.

మహాసుందరమైన రూపంగల కౌశికి హిమాలయాలలో తిరుగాడు తుండగా చండముండులు ఆమెను చూశారు. వీరిద్దరూ శుల భనిశుంభుల అనుచరులు కౌశికిని చూడగానే తమ ఏలిక వద్దకు పోయి "రాజా! అత్యంతమనోహరమైన రూపంగల స్త్రీ ఒకతె హిమాలయ పర్వత ప్రాంతా లలో ఉన్నదయ్యా ! అంత అందమైన స్త్రీని ఇంతవరకు మేము చూడలేదు. ఆమె యొక్క తేజస్సుతో దిక్కులు ప్రకాశిస్తున్నాయి. దానవేశ్వరా! ముల్లోకా ల్లోనూ విలువైన మణులు,రత్నాలు, ఇతర వస్తువులు అన్నీ నీ దగ్గర ఉన్నాయి. ఇంద్రుని ఐరావతము, పారిజాతము నీ దగ్గర ఉన్నాయి. బ్రహ్మ యొక్క హంసల విమానము నీ వాకిట్లో ఉన్నది. కుబేరుని యొక్క మహాపద్మము అనే నిధి నీ దగ్గరే ఉన్నది. వరుణుని ఛత్రము నీ దగ్గరే ఉంది. ప్రజాపతి రథము నీ దగ్గర ఉన్నది. యముని శక్తిపాశము నీ దగ్గరే ఉన్నది. సముద్రంలో పుట్టిన నవరత్నాలు నీ దగ్గరే ఉన్నాయి. రాక్షసరాజా ! ఈ రకంగా ఉత్తమమైన వస్తువులన్నీ నీ దగ్గరే ఉన్నాయి కదా ! మరి ఈ స్త్రీ రత్నాన్ని ఎందుకు తెచ్చుకో లేదయ్యా !" అన్నారు. చండముండులు చెప్పిన మాటలు విన్న శుంభుడు సుగ్రీవుడు అనే రాక్షసవీరుణ్ణి కౌశికి దగ్గరకు దూతగా పంపాడు.

సుగ్రీవుడు కౌశికి దగ్గరకు వెళ్ళి "ఓ దేవీ! శుంభుడు రాక్షసరాజు. ముల్లోకాలకు సార్వభౌముడు. ఆయన దూతగా నేను ఇక్కడికి వచ్చాను. దేవతలందరూ అతని ఆజ్ఞను శిరసావహిస్తారు. అతని సందేశం నీకు వినిపిస్తున్నాను. వినవలసింది" అంటూ శంభుని సందేశాన్ని వినిపించటం ప్రారంభించాడు. "ఓ దేవీ! ముల్లోకాలకు ఏలికను నేను. దేవతలంతా నా

దాసానుదాసులు. వారి యజ్ఞభాగాలన్నీ నేనే అనుభవిస్తున్నాను. మూడు లోకాలలోనూ గల శ్రేష్టమైన రత్నాలన్నీ నా అధీనంలోనే ఉన్నాయి. ఐరావతము, ఉచ్ఛైశ్రవము నా దగ్గరే ఉన్నాయి. దేవతలు, యక్షులు, గంధర్వులు, నాగులు మొదలైన వారంతా వారివద్దనున్న అమూల్యమైన సంపద అంతా నాకు సమర్పించేశారు.

దేవీ! ప్రపంచంలో ఉన్న స్త్రీలందరిలోకీ నిన్ను ఉత్తమమైనదిగా భావిస్తున్నాను. అటువంటి నువ్వు నా దగ్గర ఉండటం భావ్యం కదా! నన్ను గనక వివాహం చేసుకుంటే అసమానమైన సంపద నీకు దక్కుతుంది. బాగా ఆలోచించుకుని నన్ను వివాహం చేసుకోవలసింది."

సుగ్రీవుడు చెప్పిన మాటలు విని "సుగ్రీవా ! నువ్వు చెప్పిందంతా నిజమే. శుంభుడు ముల్లోకాధిపతి. అందులో సందేహంలేదు. కాని గతంలో నేను చిన్న ప్రతిజ్ఞ ఒకటి చేశాను ఎవరైతే యుద్ధంలో నన్ను ఓడించ గలుగుతాడో, అతణ్ణే వివాహం చేసుకుంటాను అని చెప్పాను. ఆ మాటను తప్పలేనుకదా ! అందుచేత శుంభుడైనా, సరే, అతని తమ్ముడు నిశుంభుడైనా సరే లేదా ఏ రాక్షసుడైనా సరే, యుద్ధంలో నన్ను ఓడించి వివాహం చేసుకోవలసినది" అన్నది.

ఆ మాటలు విన్న సుగ్రీవుడు "దేవీ ! నువు బాగా గర్వంతో మాట్లాడు తున్నావు. ముల్లోకాల్లోనూ శుంభనిశుంభులెదుట నిలవగల వాడెవడూ లేదు. ఇది ముమ్మాటికీ నిజం. అంతెందుకు ! దేవతలే శుంభునితో యుద్ధం చెయ్యాలేక పారిపోయారు కదా! మరి నువ్వెంత? పైగా ఆడుదానివి. అందులోనూ ఒంటరిదానివి. ఇంద్రాది దేవతలు ఎదిరించలేని శంభుణ్ణి నువ్వెలా ఎదిరించ గలవు? మా మాట విని శుంభనిశుంభుల దగ్గరకు రాకపోతే నీ జుట్టు పట్టుకుని ఈడ్చుకు వెళ్ళవలసివస్తుంది" అని పరమేశ్వరిని హెచ్చరించాడు.

సుగ్రీవుని మాటలు విన్న దేవి మళ్ళీ అంటోంది. "సుగ్రీవా! నీ మాటలు నిజమే, శుంభుడు బలవంతుడు. నిశుంభుడు మహాబలశాలి. అయినా గతంలో నేను చేసిన శపథం కాదనలేను కదా! నువ్వు జాగ్రత్తగా తిరిగి వెళ్ళి నేచెప్పినదంతా మీ రాజుకు వివరించు. ఏది మంచిదో? ఏది కాదో? అతడే నిర్ణయించుకుంటాడు" అన్నది. అంటూ ఐదవ అధ్యాయాన్ని పూర్తిచేశారు.

# ధూమ్రలోచన వధ

## 6వ అధ్యాయం

ఇందులో మొత్త 24 శ్లోకాలు ఉన్నాయి. ఋషి చెబుతున్నాడు : ఓ రాజా!

**ఇ త్యాకర్ణ్య వచో దేవ్యాః - సదూతోఽ_మర్షపూరిత**
**సమాచష్టసమాగమ్య - దైత్యరాజాయ విస్తరాత్ ॥**

ఆ దేవి చెప్పిన మాటలన్నీ విన్నాడు శుంభుడు పంపిన 'సుగ్రీవుడు' అనే దూత. కోపంతో మండిపడ్డాడు. కాని ఏంచేస్తాడు? తాను ఒక దూత. దూతకు తెచ్చిన వర్తమానం వినిపించటం తప్పించి, స్వతంత్రంగా వ్యవ హరించే వీలుండదు. అందుచేత రాక్షస రాజైన శుంభుడి దగ్గరకు తిరిగివచ్చి జరిగిన విషయం అంతా వివరించాడు.

ఆ మాటలు విన్నాడు రాక్షసాధీసుడు. అమితమైన కోపం వచ్చింది అతడికి. ప్రక్కకు తిరిగి చూశాడు. ధూమ్రలోచనుడు కనిపించాడు. అతడితో అంటున్నాడు.

**హేధూమ్రలోచ నాశు త్వం - స్వసైన్యపరివారితః**
**తా మానయ బలా ద్దుష్టాం - కేశాకర్షణవిహ్వలామ్॥**

"ధూమ్రలోచనా! నీవు ససైన్యంగా వెళ్ళి అమె భయపడి శరీరం స్వాధీనం కోల్పోయేటట్లుచేసి, జుట్టు పట్టుకుని ఇక్కడకి ఈడ్చుకునిరా! ఒకవేళ ఆమెను రక్షించటానికి ఎవరైనావస్తే, ఆ వచ్చిన వాడు యక్ష, గరుడ. కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్యగణాలుగాని, దేవతాగణాలే గాని వారందరినీ సంహరించి, ఆమెను ఈడ్చుకురా" అన్నాడు.

రాక్షసరాజు ఆజ్ఞ అవగానే ధూమ్రలోచనుడు 60 వేలమంది రాక్షస వీరులను వెంటబెట్టుకుని హిమాలయ పర్వత ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ ప్రశాంతమైన వాతావరణంలో ప్రశాంతచిత్తంలో మంచుకొండమీద కూర్చుని ఉన్నది ఆ దేవి. ఆమెను చూడటంతోనే ధూమ్రలోచనుడు వీరావేశంతో "నువ్వు వెంటనే బయలుదేరి మా రాక్షసరాజు దగ్గరకు రా! మంచిగా రాకపోతే స్పృహకోల్పోయే దాకా చితకబాది, ఆ తరువాత జుట్టు పట్టుకుని లాక్కుపోతాను" అన్నాడు.

ఆ రాక్షసుడి మాటలు విన్న దేవి చాలా సౌమ్యంగా “నిన్ను రాక్షసరాజు పంపాడు. సైన్యసమేతంగా వచ్చావు. పైగా మహాబల సంపన్నుడవు. అటు వంటి నువ్వు నన్ను బలాత్కారంగా తీసుకుపోతే నేను ఏమి చెయ్య గలుగుతాను” అన్నది. ఆ మాటలు విన్న రాక్షసుడు దేవి భయపడు తున్నది అని భావించి ఆమె జుట్టుపట్టుకోటానికి ముందుకు పరుగెత్తాడు. చూసింది దేవి. రాక్షసుడు మీదికి వచ్చేస్తున్నాడు. ఇక ఉపేక్షించి లాభం లేదు అనుకొని ఒక్కసారిగా ‘హుం’ కరించింది. ఆ హుంకారానికి ధూమ్రలోచనుడు కాస్తా భస్మమైపోయాడు. తమ నాయకుడు మరణించగానే రాక్షససైన్యము కోపంతో తమతమ ఆయుధాలను ఆ దేవిపై ప్రయోగించటం ప్రారంభించాయి. కొందరు బాణప్రయోగం చేశారు. కొందరు బల్లేలను విసిరారు. కొందరు గండ్రగొడ్డళ్ళతో ముందుకు దూకారు.

పరమేశ్వరి వాహనమైన సింహం ఒక్కసారి జూలు విదిల్చి, భయంకరంగా గర్జిస్తూ అసురసైన్యము మీద పడింది. కొందరిని ముందరికాలి పంజాతో కొట్టింది. కొందరిని తన నోటితో చీల్చివేసింది. మరికొందరిని వెనక కాళ్ళతో తొక్కిచంపింది. తన గోళ్ళతో కొందరి కడుపులు చీల్చి పారేసింది. సింహం యొక్క పంజాదెబ్బకు రాక్షసవీరుల తలలు నేల మీద బంతులలాగా దొర్లసాగినాయి. తలలు తెగి కొందరు, చేతులు తెగి కొందరు, కాళ్ళుపోయి కొందరు భయంకరమైన చావు చచ్చారు. వారి శరీరాలనుంచి రుధిరపానం చేసింది సింహం. ఈ రకంగా ఒక్క క్షణంలో ధూమ్రలోచనుడు, అతని సేనాసమూహము అంతా నాశనమయిపోయింది. చావగా మిగిలిన వాళ్ళు రాక్షస రాజుకు ఈ వార్త తెలియచేశారు.

ధూమ్రలోచనుడు ససైన్యంగా మరణించాడనే వార్త విన్నాడు శుంభుడు. అతడి రోషం రెట్టింపయింది. అతడు తన ప్రక్కన ఉన్న చండ ముండులను చూసి

**హే చండ! హే ముండ! బలై - ర్బహుభిః పరివారితః**

“ఓ చండాసురా! ముండాసురా! మీరిద్దరూ అనేకమైన సేనా సమూహాన్ని తీసుకువెళ్ళి ఆమెను బంధించి, జుట్టుపట్టుకుని ఈడ్చుకురండి. ఒకవేళ ఆమెను బంధించటం మీకు చేతకాక పోతే రాక్షసవీరులు తమ ఆయుధాలతో ఆమెను గాయపరుస్తారు. ఆ రకంగా ఆమె వాహనమైన సింహము మరణించగా, ఆమె గాయపడి ఉన్నప్పుడు ఆమెను బంధించి తీసుకురండి”అన్నాడు.

# 7వ అధ్యాయము

ఈ అధ్యాయంలో 27 శ్లోకాలున్నాయి. ఇందులో చండముండాసుర వధ వివరించబడుతోంది.

**ఆజ్ఞప్తాస్తే తతోదైత్యా - శ్చండముండపురోగమాః।**
**చతురంగబలోపేతా - యయు రభ్యుద్యతాయుధాః ॥**

తమ ఏలిక అయిన శుంభుని ఆజ్ఞను విన్నంటువంటి వారై చండముండులు చతురంగబలాలను వెంటపెట్టుకుని ఆయుధాలను ఎత్తిపట్టి జయజయధ్వానాలు చేస్తూ దేవి ఉన్న ప్రదేశానికి బయలుదేరారు.

హిమాలయ పర్వతాలలో ఒక బంగారు శిఖరం మీద సింహ వాహనయై ఉన్నది ఆ దేవి. ఆమెను చూశారు రాక్షసులు. వెంటనే ఆమెను పట్టి బంధించాలనే కోరికతో ముందుకు దూకారు కొందరు. మరికొందరు ధనుర్బాణాలు ధరించీ ఇంకొందరు కత్తి, డాలు ధరించీ ఆ దేవి మీదకు పోయారు.

తన మీదకు వస్తున్న రాక్షస సైన్యాన్ని చూసింది చండిక. ప్రచండమైన రోషముతో ఆమె ముఖం నల్లబడిపోయింది. కనుబొమలు ముడివడినాయి. అప్పుడు ఆ దేవి యొక్క నొసటి నుంచి నల్లని శరీరచ్ఛాయతో, భయంకరమైన ముఖంతో, ఖడ్గము, పాశము మొదలైన ఆయుధములు ధరించిన కాళికాశక్తి బయటకు వచ్చింది. కాళి పులిచర్మాన్ని ధరించింది. పుర్రెలతో చేయబడిన బెత్తము చేతనున్నది. పుర్రెలమాల ఆభరణంగా ధరించింది. కండలు కరిగిపోయి ఉన్నాయి. తెరిచిపెట్టిన పెద్దనోరు, భయంకరంగా వ్రేలాడే నాలుక, లోతైన ఎర్రటి కనులు కలిగి చూడటానికి అతి భయం కరముగా ఉన్నది. దిక్కులు పిక్కటిల్లేటట్లు గర్జిస్తూ శత్రుసైన్యము మీద పడి రాక్షసవీరులను చంపి పారేస్తోంది.

ఏనుగులు, వాటిమీద మావటివాళ్ళు, యోధులు అందరినీ పట్టుకుని తన నోట్లోకి విసిరిపారేస్తోంది. గుర్రాలు, రథాలు పట్టుకుని నోటితో కరకరా నమలుతుంటే రాక్షససైన్యం సర్వనాశనమై పోతోంది.

ఇంతే కాదు రాక్షసులను జుట్టుపుచ్చుకొని కొట్టి చంపుతోంది. కొందరికి మెడ ఎముక విరిచి చంపుతున్నది. మరి కొందరిని కొట్టి చంపుతున్నది.

కొందరిని కత్తులతో నరుకుచున్నది. కొందరిని ఖట్వాంగముతో కొట్టి చంపుతున్నది. ఖట్వాంగము అంటే - మంచంకోడు. మానవుడి పుర్రె గుచ్చబడిన ఒక కఱ్ఱ పుఱ్ఱెలబెత్తము. లలితాసహస్రంలో 479వ నామము 'ఖట్వాంగాది ప్రహరణా' విశుద్ధిచక్రంలో ఉన్న 'వజ్రేశ్వరి' అనే దేవత పాటల వర్ణముతో, మూడుకనులు, ఒక శిరస్సుగలిగి, నాలుగు చేతులయందు ఖట్వాంగము, ఖడ్గము, త్రిశూలము, చర్మములను ధరించి ఉంటుంది. ఇక్కడ కాళి కొందరిని ఖట్వాంగముతో కొట్టి చంపుతోంది. మరికొందరిని పంటిమొనలతో అంటే ముందరిపళ్ళతో కొరికి చంపేస్తోంది. ఈ రకంగా రాక్షసబలం కాళిచేతిలో నాశనమై పోతుండటం చూశాడు చండాసురుడు. ఇక లాభం లేదు అనుకుని భయంకరమైన ఆ కాళి మీదకు ఒక్క దూకుదూకాడు. ధనుర్బాణాలు చేత ధరించి కన్నుమూసి తెరిచేలోపు బాణాలను వర్షంలా కురిపించాడు. లెక్కలేనన్ని చక్రాలను ఆమెపై ప్రయోగించాడు.

కాళి తన నోటిని బాగా తెరిచి వేసింది. సూర్యబింబము మేఘాల మధ్యన అదృశ్యమై పోయినట్లుగా, ఆ చక్రాయుధాలన్నీ కాళి నోటిలోకి వెళ్ళి పోయినాయి. ఆ సమయంలో తన నోటిలోని పలువరుస తెల్లగా మెరుస్తుం డగా దిక్కులు పిక్కటిల్లేటట్లుగా వికటాట్టహాసంచేసి సింహాన్ని అధిరోహించి చండాసురుని మీదకు దూకి, అతని జుట్టు తన ఎడమచేత్తో బిగించి పట్టుకుని, కుడిచేతిలోని కత్తితో ఆ రాక్షసుని శిరస్సు తెగ నరికింది.

చండాసురుడు మరణించటం చూశాడు ముండాసురుడు. కత్తిడాలు చేతబట్టి ఆమె పైకి దూకాడు. అలా దూకిన ముండాసురుని ఒడుపుగా పట్టుకుని అతని శిరస్సు కూడా ఖండించి వేసింది.

ఈ విధంగా అత్యంత శౌర్య పరాక్రమాలు గలిగిన చండముండులు సంహరించబడటం చూసి, చావగా మిగిలిన వారందరూ తలోదిక్కుకూ పారిపోయారు.

కాళి చండముండుల శిరస్సులను తన చేతులతో పట్టుకుని చండిక దగ్గరకు పోయి వికటాట్టహాసం చేస్తూ "ఓ దేవీ ! ఈ యుద్ధంలో మహా బలవంతులైన చండముండులను నేను సంహరించాను. ఇక శుంభ నిశుంభులను స్వయంగా నువ్వే చంపుతావు" అన్నది.

చండముండుల శిరస్సులను చూసిన ఆ దేవి ఆనందంతో

**యస్మా చ్చండం చ ముండం చ - గృహీత్వా త్వ ముపాగతా ।**
**చాముండేతి తతో లోకే - ఖ్యాతా దేవీ భవిష్యసి - ఓమ్ ॥**

"కాళీ, చండముండులను సంహరించావు. కాబట్టి ఇక మీదట నువ్వు 'చాముండా' అని పిలువబడతావు" అన్నది. అప్పటినుంచీ కాళి చాముండా అనే పేరుతో ప్రఖ్యాతి చెందింది.

అంటూ 7వ అధ్యాయం పూర్తి చేశాడు మహర్షి.



# రక్తబీజ వధ

## 8వ అధ్యాయం

సుమేధుడు అనే ఋషి చెబుతూ ఉన్నాడు.

**చండే చ నిహతేదైత్యే - ముండే చ వినిపాతితే ।**
**బహుళేషు చ సైన్యేషు - క్షయితే ష్వసురేశ్వరః ॥**

యుద్ధంలో ఆ పరమేశ్వరి చేతిలో చండముండాసురు లిద్దరూ సంహరించబడ్డారు. సైన్యం కూడా చాలా వరకు నాశనమై పోయింది. ఈ విషయం తెలిసిన రాక్షస రాజు శుంభుడు కలత చెందిన మనస్సుతో రాక్షస సేనలన్నింటినీ యుద్ధానికి సిద్ధంకావలసిందిగా ఆజ్ఞాపించాడు.

రాక్షసులు అందరూ కూడా ఒకటిగానే అనిపిస్తారు మనకి. కానీ వాళ్ళలో అనేక జాతులు, అనేక శాఖలు ఉన్నాయి. శుంభుడు ఆజ్ఞాపించగానే గొప్పశౌర్యపరాక్రమాలు గల ఈ రాక్షస వీరులంతా యుద్ధానికి సన్నద్ధమైనారు.

'కంబులు' అనే జాతి రాక్షసులు - 84 మంది

వీర్యాసురులు - కోటిమంది

ధౌమ్ర వంశస్థులు - వందమంది.

అలాగే కాల, దౌర్హ, మౌర్య వంశస్థులు మహాబలపరాక్రమాలు గలిగినవారు, వారివారి సేనా సమూహాన్ని వెంటపెట్టుకుని ఆ పరమేశ్వరితో యుద్ధానికి బయలుదేరారు. అతి భయంకరమైనవాడు, చండశాసనుడు అయిన మహారాజు శుంభుడు కూడా కొన్ని వేల సైన్యాన్ని వెంటపెట్టుకుని యుద్ధానికి బయలుదేరాడు.

**ఆయాంతం చండికా దృష్ట్వా - తత్సైన్య మతిభీషణమ్**

ఈ రకంగా బయలుదేరి వస్తున్నటువంటి భయంకరమైన ఆ సైన్యాన్ని చూసినటువంటి ఆ పరమేశ్వరి. తన ధనుస్సును చేతిలోకి తీసుకుని అల్లెత్రాటితో ఒక్కసారిగా శబ్దంచేసింది. వింటినారి నుంచి వచ్చిన 'టం' కారధ్వనితో భూనభోంతరాళాలు దద్దరిల్లి పోయాయి. దేవి వాహనమైనటువంటి సింహము ఒక్కసారిగా గర్జించింది. ఆ దేవి తన చేతిలోని

ఘంటను మ్రోగించింది. కాళి తన నోరు పెద్దగా తెరిచి హుంకరించింది. ఆ శబ్దానికి దశదిశలు నిండిపోయినాయి. సింహనాదము, ఘంటానాదము, ధనుష్టంకారము ఇవన్నీ కూడా ఆ హుంకారంలో కలిసిపోయినాయి.

కాళి చేసిన హుంకారాన్ని విన్నారు రాక్షసులు. గొప్ప బలపరాక్రమాలు గల తమ ముందే ఆ శబ్దం చేసినందుకు కోపగించి ఆ దేవిని, సింహాన్ని, కాళిని నాలుగువైపుల నుంచీ చుట్టు ముట్టారు. దేవదానవ సంగ్రామం భీకరంగా ప్రారంభం కాబోతోంది. ఇది కేవలం దేవతలకు రాక్షసులకు మధ్యన జరిగే యుద్ధం మాత్రమే కాదు. ధర్మానికి - అధర్మానికి మధ్యన జరిగే యుద్ధం. మంచికీ చెడుకీ మధ్యన జరిగే యుద్ధం. ఇలా జరుగుతున్నప్పుడు లోకంలో బలపరాక్రమాలు గలిగిన ధర్మపరులు, అధర్మపరులు తమ తమ వారికి సాయం చెయ్యటానికి వస్తారు. రాక్షసగణాలన్నీ రాక్షసులకు సహాయం చేస్తాయి. అలాగే దేవతా గణాలు, ఋషిగణాలు అందరూ దేవతలకు సాయం చెయ్యటానికి వస్తారు. అలాగే రకరకాల వంశాలవారు, జాతులవారు రాక్షసులకు అండగా నిలిచారు. ఇక దేవతల పక్షాన బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, కుమారస్వామి, ఇంద్రుడు, మొదలైన దేవతల శక్తులు.

**యస్య దేవస్య య ద్రూపం యథా భూషణ వాహనం**

ఆ దేవతల రూపాలతో, ఆ దేవతల ఆభరణాలు ధరించి, ఆ దేవతల వాహనాలే ఎక్కి రాక్షసులతో యుద్ధానికి వచ్చాయి. ముందుగా

**హంసయుక్తవిమానాగ్రే - సాక్షసూత్రకమండలుః ।**
**ఆయాతా బ్రహ్మణః శక్తి - ర్బ్రహ్మాణీ సాఽభిధీయతే ॥**

హంసలు పూన్చిన విమాన మెక్కి చేతితో అక్షమాల, కమండలము ధరించి బ్రహ్మయొక్క శక్తివచ్చింది. ఈమె పేరు 'బ్రహ్మాణి'. ఈమె బ్రహ్మ యొక్క శక్తి.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. ప్రళయకాలంలో ఈ జగత్తంతా అతనిలోనే లయం అయిపోయింది. తనలో లీనమైన పోయినటు వంటి జీవరాసికి పునర్జన్మ నిచ్చి వారికి మోక్షం కలిగించాలనే ఉద్దేశంతో సృష్టి చెయ్యాలని సంగల్పించాడు. అలా సంకల్పించిన పరమేశ్వరుడు ముందుగా తననుంచి కొంత శక్తిని బయటకు పంపాడు. అదే శక్తి. నిరాకారుడైన

పరమేశ్వరుడు గనక ఒక ఆకారం పొందినట్లైతే అదే శక్తి. ఈ శక్తి త్రికోణ రూపిణి. చరాచర జగత్తంతా దీనినుంచే ఆవిర్భవించింది.

లోకాలను సృష్టించటానికి ముందుగా ప్రజాపతిని సృష్టించింది. అతడే బ్రహ్మ. కర్మ బ్రహ్మ అనబడతాడు. లోకాలను రక్షించటానికి విష్ణువును సృష్టించింది. అతడు పోషకుడు. ఇక సంహారం చెయ్యటానికి రుద్రుని సృష్టించింది.

**సంహారశ్చ హిరాయత్తః ఉత్పత్తిర్భువనిర్మితా**
**రక్షాసుమృడ సంలగ్నా**

ఈ రకంగా బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు ఈ ముగ్గురినీ ఆ పరమేశ్వరే సృష్టించింది. వీరిలో సృష్టికార్యక్రమం బ్రహ్మకు ఒప్పగించబడింది. దేవీ భాగవతంలో మధుకైటభుల సంహారం తరువాత ఆ పరమేశ్వరి బ్రహ్మదేవునితో "నువ్వు సృష్టికార్యక్రమం చెయ్యి. వీరిద్దరూ అంటే విష్ణువు, రుద్రుడు నీకు సాయంగా ఉంటారు" అని చెబుతుంది.

అప్పటి నుంచీ బ్రహ్మ సృష్టి కార్యక్రమం చూస్తున్నాడు. విష్ణువు స్థితి, రుద్రుడు సంహార కార్యక్రమాలు చూస్తున్నారు. లలితాసహస్రంలో ఆ పరమేశ్వరియే సృష్టి, స్థితి, సంహారము, తిరోదానము, అనుగ్రహము అనే ఐదు పనులు చేస్తున్నది అని చెబుతూ

"సృష్టికర్త్రీ బ్రహ్మరూపా, గోప్త్రీ గోవిందరూపిణీ, సంహారిణీ రుద్రురూపా, తిరోదానకరీశ్వరీ, సదాశివానుగ్రహదా, **పంచకృత్య పరాయణా**

అని చెప్పబడింది. ఇప్పుడు రాక్షసులతో జరిగే యుద్ధంలో దేవతలకు సహాయం చెయ్యటానికి ఆ త్రిమూర్తుల యొక్క శక్తులు వచ్చినాయి.

**మహేశ్వరీ వృషారూఢా – త్రిశూల వరధారిణీ**
**మహాహివలయా ప్రాప్తా – చంద్రరేఖావిభూషణా ॥**

పెద్దపెద్ద సర్పాలను చేతిగాజులుగా ధరించి చంద్రరేఖను శిరసున అలంకరించుకుని, త్రిశూలాన్ని చేత్తో ధరించి వృషభవాహనమై మహేశ్వరి వచ్చింది. ఈమె ఈశ్వరుని శక్తి.

**కౌమారీ శక్తిహస్తా చ – మయూరవరవాహనా**
**యోద్ధు మభ్యాయయౌ దైత్యా – నంబికా గుహరూపిణీ॥**

చేతిలో బల్లెము ధరించి, నెమలి వాహన మెక్కి కుమారస్వామి యొక్క శక్తి వచ్చింది. ఆమే కౌమారి.

వజ్రాంగుని భార్య నరాంగి. వారి కుమారుడే తారకుడు. ఇతడు బ్రహ్మను గురించి ఘోరమైన తపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ఏవరంకావాలో కోరుకోమన్నాడు. దానికి తారకుడు ఇంతవరకు సృష్టిలో జన్మించిన ప్రాణి వల్ల నాకు చావురాకూడదు అన్నాడు. తథాస్తు అని చెప్పి అంతర్ధానమై పోయాడు.

అసలే రాక్షసుడు. అందులో వరబలగర్వి అయిన తారకుడు చెలరేగి పోయాడు. దేవలోకాన్ని జయించాడు. జ్ఞానులను, మునులను, ఋషులను నానాబాధలు పెడుతున్నాడు. దేవతలంతా హిమాలయాలకు పోయి పరమేశ్వరిని ప్రార్థించారు. చివరకు ఆ దేవి ప్రత్యక్షమై, దేవతల కోరిక తెలుసుకుని నా అంశతో హిమవంతునికి కుమార్తె పుడుతుంది. ఆమెను ఈశ్వరుడికి ఇచ్చి పెళ్ళిచేయండి. వారిద్దరికీ పుట్టేవాడు కుమారస్వామి. అతని చేతిలో తారకాసురుడు మరణిస్తాడు అని చెప్పింది.

ఈ రకంగా తారకాసురసంహారం కోసం జన్మించినవాడు దేవతల సేనాని అయిన కుమారస్వామి. ఆ కుమారస్వామి యొక్క శక్తి కౌమారి అనే పేరుతో పరమేశ్వరికి సాయంగా వచ్చింది.

**తథైవ వైష్ణవీ శక్తి - ర్గరుడోపరి సంస్థితా**
**శంఖచక్రగదాశార్ఙ్గ - ఖడ్గహస్తా ఉభ్యుపాయయౌ ॥**

శంఖము, చక్రము, గద, శౌర్ఙ్గము అనే పేరుగల ధనుస్సు, ఖడ్గము ధరించి, గరుడారూఢయై విష్ణుమూర్తి యొక్క శక్తి వచ్చింది. ఆమే వైష్ణవి.

**యజ్ఞవారాహ మతులం - రూపం యా బిభ్రతో హరేః ।**
**శక్తిః సాఉఉ ప్యాయయౌ తత్ర - వారాహీం బిభ్రతీ తనుమ్ ॥**

అసమానమైన యజ్ఞహరాహరూపం ధరించి నటువంటి శ్రీహరి యొక్క శక్తి కూడా అక్కడికి వచ్చింది. ఎవరీ 'యజ్ఞవరాహం'. దీన్ని గురించి బ్రహ్మపురాణంలో చెప్పబడింది.

జగత్తు యొక్క సృష్టిస్థితిలయాలను చూసేది శ్రీమన్నారాయణుడు. ఇతడు ఆది అంతము లేనివాడు. ఆయన కన్ను మూస్తే బ్రహ్మకు ఒక పగలు. కన్నుమూస్తే అది బ్రహ్మకు ఒక రాత్రి. ఇతడు అనంతుడు. ఆయనకు

రూపంలేదు. కాలుచేతులులేవు. శరీరంలేదు. అంగాలు అసలే లేవు. ఆయన సృష్టిలో సర్వస్వాన్నీ ఆవరించి ఉన్నాడు. అన్ని ఇంద్రియాలను ఆవరించి ఉన్నాడు. అన్ని గుణాలను ప్రకాశింపచేస్తున్నాడు. అతని వల్లనే సర్వమూ సంభవిస్తున్నది. అతని నుండే హిరణ్యగర్భుడు ఆవిర్భవించాడు. దానినుండి ఆకాశము, వాయువు, తేజస్సు, జలము వచ్చినాయి. జలమునుంచి ఒక అండం పుట్టింది. అది హిరణ్మయము. ఈ హిరణ్మయమైన అండమే ప్రజాపతి అని వేదాలు చెబుతున్నాయి. పరమేశ్వరుడు ఈ అండాన్ని రెండు భాగాలుగా విభజించాడు. ఇందులో పైభాగము ఆకాశము. క్రిందిభాగము రసాతలము. అండము నుంచి వచ్చినటువంటి మావి జలము నందు పడి మేరుపర్వతమైంది. దానినుంచి భూమి ఏర్పడింది. అనేక యోజనాల విస్తీర్ణము గలిగి, పర్వతాలతో కూడిన ఈ భూమి ఆ విష్ణుతేజస్సును మోయలేక క్రిందకు (ృ ంగిపోయి పాతాళం చేరి పోయింది.అలా క్రిందికి క్రుంగిపోయిన భూమి శ్రీహరిని చూసి ...

“ఓ మహానుభావా! శంఖచక్రగదాధరా! నీకు నమస్కారము. నువ్వు ప్రసన్నుడవు కావలసినది. నీదేహము నుంచే ఈ జగత్తు అంతా జన్మించింది. లోకాలను సృష్టించే బ్రహ్మావు నీవు. నీ అనుగ్రహంతోనే ఇంద్రుడు స్వర్గాన్ని అనుభవిస్తున్నాడు. నీ క్రోధముచేతనే దైత్యులు బెదరిపోతున్నారు. ధాత, విధాత, సృష్టికర్త అంతా నీయందే ఉన్నారు. మనువు, అగ్ని, యముడు, వాయువు అంతా నీయందే ఉన్నారు. పర్వతాలు, నదులు, ధర్మము, యజ్ఞము, యజ్ఞక్రియ, సత్యము, కీర్తి, ధృతి, క్షమ అన్నీ నీయందే ఉన్నాయి. పురాణాలు, వేదాలు, వేదాంగాలు, శాస్త్రాలు, ఛందస్సులు, త్రికాలములు, త్రిగుణములు, త్రిలోకములు అన్నీ నిన్ను ఆశ్రయించే ఉన్నాయి. ఒకటేమిటి ఆది, అంతము నీవే. చరాచర జగత్తంతా నీవే.

దేవదేవా! భూభారం తగ్గించటానికి ప్రతి యుగంలోనూ అవతరిస్తూ ఉంటావు. బ్రహ్మాది దేవతలు కూడా నీ తత్త్వాన్ని తెలుసుకోలేరు. స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తును సృష్టించేది నువ్వే. ప్రళయ కాలంలో ఈ జీవరాశిని మ్రింగివేసేది కూడా నీవే.

నీవు జలము నందుంటావు. ఆ జలానికే 'నారములు' అని పేరు. నారముల యందుంటావు కాబట్టే నీవు నారాయణుడనబడతావు. ధర్మమును నీ తత్త్వముగా గలిగి ఉన్నావు. ధర్మమే గోవు అనబడుతుంది. ఆ గోవు అనబడే ధర్మమే నీ తత్త్వము కాబట్టి గోవిందుడు అనబడతావు.

హృషీకములు అనగా ఇంద్రియాలు. ఇంద్రియాలకు అధిపతివి కాబట్టి హృషీకేశుడవు. యుగాంతంలో భూతములన్నీ నీ యందు లీనమవుతాయి. అందుకే వాసుదేవుడనబడతావు. ప్రతి కల్పమందు భూతాలను నీ దగ్గరకు లాక్కుని వాటిని లయం చేస్తావు కాబట్టి సంకర్షణుడవు.

దేవాసురులందరూ నీ బలం వల్లనే అన్ని తత్త్వాలు తెలుసుకుంటున్నారు. అందుచేత నీవు ప్రద్యుమ్నుడవు. భూతములలో నీకు మించినది. ఏదీలేదు. అందుచేత అనిరుద్ధుడవు. చరాచర జగత్తును నీవే ధరిస్తావు. నీవే ఆదిశేషుడవు. నీవే ఆదికూర్మమువు. నీవే ఆదివరాహమువు. కాబట్టి నేను నిన్ను శరణు వేడుతున్నాను. నన్ను రక్షించవలసినది" అని వేడుకున్నది.

భూదేవి ప్రార్థనను మన్నించిన వాడై శ్రీమహావిష్ణువు యజ్ఞ వరాహమై తన కోరలతో నీటిలో మునిగిపోయిన భూమిని పైకి తెచ్చాడు.

విష్ణుసహస్రంలో

**మహావరాహో గోవిందో సుశేణః కనకాంగదే ।**

అంటారు. 538వ నామం "మహావరాహః" గొప్ప వరాహమూర్తి. పాతాళానికి కృంగి పోయిన భూమిని తన కోరలతో పైకి ఎత్తినవాడు.

ఈ రకంగా ఆ యజ్ఞవరాహము ఏకార్ణవమున మునిగిపోయిన భూమిని తన కోరలతో ఎత్తి పట్టి రక్షించింది. ఇప్పుడు శుంభుడితో యుద్ధం చెయ్యాటానికి ఆ యజ్ఞవరాహము యొక్క శక్తి వారాహిరూపంలో అక్కడికి వచ్చింది.

**నారసింహీ నృసింహస్య - బిభ్రతీ సదృశం వపుః ।**
**ప్రాప్తా తత్ర సటాక్షేప - క్షిప్తనక్షత్రసంహతిః ॥**

'నారసింహి' సగంమనిషి. సగం సింహము రూపంతో ఉన్న నృసింహస్వామి యొక్క శక్తి. ఎవరీ నారసింహుడు? విష్ణుమూర్తి అవతారాలలో ఒకటి నృసింహావతారం.

జయవిజయులు వైకుంఠంలో శ్రీమహావిష్ణువుకు ద్వారపాలకులుగా ఉండేవారు. ఒకసారి సనకసనందనాదులు శ్రీ మహావిష్ణువును దర్శించటానికి వచ్చారు. ఆ సమయంలో లక్ష్మీదేవితో ఏకాంతంలో ఉన్నాడు శ్రీ మహావిష్ణువు. అందువల్ల సనకసనందనాదులను లోపలకు అనుమతించలేదు జయవిజయులు. దాంతో కోపగించిన మహర్షులు 'మీరు పోయి భూలోకంలో జన్మించండి' అని శపించారు.

విష్ణుమూర్తికి విషయం అంతావివరించి ఘొల్లుమన్నారు జయ విజయులు. "మహర్షుల శాపం తిరుగులేనిది కాబట్టి మీరు భూలోకంలో జన్మించి తీరాల్సిందే. అయితే విరోధంతో మూడు జన్మలు ఎత్తుతారా? భక్తులుగా ఏడు జన్మలెత్తుతారా? నిర్ణయించుకోండి" అన్నాడు విష్ణుమూర్తి. "ఏడుజన్మలపాటు నిన్ను వదిలి ఉండటం సాధ్యమయ్యే విషయం కాదు. అందుచేత మూడు జన్మలలోనే నీదరిచేరతాము" అని విన్నవించుకున్నారు.

అందులో మొదటి జన్మగా దితి కశ్యపులకు హిరణ్యకశప, హిరణ్యాక్షులుగా జన్మించారు. వీరు అతిక్రూరులు, భయంకరులుగా పేరు పొందారు. హిరణ్యాక్షుడు భూమిని తీసుకుపోయి. సముద్రంలో పారేశాడు. శ్రీమహావిష్ణువు వరాహరూపం ఎత్తి హిరణ్యాక్షుని సంహరించి భూమిని రక్షించాడు. సోదరుని మరణవార్త వినగానే కోపంతో ఊగిపోయాడు హిరణ్యకశపుడు. బ్రహ్మను గురించి ఘోరమైన తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. చావులేకుండా వరమియ్య మన్నాడు రాక్షసుడు. నేనే శాశ్వతంకాదు. నాకులేనిది నీకెలా ఇవ్వగలను? అందుచేత ఇంకెదైనా వరంకోరుకో అన్నాడు బ్రహ్మ. బాగా ఆలోచించి మనిషిచేతగాని, మృగంచేతగాని, ఇంటి బయటగాని, ఇంటి లోపలగాని, ఆయుధంచేతగాని, ఆయుధంలేకుండాగాని, పగలుగాని, రాత్రిగాని నాకు చావు రాకూడదు అంటూ విచిత్రమైన కోరిక కోరాడు హిరణ్యకశపుడు. తథాస్తు అన్నాడు బ్రహ్మ. వరబలంతో విజృంభించాడు రాక్షసుడు. ముల్లోకాలను జయించాడు. అతని శక్తి ముందు నిలవలేక విష్ణుమూర్తి అతని ముక్కురంధ్రాలలో దాక్కున్నాడు.

హిరణ్యకశపుని కుమారుడు ప్రహ్లాదుడు. గొప్పవిష్ణుభక్తుడు. అతనితో విష్ణుసంకీర్తన మాన్పించాలని విశ్వప్రయత్నంచేశాడు తండ్రి. కొండల నుంచి క్రిందికి త్రోయించాడు. పాములతో కరిపించాడు. సముద్రంలో పారేయించాడు. ఫలితం లేకపోయింది. చివరకు విసుగుచెంది, చేసేదిలేక "ఎక్కడున్నాడో ఆ హరి నాకు చూపించు" అన్నాడు.

ఇందుగలడందులేడను సందేహమువలదు
చక్రి సర్వోపగతుండు ఎందెందువదకిచూసిన అందందే గలడు.

"ఎక్కడున్నాడు? అని అడుగుతావేమయ్యా? శ్రీమహావిష్ణువు సర్వాంతర్యామి. ఎక్కడచూసినా అతడే ఉన్నాడు" అని సమాధానమిచ్చాడు ప్రహ్లాదుడు. అయితే ఈ స్తంభంలో ఉన్నాడా? అన్నాడు రాక్షసరాజు ఎదురుగా ఉన్న ఒక

స్తంభాన్ని చూపించి. 'ఉన్నాడు' అన్నాడు ప్రహ్లాదుడు. వెంటనే తన గదతో ఒక్క దెబ్బవేశాడు స్తంభాన్ని. ఆ దెబ్బకి ఆ స్తంభం కాస్తా ఫెళఫెళ విచ్చుకు పోయింది. అందులో నుంచి బయటకు వచ్చాడు హరి. హిరణ్యకశపుడు కోరిన విధంగానే అతడు మనిషికాదు, మృగంకాదు, నరహరి. అతనిచేతిలో ఆయుధం లేదు గోళ్ళే అతని ఆయుధాలు. ఆ గోళ్ళతో హిరణ్యకశపుని చీల్చి చంపేశాడు. అతడు మహోగ్రుడైన నృసింహస్వామి. ఇప్పుడు అతనిశక్తి నారసింహి పరమేశ్వరికి సాయంగా వచ్చింది.

**వజ్రహస్తా తథైవైంద్రీ - గజరాజోపరి స్థితా ।**
**ప్రాప్తా సహస్రనయనా - యథా శక్ర స్తథైవ సా ॥**

వేయికనులు గల ఐంద్రీ అనే శక్తి వజ్రాయుధం ధరించి ఏనుగునెక్కి వచ్చింది. ఇది ఇంద్రుని యొక్క శక్తి. దీనిపేరు 'ఐంద్రీ'.

దేవతలరాజు ఇంద్రుడు. స్వర్గలోకాధిపతి. భూలోకంలో నూరు అశ్వ మేధాలు చేసినవాడు ఇంద్ర పదవికి అర్హుడు. ప్రతి మన్వంతరంలోనూ ఇంద్రుడు మారుతూ ఉంటాడు. ఇతని ఆయుధము వజ్రాయుధము.

దేవదానవులకు అనాదిగా వైరమున్నది. రాక్షసులు దేవతలను బాధించి వారి అస్త్రాలు లాక్కోవటానికి ప్రయత్నించసాగారు. రాక్షసులబారిన పడకుండా వాటిని ఎక్కడ దాచాలో దేవతలకు తెలియలేదు.

భృగుమహర్షి కుమారుడు చ్యవనుడు. చ్యవనుడి కుమారుడు దధీచి. మహాతపశ్శాలి. దేవతలు బాగా ఆలోచించి తమ అస్త్రాలన్నింటినీ దధీచికి దాచమని ఇచ్చారు. దధీచి వాటిని జాగ్రత్తచేశాడు. దేవతలు ఎంతకాలానికీ తిరిగి రాలేదు. దధీచి ఆ అస్త్రాలను అభిమంత్రించి తాగేశాడు.

త్వష్ట ప్రజాపతికి ఒకసారి ఇంద్రుడిమీద బాగా కోపం వచ్చింది. ఇంద్రుణ్ణి సంహరించటానికి తన శక్తితో 'విశ్వరూపుని' సృష్టించాడు. అతన్ని సంహరించాడు ఇంద్రుడు. దీంతో కోపించిన త్వష్టప్రజాపతి ఇంద్రుని సంహారం కోసం హోమం చెయ్యనారంభించాడు హోమం పూర్తయింది. హోమగుండం నుంచి అగ్నితో సమానమైన తేజస్సు గలవాడు, సూర్యునితో సమానమైన ప్రతాపంకలవాడు, దివ్యమైన కాంతులతో విరాజిల్లేవాడు. అయిన కుమారుడు ఉదయించాడు. త్వష్ట ఆ కుమారుణ్ణి చూసి "నువ్వు త్వరత్వరగా పెరిగి ఆ ఇంద్రుణ్ణి ముక్కలు ముక్కలుగా నరుకు" అన్నాడు. అంతలోనే ఆ బాలుడు కొండంత ఎదిగి త్వష్ట ప్రజాపతితో "తండ్రీ!

నన్నెందుకు పుట్టించావు? నా పేరేమిటి? నేనేం చెయ్యాలి? నువ్వెందుకు విచారంగా ఉన్నావు? నీకు కష్టం కలిగించిన వారెవరు? ఇంద్రుడా? చంద్రుడా? సూర్యుడా? యముడా? చెప్పు ఎవరిని కడతేర్చాలి?" అన్నాడు.

ప్రజాపతి కొద్దిసేపు ఆలోచించి "వృజినము అంటే పాపము నుంచి రక్షించే వాడవు కాబట్టి నీ పేరు వృత్రుడు. నీ అన్న విశ్వరూపుణ్ణి ఇంద్రుడు చంపేశాడు. కాబట్టి ఇంద్రుణ్ణి చంపిరా!" అన్నాడు. త్వష్ట ప్రజాపతి తనశక్తితో రకరకాల ఆయుధాలు సృష్టించి కుమారుడి కిచ్చాడు. దివ్యరథము, ధనుర్బాణాలు, కవచము ఇచ్చాడు. గతంలో దేవతల చేతిలో ఓడిపోయిన రాక్షస వీరులందరినీ చేరదీసి దేవతల మీద యుద్ధానికి బయలుదేరాడు వృత్రాసురుడు.

వృత్రాసురుడికి భయపడి ఇంద్రాది దేవతలంతా విష్ణుమూర్తిని శరణుకోరారు. అప్పుడు విష్ణువు దేవతలతో "దేవతలారా! మీరంతా పోయి దధీచి మహర్షిని ఆశ్రయించండి. అతని ఎముకలతో విశ్వకర్మ రకరకాల ఆయుధాలు మీకు చేసి ఇస్తాడు. వాటితో వృత్రాసురుని సంహరించవచ్చు" అన్నాడు. దేవతలు దధీచి వద్దకు పోయి తమ ఆయుధాలిమ్మని అడిగారు. మహర్షి వాటిని తాను త్రాగేసిన సంగతి చెప్పి "నేను జీవితం చాలిస్తాను. నా ఎముకలను మీరు ఆయుధాలుగా చేసుకోండి" అన్నాడు. ధధీచి యొక్క వెన్నెముకతో ఒక ఆయుధం తయారుచేసి ఇంద్రుడికిచ్చాడు విశ్వకర్మ. అదే వజ్రాయుధం.

అహల్యా వృత్తాంతంలో గౌతముడి శాపం వల్ల సహస్రాక్షుడైనాడు ఇంద్రుడు. అతని వాహనం 'ఐరావతం' అనే ఏనుగు. ఇది నాలుగు దంతాలు గలిగిన తెల్లఏనుగు. ఈ ఏనుగు నెక్కి వచ్చింది ఐంద్రీ అనబడే ఇంద్రుని శక్తి.

ఈ రకంగా దేవతాశక్తులన్నీ అక్కడకు చేరినాయి. ఇవే సప్తమాతృకలు. ఆ సమయంలో శివుడు అక్కడికొచ్చి చండికతో "రాక్షసులతో యుద్ధంచేసి వారందరినీ సంహరించి నాకు ప్రీతిని కలిగించవలసింది" అన్నాడు.

అప్పుడు ఆ దేవి ఈశ్వరుని దగ్గరకు వచ్చి "ప్రభూ! సత్వరమే నీవు నా దూతగా శుంభుని వద్దకు వెళ్ళి బ్రతికి ఉండాలంటే పాతాళాని పారిపోవలసినది" అని చెప్పమన్నది. సాక్షాత్తూ ఈశ్వరుణ్ణే దూతగా పంపింది. కాబట్టి ఆమె 'శివదూతి' అనబడింది.

రంభుడు త‌ వచుట్టా అ‌

తపస్సు చేస్తున్నాడు. పంచాగ్ను
3. పశ్చిమాగ్ని, 4. ఉత్తరాగ్ని
నీటిలో దిగి తపస్సు చేస్తున్నాడు.
రూపంలో వచ్చి కర ంబుని చంపే
మహాబలశాలి, దేవత లను జయించ
అగ్నిదేవుని ప్రార్థించా ‌ ను. ఎంతసేపటి
రంభుడు హోమ గు ండ సృష్టించి
చెయ్యటానికి పూనుకు న్నాడు. అప్పుడు
కావాలో కోరుకోమన్నా ‌ ‌ ప. దానికి రంభుడ
కామరూపి, ముల్లోకాలన ు జయించి పాలించ
కావాలి" అన్నాడు. అగ్నిదేవుడు రంభుని
వెళ్ళేప్పుడు ముందుగా నువు ఎవరిని చూసి
లక్షణాలు గల కుమారు ‌డు ఉదయిస్తాడు" అని

వరప్రసాది అయిన రంభుడు ఇంటికి
యక్షగంధర్వ, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్యగ
కుండా ప్రయాణిస్తున్నాడు. త్రోవలో ఎంతోమంది
స్త్రీలు, అపురూపు సౌందర్యరాసులు తారసపడ్డారు.
మాత్రం చలించలేదు. చివరకు సుందరీమణులం
తిరుగాడుతున్న ప్రదేశానికి కొంచెం దూరంగా
గడ్డిమేస్తోంది ఒక మహిషము. దాన్ని చూడగానే మ
రంభుడికి. ఆ గేదె గర్భం దాల్చింది. దానికి జన్మించినవాడే

కొంతకాలానికి రంభుడు కాలంచేశాడు. అతని భ
రంభుడికి అగ్నికార్యం నెరవేర్చి, తాను కూడా చితి ఎక్కింద
నుంచి రౌద్రాకారుడైన పురుషుడు వచ్చాడు. అతడే రక్తబీజు
రక్తబీజుడుగా జన్మించాడన్నమాట. ఆ రక్తబీజుడు ఇప్పుడు
సేనానిగా ఉన్నాడు. ఇతడికి ఒక గొప్పవరం ఉన్నది. ఇతని శరీరం
రక్తపు బిందువు నేలమీద పడ్డట్లైతే దానినుంచి అతనితో సమ
బలపరాక్రమాలు గలవాడయిన రాక్షసుడు ఇంకొకడు భూమి
పుడతాడు. ఈ రకంగా అతనివి ఎన్ని రక్తపు బొట్లు క్రిందపడితే, అంత
రక్తబీజులు పుడతారన్నమాట.

రక్తబీజుడు గదను తీసుకుని ఐంద్రీశక్తితో యుద్ధానికి వచ్చాడు. ఐంద్రీశక్తి వజ్రాయుధంతో ఆ రాక్షసుణ్ణి గాయపరచిం( దాంతో అతని రక్తం భూమిమీద పడింది. ఆ రక్తమునుంచి రక్తబీజుని రూపము, పరాక్ర మము, లక్షణాలు గల రాక్షసవీరులు అనేకులు పుట్టుకొచ్చారు. అతని శరీరము నుంచి ఎన్ని రక్తపుబిందువులు క్రిందపడుతున్నాయో.అంతమంది రక్తబీజులు మళ్ళీ పుడుతున్నారు. వాళ్ళందరూ ఈ మాతృకలతో 'యం కరంగా యుద్ధం చేస్తున్నారు. ఈసారి ఐంద్రీశక్తి వజ్రాయుధంతో తని తలమీద కొట్టింది. తలపగిలి రక్తంకారింది. మళ్ళీ అతడి లాటి రాక్షస లనేకులు జన్మించారు. వైష్ణవీశక్తి తన చక్రంతో రక్తబీజుని శరీరం చీల్చి వేసిది. అప్పుడు స్రవించిన రక్తంతో రక్తబీజునివంటి రాక్షసులు వేలమంది అవతరించారు.

కౌమారి బల్లెముతో, వారాహి ఖడ్గముతో,మాహేశ్వరి త్రిశూలము తోనూ రక్తబీజుని గాయపరచారు. ఆ గాయాలనుండి స్రవించిన రక్తంతో కొన్నివేల మంది అతనితో సమానమైన రాక్షులు ఉద్భవించారు. ఈ రకంగా రక్తబీజుని రక్తపు బిందువులనుంచి ఉద్భవించిన రాక్షసులతో ఈ జగత్తు అంతా నిండిపోతోంది. అది చూసిన దేవతలు భయభ్రాంతులైనారు. రాక్షస సమూహాన్ని చూసి భీతి నొందిన దేవతను చూసి

ఉవాచ కాళీం చాముండే విస్తీర్ణం వదనం కురు ॥
మచ్ఛస్త్ర పాత సమ్భూతాన్ రక్తబిందూన్ మహాసురాన్

రక్తబిందోః ప్రతీచ్ఛత్వం వక్త్రేణానేన వేగతా ॥
భక్షయంతీ చరరణే తదుత్పన్నాన్ మహాసురాన్
ఏవమే షక్షయం దైత్యః క్షీణరక్తో గమిష్యతి ॥

చండిక కాళితో అంటోంది. చాముండే విస్తీర్ణం వదనం కురు॥

"ఓ చాముండా నీ నోటిని బాగా తెరు. నాబాణాలు తగిలు రక్తబీజుని శరీరం నుంచి రక్తం కారుతుంది. ఆ రక్తాన్ని, ఆ రక్తమునుంచి పుడుతున్న రాక్షసులను కూడా నువ్వు వెంటనే మింగి వేయవలసినది. అతని రక్తాన్ని త్రాగుతూ, ఆ రక్తంవల్ల పుట్టిన రాక్షసులను భక్షిస్తూ రణరంగంలో వీరవిహారు చెయ్యి. అలా రక్తక్షయం అవటం వల్ల ఆ రాక్షసుడు మరణిస్తాడు" అని చెప్పి దేవి రక్తబీజుని శూలముతో పొడిచింది. అతని దేహం నుంచి రక్తంకారుతోంది. ఆ రక్తం క్రింద పడకుండా కాళి త్రాగివేస్తోంది. దేవి శూలము, వజ్రాయుధము, ఖడ్గము ఇలా రకరకాల

ఆయుధాలతో రక్తబీజుని గాయపరుస్తోంది. అతని శరీరము నుంచి రక్తం కాలువలై ప్రవహిస్తున్నది. అలా కారిన రక్తాన్ని కాళి త్రాగి పారేస్తోంది. కొత్త రాక్షసులు పుట్టటం లేదు. అతని శరీరం నుంచి రక్తం కారిపోతోంది. ఇలా కొంతసేపు జరిగే సరికి రక్తబీజుడు వంటినిండా గాయాలతో రక్తహీనుడై నేలమీద కూలిపోయాడు.

**తతస్తే హర్షమతుల - మవాపు స్త్రిదశా నృప**
**తేషాం మాతృగణోజాతోననర్తా సృఙ్మదోద్ధతః ॥**

రక్తబీజుడు మరణించగానే దేవతలంతా మహదానందం చెందారు. మాతృకాగణాలు రక్తపానం చేసి నాట్యంచేసినాయి అంటూ ఎనిమిదవ అధ్యాయాన్ని ముగించాడు మహర్షి



# నిశుంభ వధ

## 9వ అధ్యాయము

రాజా! మహాబలశాలి, గొప్పశౌర్యవంతుడు, పరాక్రమవంతుడు, సేనాని అయిన రక్తబీజుడు మరణించాడు.

**చకార కోప మతులం - రక్తబీజే నిపాతితే**
**శుంభాసురో నిశుంభశ్చ - హతే ష్వన్యేషు చాహవే ॥**

రక్తబీజుడు, అతనితోపాటుగా మిగిలిన రాక్షసవీరులు మణించటం చూసిన శుంభనిశుంభులకు పట్టరాని కోపం వచ్చింది.

తమ సైన్యము నాశనం కావటం చూసిన శుంభుని సోదరుడైన నిశుంభుడు రాక్షససేనలో ముఖ్యమైన వారిని తీసుకుని ఆ పరమేశ్వరితో యుద్ధానికి బయలుదేరాడు. అతని ముందు, వెనక, ఇరుప్రక్కలాకూడా శౌర్య బలపరాక్రమవంతులైన రాక్షసవీరులు అమితమైన కోపంతో ఊగిపోతూ నడుస్తున్నారు. ఇప్పుడు "ముందుగా మాతృకలతో యుద్ధం చేసి, వారిని సంహరించి, ఆ తరువాత ఆ దేవిని సంహరించాలి" అని నిర్ణయించుకున్న వాడై మహావీరుడైన శుంభుడు కూడా సైన్యసమేతంగా బయలుదేరాడు. ఈ రకంగా శుంభనిశుంభులిద్దరూ మహావీరులైన రాక్షస సైన్యాన్ని వెంట పెట్టుకుని దేవితో యుద్ధానికి వెళ్ళారు.

ఆ దేవికి, శుంభనిశుంభులకు ఘోరమైన యుద్ధం ప్రారంభమైంది. రాక్షసవీరులు మేఘాలు వర్షించినట్లుగా బాణాలను ఆ దేవిపై కురిపించారు. చండిక రాక్షసులు వేసిన బాణాలన్నింటినీ తన బాణాలతో త్రుంచి వేసింది. పదునైన బాణాలతో రాక్షవీరులను గాయపరచింది. ఇంతలో నిశుంభుడు వెంట్రుకనుకూడా నిలువుగాచీల్చగల పదునైన కత్తిని, డాలును తీసుకుని, ఆ కత్తితో దేవి వాహనమైన సింహం తలమీద ఒక్కదెబ్బ వేశాడు. అది చూసిన ఆ దేవి వాడియైన బాణాలతో నిశుంభుని యొక్క కత్తి, డాలు ముక్కలు ముక్కలుగా చేసి వేసింది. చేతిలోని కత్తి డాలు విరిగిపోగానే నిశుంభుడు ఆ ప్రక్కనే ఉన్న బల్లెం ఒకటి తీసుకుని ఆమె మీదికి విసిరాడు. తన మీదికి వస్తున్న బల్లాన్ని ఆ దేవి చక్రాయుధంతో ముక్కలు చేసింది. బల్లెంకూడా విరిగిపోవటంతో నిశుంభుడు విపరీతమైన కోపముతో ఒక శూలాన్ని

విసిరాడు. చండిక ఆ శూలాన్ని తన చేత్తో ముక్కలు చేసింది. దాంతో మహోగ్రుడైన నిశుంభుడు ఒకగదను తీసుకొని గిరగిరా త్రిప్పి చండికమీదికి విసిరాడు. చండిక ఆ గదను త్రిశూలంతో పొడిపొడిచేసి బూడిదచేసి వేసింది. అప్పుడు నిశుంభుడు గండ్రగొడ్డలి తీసుకుని ఆ దేవిపై ఒక్కదూకు దూకాడు. ఆదేవి రెండువాడియైన బాణాలతో ఆ గండ్రగొడ్డలిని ముక్కలుగా చేసివేసింది. నిరాయుధుడై దిక్కుతోచక అటు ఇటు చూస్తున్న నిశుంభుడి మీదికి పదునైన బాణాలు ప్రయోగించింది. ఆ శరాఘాతానికి తట్టుకోలేక నిశుంభుడు మూర్ఛపోయాడు. కొంతసేపటికి తెప్పరిల్లిన నిశుంభుడు మహా రౌద్రంతో చండికను చంపటానికి బయలుదేరాడు. ఆ సమయంలో తన ఎనిమిది చేతుల యందు గొప్ప గొప్ప ఆయుధాలను ధరించి ఆకాశం అంతా వ్యాపించి ఉన్నాడు శుంభుడు. అతడు తనవైపుగా రావటం చూసిన చండిక శంఖం పూరించింది. ఆ శబ్దానికి దిక్కులు పిక్కటిల్లినాయి. ధనుష్టం కారం చేసింది. ఆ శబ్దానికి భూమి అతలాకుతలం అయింది.

తన చేతిలోని ఘంటను గణగణ మ్రోగించింది. ఆ శబ్దానికి రాక్షసేన యొక్క ధైర్యము కాస్తా సడలిపోయింది. దేవి వాహనమైన సింహం భీకరంగా గర్జించింది. ఆ శబ్దానికి దశదిశలు మారు మ్రోగినాయి. కాళి ఆకాశంలోకి ఎగిరి క్రిందికి దూకుతూ తన రెండుచేతులతోనూ నేల మీద కొట్టింది. అంతకు ముందు వచ్చిన శబ్దాలన్నీ అందులో కలిసిపోయినాయి. శివదూతి కీడును సూచించే విధంగా పెద్దగా అట్టహాసం చేసింది. ఆ అట్టహాసానికి రాక్షసవీరులంతా భయపడిపోయారు. అది చూసిన నిశుంభుడికి విపరీతమైన కోపం వచ్చింది. అప్పుడు అంబిక "దుర్మార్గుడా! ఆగు" అంటూ అరిచింది. ఆకాశంలో దేవతలు జయజయధ్వానాలు చేశారు.

నిశుంభుడు వస్తూనే అగ్నిలాగా మండుతున్న అతి భయంకరమైన బల్లెము ఒకటి దేవి మీదికి విసిరాడు. ఆ దేవి ఇంకొక బల్లెము విసిరి నిశుంభుడు విసిరిన బల్లాన్ని విరగ్గొట్టేసింది. ఆ సమయంలో నిశుంభుడు పెద్దగా కేకపెట్టాడు. దానితో మూడులోకాలు కంపించిపోయినాయి. చండిక చేసిన అట్టహాసంతో నిశుంభుడు చేసిన ధ్వని మూగబోయింది. యుద్ధం మొదలైంది. దేవి మీదికి నిశుంభుడు బాణాలను ప్రయోగిస్తున్నాడు. వాటిని ఆమె త్రుంచివేస్తూ, సమయం చూసి నిశుంభుడి మీదకు బాణాలు వేస్తున్నది. నిశుంభుడు దేవివేసిన బాణాలను తన వాడి బాణాలతో ముక్కలు

చేస్తున్నాడు. పోరు ఘోరంగా సాగుతోంది. ఆ సమయంలో రోషపూరిత చండిక తన త్రిశూలంతో నిశుంభుని ఒక్కపోటు పొడిచింది. ఆ దెబ్బకు నిశుంభుడు కాస్తా మూర్ఛపోయాడు.

అలా మూర్ఛపోయిన నిశుంభుడు కొద్దిసేపటికి తెప్పరిల్లి వాడియైన బాణాలతో చండికను, కాళిని, సింహాన్ని కొట్టాడు. వెంటనే ఆ రాక్షసుడు పదివేల చేతులను కల్పించుకొని వాటి నిండా చక్రాయుధములు ధరించి. చండికను కప్పివేశాడు.

**తతో భగవతీ క్రుద్ధా - దుర్గా దుర్గార్తినాశినీ**
**చిచ్ఛేద తాని చక్రాణి - స్వశరైః సాయకాంశ్చ తాన్॥**

అప్పుడు ఆ దేవి కోపంతో ఆ చక్రాయుధాలని, బాణాలనీ కూడా ఛేదించి వేసింది.

నిశుంభుడు రాక్షసేన తన వెంటరాగా, బలమైన గదను తీసుకుని చండికను సంహరించటానికి ఆమె మీదకు వేగంగా వెళ్ళాడు. అలా వస్తున్న నిశుంభుని చూసి దేవి తన చేతిలోని కత్తితో ఆ రాక్షసుని చేతిలోని గదను ముక్కలు చేసింది. వెంటనే అతడు శూలాన్ని తీసుకుని ముందుకు దూకాడు. చండిక పదునైన మరొక శూలాన్ని తీసుకుని ముందుకు దూకిన రాక్షసుడి గుండెల్లో గ్రుచ్చింది. దేవి ప్రయోగించిన శూలం దెబ్బకి నిశుంభుడి హృదయం చీల్చుకుపోయింది. అలా చీలిపోయిన హృదయంలో నుంచి మహాబలసంపన్నుడైన రాక్షసుడు ఇంకొకడు 'నిలునిలు'అంటూ చండిక మీదికి వచ్చాడు. అది చూసిన దేవి పెద్దగా నవ్వుతూ, నిశుంభుని హృదయంనుంచి బయటకు వచ్చిన రాక్షసుని శిరస్సు తన కత్తితో ఖండించివేసింది. నిశుంభుడు నేలకొరగగానే సింహం మిగిలిన రాక్షసులను చీల్చి చెండాడింది. కాళి, శివదూతి ఆ రాక్షసవీరులను మ్రింగివేస్తున్నారు. కౌమారి బల్లెపుపోట్లకు కొంతమంది అసురులు మరణించారు. మహేశ్వరి త్రిశూలపు దెబ్బకు కొంతమంది, వారాహి ముట్టెదెబ్బలకు కొంతమంది రాక్షసులు మరణించగా వైష్ణవి తన చక్రాయుధంతో కొంతమందిని ఖండఖండాలుగా నరికి వేసింది. కొంతమందిని ఐంద్రి తన వజ్రాయుధంతో ఛేదించి వేసింది ఇది చూసిన కొందరు రాక్షసులు తమకు తామే మరణించారు. మిగిలిన వారు యుద్ధభూమినుంచి పారిపోయారు.

అంటూ తొమ్మిదవ అధ్యాయాన్ని పూర్తిచేశారు.

# శుంభాసుర వధ

## దశమాధ్యాయము

ఋషి చెబుతున్నాడు. రాజా!

**నిశుంభం నిహతం దృష్ట్వా - భ్రాతరం ప్రాణసంమితమ్**
**హన్యమానం బలం చైవ - శుంభః క్రుద్ధోఽబ్రవీ ద్వచః ॥**
**బలావలేపదుష్టే త్వం - మా దుర్గే! గర్వ మావహ**
**అన్యాసాం బల మాశ్రిత్య - యుద్ధస్యే యాఽతిమానినీ ॥**

తన ప్రాణంతో సమానమైన తమ్ముడు సంహరించబడటం, సైన్యం అంతా నాశనమయిపోవటం చూసిన శుంభుడు కోపంతో "ఓ దుర్గా! బలగర్వము చేత బాగా క్రొవ్విన నువ్వు, ఆ గర్వాన్ని నా దగ్గర చూపద్దు. ఎంతగొప్ప దానివని అనుకొన్నప్పటికీ, ఇతరుల బలం మీద ఆధారపడి యుద్ధం చేస్తున్నావని మరచిపోకు" అన్నాడు. ఆ మాటలు విన్న ఆ దేవి.

**ఏకై వాఽహం జగ త్యత్ర - ద్వితీయా కా మమా ఽపరా**
**పశ్యైతా దుష్ట! మయ్యేవ - విశంత్యో మద్విభూతయః ॥**

"ఓ రాక్షసుడా! ఈ లోకంలో నేను ఎప్పుడూ ఒంటరిదాననేనయ్యా! నేనుగాక ఇంకెవరూ లేరు. ఓ దుష్టుడా! నా శక్తులయిన వీరంతా నాలోకి ప్రవేశిస్తారు చూడు" అన్నది.

సృష్టి ప్రారంభం కాకముందు అంటే కృతయుగానికి ముందు జగత్తంతా శూన్యంగా ఉండేది. అప్పుడు ఈ జగత్తును పరమేశ్వరుడు ఆవరించి ఉన్నాడు. అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. ఆ తరువాత ఈ జగత్తంతా ఆ పరమేశ్వరుని చేతనే సృష్టించబడింది. ఇక్కడ పరమేశ్వరుడికి రూపం లేదు. లింగభేదం లేదు. ఈ సృష్టి అంతా పరమేశ్వరమయం. ఇక్కడ ఉన్నది పరమేశ్వరుడొక్కడే. జడము చైతన్యము రెండూ ఆ పరమేశ్వరియే. లలితా సహస్రంలోని 416, 417, 418, 419 నామాలు చూడండి.

**చిచ్ఛక్తిః చేతనా రూపా జడశక్తి ర్జడాత్మికా ॥**

'చిత్ అనేవి రెండు అక్షరాలు. అనంతమైనవి. అవిద్య నశించగానే మిగిలేది విద్య. అదే జ్ఞానము. చిత్ అనబడుతుంది. సకల ప్రాణికోటి యందు జీవాత్మ రూపంలో ఉన్న పరమాత్మ. అదే శివము. శరీరంలో నుంచి

ఈ శివం గనక వెళ్ళిపోతే మిగిలేది శివమే. చిత్ అనే పదార్థాన్నే చైతన్యము అంటారు. జగత్తులోని ప్రతివస్తువునందు చలనము తెచ్చేశక్తే పరమాత్మశక్తి. అదే చైతన్యము. 'చిచ్ఛక్తి' అనబడుతుంది.

పరమేశ్వరుని యొక్క నిర్మలమైన చైతన్యమే చిచ్ఛక్తి. సకల జీవుల దేహముల యందు చైతన్యరూపంలో ఉండేది. ఇదే ధ్రువకళ, సాదాఖ్యకళ, చిత్కళ, ఆత్మకళ, పరమాకళ అనబడుతుంది.

జడము అంటే దృశ్యము. జడమే స్వరూపంగా గలది. కంటికి కనిపించే పదార్థాలే ఆత్మగా గలది. ఈ ప్రకృతి అంతా జడ పదార్థము. ప్రపంచమనేది చేతనము, జడము అని రెండుభాగాలు. చేతనమే చిచ్ఛక్తి కాగా జడమే జడశక్తి.

స్పష్టంగా చెప్పాలంటే అన్ని శక్తులూ ఆ పరమేశ్వరియే. చేతనము, జడము రెండూ ఆమే. అలాగే లలితాసహస్రంలోని 813, 814 నామాలు చూడండి. 'మూర్తామూర్తా', మూర్తము అమూర్తము. రూపం ఉన్నటువంటి వస్తువులు మూర్తం, భూమి, నీరు, అగ్ని. రూపంలేని వస్తువులు గాలి, ఆకాశం ఇవి అమూర్తాలు. పంచీకృతమైన పంచభూతాలు మూర్తాలు. అపంచీకృతములైన భూతసూక్ష్మాలు అమూర్తులు.

ఇంకా చెప్పాలి అంటే కంటికి కనిపించేది మూర్తము. ఒక ఆకారం గలది మూర్తము. కంటికి కనిపించనిది, ఒక ఆకారం లేనిది ఆమూర్తము. పరమేశ్వరి యొక్క స్థూలరూపం మూర్తము. సూక్ష్మరూపం అమూర్తము. పరబ్రహ్మకు రెండు రూపాలున్నాయి. 1. మూర్తము 2. అమూర్తము. వీటిలో మొదటిది క్షరము. రెండవది అక్షరము.

1. క్షరము - నామరూపాత్మకమైన ప్రపంచము.

2. అక్షరము - కంటికి కనిపించని పరమాత్మ

వీటిని గురించి బృహదారణ్యకోపనిషత్తులో చెప్పారు. బ్రహ్మకు రెండు రూపాలున్నాయి. 1. మూర్తము. 2. అమూర్తము. అవే స్థూలము, సూక్ష్మము. మర్త్యరూపము అమృతరూపము. అంటే క్షరము, అక్షరము నశించేది, నశించనిది. మరణమున్నది, మరణములేనిది. నిర్వచించటానికి వీలైనది. నిర్వచించటానికి వీలుకానిది.

పంచభూతాలలో మొదటి మూడు పృథవి, జలము, అగ్ని ఈ

మూడూ మూర్తాలు. స్థూలమైనవి. కంటికి కనిపిస్తాయి. వీటికి ఒక ఆకారమున్నది. వీటిని నిర్వచించటానికి వీలవుతుంది. ఇవి నశిస్తాయి. మిగిలిన రెండూ అంటే - వాయువు, ఆకాశము అమూర్తులు. వీటికి నాశనం లేదు. ఇవి కంటికి కనపడవు. వీటికి ఆకారం లేదు. వీటిని నిర్వచించటానికి వీలులేదు.

ప్రాణం కన్న భిన్నమైనది. దేహంలో ఉన్న ఆకాశం కన్న భిన్నమైనది. మొదటి మూడు భూతాలచేత నిర్మించబడింది ఈ శరీరం. ఇది మూర్తము. మర్త్యము. నాశనమై పోతుంది.

ప్రాణాలు, శరీరంలో ఉన్న ఆకాశం. అదే దహరాకాశం రెండూ అమూర్తాలు, నాశనం లేనివి.

లింగశరీరమైన పురుషుని వాసనామయరూపం పసుపులో ముంచిన వస్త్రంలాగా, తెల్లని గుడ్డలాగా, వర్షాకాలంలో కనిపించే ఆరుద్ర పురుగు లాగా, అగ్నిజ్వాలలాగా, తెల్లని పద్మంలాగా, మెరుపుకాంతి లాగా ఉంటుంది. ఈ విషయం తెలుసుకున్న వాడి సంపద విద్యుత్ప్రకాశం లాగా ఒక్కసారిగా అంతటా వ్యాపించి ఉంటుంది.

బ్రహ్మను గురించి ఇంతకన్న చెప్పటం కష్టం. నేతినేతి అనుకుంటూ, కనిపించేవి విషయాలను నిషేధిస్తూ పోతే చివరకు మిగిలేదే బ్రహ్మము. అది సత్యానికి సత్యం ప్రాణానికి ప్రాణం.

ఈ రకంగా కంటికి కనిపించే స్థూలరూపము కంటికి కనిపించని సూక్ష్మరూపము రెండూ పరమేశ్వరి రూపాలే. కాబట్టే ఆమె 'మూర్తామూర్తా' అనబడుతున్నది.

జగత్తంతా ఆ పరమేశ్వరి నిండి ఉన్నది. ఆమెతో సమానమైన వారుగాని, ఆమెకన్న అధికులు గాని వేరెవరూ లేరు. అందుకే శుంభుడితో 'నేనుగాక ఈ లోకంలో ఎవరూ లేరు' అని చెబుతోంది.

అంకా అంటోంది "ఓ రాక్షసుడా! నా శక్తులయిన వీరు నాలో ప్రవేశిస్తారు."

జగత్తు అంతా ఆ పరమేశ్వరి నుంచే ఆవిర్భవించబడింది. ప్రళయ కాలంలో తిరిగి ఈ జగత్తంతా ఆ పరమేశ్వరిలోనే లీనమవుతుంది. ఆమె నుంచి ఉద్భవించిన ప్రతిజీవి, ప్రతివస్తువు తిరిగి ఆమెలోనే లీనమవుతుంది. అందుకే ఆ దేవి 'నా శక్తులన్నీ మళ్ళీ నాలోనే ప్రవేశిస్తాయి. చూడు' అంటోంది.

ఎప్పుడైతే ఆ పరమేశ్వరి అలా చెప్పిందో, అప్పుడు వెంటనే బ్రాహ్మి మొదలయిన మాతృకలందరూ కూడా ఆమె శరీరంలో లయం అయిపోయారు. ఇక ఆమె ఒక్కతే మిగిలింది. ఇప్పుడు ఆ దేవి మళ్ళీ "నాశక్తిచేత నాలో నుండి బయటకు వచ్చిన రూపాలన్నింటినీ నేను ఉపసంహరించుకున్నాను. ఇప్పుడు నేను ఒక్కదానను మాత్రమే మిగిలిఉన్నాను. యుద్ధానికి సిద్ధం కావలసింది" అన్నది.

ఆ యిద్దరికీ పోరు ప్రారంభమైంది. చూస్తుండగానే పోరు ఘోరమైంది. ఆకాశంలోనుంచి దేవతలు, భూమి మీద నుంచి రాక్షసులు అందరూ వారి యుద్ధాన్ని రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. వారిద్దరూ ఒకరి మీద ఒకరు పదునైన బాణాలు ప్రయోగిస్తున్నారు. దారుణమైన అస్త్రాలు ప్రయోగిస్తున్నారు. సర్వలోక భీకరంగా యుద్ధం చేస్తున్నారు. అంబిక కొన్నివందలు దివ్యమైన అస్త్రాలను ఆ రాక్షసుడి మీద ప్రయోగించింది. వాటిన్నింటినీ నిర్వీర్యం చేసి వేశాడు శుంభుడు. ఆ రాక్షసుడు దివ్యాస్త్రాలను దేవి మీద ప్రయోగించాడు. ఆమె వాటిని నిరుపయోగంచేసి వేసింది. రాక్షసుడు కొన్ని వందల బాణాలతో ఆ పరమేశ్వరిని కప్పివేశాడు. ఆవిడ కోపగించి అతడి వింటినారిని ఛేదించింది. ఎప్పుడైతే ధనుస్సు పనికి రాకుండా పోయిందో అప్పుడు బల్లెం తీసుకున్నాడు. చక్రాయుధంతో బల్లెం అతని చేతిలో ఉండగానే ఖండించివేసింది. ఆ రాక్షసవీరుడు పదునైన కత్తి, డాలు తీసుకుని ఆమె మీదికి ఉరికాడు. అతడు తన మీదకు వస్తుండటం చూసిన చండిక పదునైన బాణాలతో అతని కత్తి, డాలు ముక్కలు చేసివేసింది. చూస్తుండగానే రెండు బాణాలతో సారథిని సంహరించింది. గుర్రాలు నేల కొరిగినాయి. రథం విరిగిపోయింది. మహావీరుడైన రాక్షసరాజుకు రథం లేదు, గుర్రాలులేవు, సారథిలేదు, ధనుస్సులేదు, బాణాలులేవు. ఏంచెయ్యాలో తెలియక దగ్గరలో ఉన్న ఇనుపగద నొకదాన్ని తీసుకుని అంబికను చంపటానికి బయలుదేరాడు. అలా వస్తున్న రాక్షసుణ్ణి చూసి వాడియైన బాణాలతో అతని చేతిలోని ఇనుపగదను ముక్కలు చేసి వేసింది. అయినప్పటికీ అతడు ఇనుమంత కూడా చలించలేదు. చెయ్యిపైకెత్తి పిడికిలి బిగించి ఆమె మీదికి వెళ్ళాడు. అలా వెళ్ళి పిడికిటితో బలంగా ఆమె హృదయం మీద ఒక్కదెబ్బవేశాడు. ఆ దెబ్బను తట్టుకుని పరమేశ్వరి తన అరచేత్తో అతని వక్షస్థలము మీద కొట్టింది. ఆ దెబ్బకు నేలమీద పడ్డాడు రాక్షసుడు. క్రింద పడినవాడు వెంటనే లేచి ఆ దేవిని పట్టుకుని ఆకాశంలోకి ఎగిరాడు. వారిద్దరూ ఆకాశంలో అత్యద్భుతంగా యుద్ధం చేస్తున్నారు.

దేవగంధర్వ సిద్ధసాధ్య గణాలన్నీ అమితాశ్చర్యంతో చూస్తున్నాయి. అంతలో అంబిక ఆ రాక్షసుణ్ణి పట్టుకుని గిరగిర త్రిప్పి నేలకేసి కొట్టింది. అంత ఎత్తునుంచి నేలమీద పడికూడా వెంటనే లేచి, ఆ రాక్షసుడు మళ్ళీ ఆమె మీదికి పరుగెత్తాడు. అలా తనమీదికి వస్తున్న శుంభుణ్ణి చూసి ఆ దేవి చేతితో ఒక శూలాన్ని తీసుకొని విసిరింది. అది నేరుగాపోయి ఆ రాక్షసుని గుండెల్లో దిగిపోయింది, ఆ దెబ్బకు విలవిల్లాడు తూనే నేలకూలాడు శుంభుడు. దుర్మార్గుడైన రాక్షసుడు శుంభుడు మరణిం చగానే జగత్తు యావత్తు స్వస్థతపొందింది. ఆకాశం నిర్మలమైంది.

**తతో దేవగణాః సర్వే - హర్షనిర్భరమానసాః**
**బభూవు ర్నిహతే తస్మిన్ - గంధర్వా లలితం జగుః॥**
**అవాదయం స్తథై వాన్యే - ననృతు శ్చాప్సరోగణాః॥**

ఆ రాక్షసుడు మరణించగానే దేవతలంతా మహదానందం చెందారు. గంధర్వులు గానం చేశారు. మిగిలిన వారంతా వాద్యాలువాయిస్తుంటే అప్సరసలు నాట్యం చేశారు. గాలి చల్లగా వీచింది. సూర్యుడు పరిపూర్ణమైన తేజస్సుతో వెలిగాడు. అగ్నులు శాంతంగా ప్రజ్వలించినాయి. దిక్కులందు పుట్టిన భయంకరమైన ధ్వనులు అంతరించిపోయినాయి.

అంటూ పదవ అధ్యాయం పూర్తి చేశారు.



# నారాయణీ స్తుతి

## పదకొండవ అధ్యాయము

సప్తశతి లో 1, 4, 5, 11 అధ్యాయాలలో ఉన్న దేవీస్తోత్రాలు చాలా ముఖ్యమైనవి. వీటిని గనక పారాయణ చేసినట్లైతే చండీ సప్తశతి అంతా పారాయణ చేసిన ఫలితం దక్కుతుంది అని గతంలో వివరించటం జరిగింది. వాటిలో ఆఖరుదయిన 11వ అధ్యాయం ఇప్పుడు చూడబోతున్నాం.

శుంభనిశుంభులను సంహరించిన తరువాత దేవతలు పూలవాన కురిపించారు. గంధర్వులు పాడారు. అప్సరసలు ఆడారు. అటువంటి స్థితిలో ఇంద్రాది దేవతలు ఆ పరమేశ్వరిని పరిపరివిధాల స్తుతిచేశారు.

**దేవి! ప్రపన్నార్తిహరే! ప్రసీద! ప్రసీద మాత ర్జగతోఽఖిలస్య ।**
**ప్రసీద విశ్వేశ్వరి! పాహి విశ్వం త్వ మీశ్వరీ దేవి! చరాచరస్య ॥**

శరణనన్న వారి దుఃఖములను పోగొట్టే ఓ దేవీ! అఖిలలోక జననీ! లోకమాతా! ఈ జగత్తును రక్షించవలసినది. ఓ పరమేశ్వరీ! చరాచర జగత్తు కంతటకూ నీవే పాలకురాలవు.

ఆ పరమేశ్వరి సర్వప్రాణులకు తల్లి. సర్వజీవులకు మాత. మంత్రాలకన్నిటికీ తల్లి. అక్షరాలన్నింటికీ తల్లి. కల్పాంతంలో మహా ప్రళయం సంభవించి నప్పుడు జగత్తులోని జీవరాసి అంతా ఆమెలో లీనమై పోతుంది. మళ్ళీ సృష్టి ప్రారంభమైనప్పుడు ఆమె గర్భం నుంచి బయటకు వస్తుంది. ఈ కారణం చేత జగత్తులోని సర్వజీవులకు ఆమె మాత అవుతున్నది. అవ్యక్తమైన పరమేశ్వరి నుంచే నామరూపాత్మక జగత్తు వ్యక్తమవుతున్నది. అందుచేతనే ఆ దేవి మాతా అనబడుతోంది. లలితాసహస్రంలో 458వ నామం 'మాతా'.

లోకంలో ఏ ప్రాణి అయినా సరే తనకు ఏదైనా బాధ కలిగినప్పుడు అమ్మా! అంటుంది. అంటే, ఆ తల్లి వచ్చి తన బాధను తీరుస్తుందని ఆ జీవి నమ్మకం.

'జన్మానాం నరజన్మ దుర్లభం' జన్మలన్నింటిలోకి దుర్లభమైనది మానవ జన్మ. ఎన్నో వేల జన్మలు ఎత్తిన తరువాత గతజన్మలలో చేసిన మంచిఫలితం

ఆధారంగా మానవ జన్మ వస్తుంది. అందుకే మానవజన్మ ఉత్తమమైనది. జీవులన్నింటికీ ఇంద్రియాలుంటాయి. ఆహారనిద్రామైథునాలు అన్నింటికీ సమానమే. కాని మానవులకు మనస్సు అనబడే పదకొండవ ఇంద్రియము ఒకటుంది. దీనివల్లనే అతడు ఆలోచించగలుగుతాడు. అంటే, మానవుడికి యుక్తాయుక్త విచక్షణ ఉంటుంది. పాప పుణ్యాల యోచన ఉంటుంది. ధర్మా ధర్మాల వివేచన ఉంటుంది. ఆ ప్రాణిచేసే కర్మలను బట్టి ఎన్నో వేల సార్లు జన్మలు ఎత్తవలసి ఉంటుంది. చివరకు .... పరమాత్మలోనుంచి వచ్చిన ఈ జీవాత్మ మళ్ళీ పరమాత్మలోనే లీనమవుతుంది. ఈలోగా కొన్ని లక్షలసార్లు పుట్టటం జరుగుతుంది. ప్రతి జన్మలోనూ ఒక తల్లి ఉంటుంది. లోకంలో పిల్లలు లేని తల్లులుంటారు కాని తల్లులు లేని పిల్లలు మాత్రం ఉండరు. అందుచేతనే ప్రతివారికీ ఒక తల్లి ఉంటుంది. మరి అమ్మా! అని పిలిస్తే ఏ తల్లిని పిలిచినట్లు? పోనీ ఈ జన్మలోని తల్లినే పిలిచారు అనుకుందాం. ఆమె వచ్చి తన బిడ్డ కష్టాలు తీర్చగలుగుతుందా? తాపత్రయాలు పోగొట్ట గలుగు తుందా? తాపత్రయాలు మూడు రకాలు అవి :

1. ఆధి భౌతికము – తనకన్న ఇతరులైన వారి వలన అంటే భార్యాబిడ్డలువల్ల, సర్పవృశ్చికాది బాధలవల్ల పరితపించటము.

2. ఆధిదైవికము – ప్రకృతి సిద్ధమైన వాటివల్ల కలిగే బాధలు. అగ్నిప్రమాదాలు, భూకంపాలు, వరదలు ఇత్యాది.

3. ఆధ్యాత్మికము – దేహంలో ఉన్న ఇంద్రియాలకు కలిగిన వ్యాధులచేత దుఃఖించటము, అలసత్వము, కపటము, అవిశ్వాసము, అశ్రద్ధ మొ॥వి.

బిడ్డయొక్క తాపత్రయాలు తీర్చాలి అంటే ఆ తల్లికే సాధ్యమవుతుంది. మరి ఆ తల్లి అంటే ఎవరు?

అమ్మలగన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ.

తల్లులకే తల్లి. ముగురమ్మలు అంటే – మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి వారిని సృష్టించినటువంటిది. ఆవిడే పరమేశ్వరి. జగన్మాత, పరాత్పరి, సృష్టి స్థితిలయకారిణి అయిన ఆ దేవియే అమ్మ. ఆమె

కరుణామయి. దయాసముద్రురాలు. అందుకే అమ్మా! అని ఒకసారి పిలవగానే పరవశించిపోయి, బిడ్డలు కోరిన కోరికలు తీరుస్తుంది. ఆవిడే మాత. వట్టిమాతకాదు. శ్రీమాత. లలితాసహస్రంలోని మొదటి నామం ఇదే. శ్రీమాతా! ఆవిడే లోకాలకు తల్లి.

దేవీ భాగవతంలో త్రిమూర్తులు ఒక దివ్యవిమానం ఎక్కి మణిద్వీపం చేరతారు. అక్కడ పరమేశ్వరి శ్రీచక్రం మీద కూర్చుని దర్శన మిస్తుంది. అప్పుడు బ్రహ్మ "తల్లీ! నీవే పరమేశ్వరివా? నీవే పరబ్రహ్మవా? నీ తత్త్వాన్ని మాకు వివరించవలసినది" అని అడుగుతాడు. అప్పుడు ఆ దేవి చెబుతుంది. "నీటిలోని చల్లదాన్ని నేనే. అగ్నిలోని వెచ్చదనాన్ని నేనే. సూర్యునిలోని తేజస్సును, చంద్రునిలోని మంచును నేనే. నేను లేని వస్తువు ఈ జగత్తులో ఏదీ లేదు. అంతదాకా ఎందుకు? మీ ముగ్గురూ కూడా నేను లేకుండా ఏ పనీ చెయ్యలేరు. శక్తితో కలిస్తేనే బ్రహ్మ లోకాలను సృష్టిస్తాడు. విష్ణువు లోకాలను రక్షిస్తాడు. రుద్రుడు సంహారంచేస్తాడు. కాబట్టి నేను లేనిది ఏదీ లేదు. చరాచర జగత్తంతా నేనే నిండిఉన్నాను" అంటుంది. ఆ దేవియే శ్రీమాత. శక్తిస్వరూపిణి. ఈ లోకాలన్నీ ఆమె నుంచే ఉద్భవించాయి. అందుకే ఆవిడ జగన్మాత. లోకమాత విశ్వమాత అనబడుతున్నది. ఆమే త్రిమూర్తులను సృష్టించింది. త్రిశక్తులను సృష్టించింది. లోకాలను లోకపాలకులను సృష్టించింది. వేదాలను సృష్టించింది.

ఇంద్రాది దేవతలంతా ఆ దేవిని ప్రార్థిస్తున్నారు. ఓ లోకమాతా! జగన్మాతా! ప్రసీద విశ్వేశ్వరి పాహి విశ్వం. చరాచర జగత్తు నంతటినీ రక్షించ వలసినది అంటున్నారు.

దేవీ భాగవతంలో పరమేశ్వరి ఉండే మణిద్వీపాన్ని వర్ణిస్తూ చింతామణి గృహంలో వేయిస్తంభాలు కలిగిన మంటపాలు నాలుగున్నాయి.

సహస్రస్తంభ సంయుకాశ్చత్వా రత్వేషు మంటపాః॥

అవి ఏవి అంటే -

**శృంగారమంట పశ్చైకో । ముక్తి మంటప ఏవచ.**
**జ్ఞానమంటప సంజ్ఞస్తు । తృతీయః పరికీర్తితా ।**
**ఏకాంత మంటపశ్చైవ - చతుర్థపరికీర్తితాః ॥**

1. శంగారమంటపము 2. ముక్తిమంటపము.

3. జ్ఞానమంటపము 4. ఏకాంత మంటపము

ఈ మంటపాల్లో ఏం జరుగుతుంది?

**శృంగారమంటపే దేవ్యోగాయంతీ వివిధైస్స్వరైః**
**సభాసదో దేవవరా మధ్యే శ్రుజగదంబికా ॥**

శృంగార మంటపంలో దేవతలు మధురస్వరాలతో గానం చేస్తుంటారు. అక్కడ సభాసదుల మధ్యన సింహాసనం మీద ఆ పరమేశ్వరి కూర్చుని ఉంటుంది.

**ముక్తి మంటప మధ్యేయ యోచయత్వనిశంశివా**

ముక్తిమంటపం నుంచి ఆ దేవి జగత్తులోని భక్తులందరికీ వారివారి అర్హతలను బట్టి ముక్తిని ప్రసాదిస్తుంది.

**జ్ఞానోపదేశం కురుతే తృతీయే నృపమంటపే**

జ్ఞానమంటపంలో భక్తులకు జ్ఞానోపదేశం చేస్తుంది.

**చతుర్థేమంటపేచైవ జగద్రక్షావివించనం**
**మంత్రిణీసహితా నిత్యం కరోతి జగదంబికా ॥**

నాల్గవ మంటపంలో పరమేశ్వరి తన మంత్రులతో కొలువుదీరి లోకాల రక్షణ గురించి ఆలోచిస్తూంటుంది.

అందుకే ఆమె లోకపాలకురాలు. ఈ కారణం చేతనే ఇంద్రాది దేవతలు "ఓ తల్లీ! నీవు లోకపాలకురాలవు" అంటున్నారు.

**ఆధారభూతా జగతస్త్వ మేకా మహీస్వరూపేణయతః స్థితాఽని**
**అపాం స్వరూపస్థితయా త్వయైత దాప్యాయతే కృత్స్న మలం**
**ఘ్య వీర్యే ॥**

అతిక్రమించటానికి అలవికాని శౌర్యము గల ఓ దేవీ! భూమి రూపంలో ఉండే నీవే ఈ జగత్తుకు ఆధారభూతురాలవు. నీటిరూపంలో ఉండే నీ చేతనే ఈ సర్వమూ తృప్తి పొందుతున్నది.

ఈ శ్లోకంలో ముందుగా ఆ పరమేశ్వరి యొక్క శౌర్య పరాక్రమాలను వివరిస్తున్నారు. ఆ దేవి చేతుల యందు ధనుస్సు, బాణాలు, పాశము, అంకుశము ఉన్నాయి. అందుకే ఆ దేవిని వర్ణించేప్పుడు

**సకుంకుమవిలేపనా మళిక చుంబి కస్తూరికాం**
**సమందహసితేక్షణాం సశరచాప పాశాంకుశాం**

అంటారు. ఆ దేవి యొక్క నాలుగు చేతులయందు 'సశరచాపపాశాం కుశాం' బాణములు, ధనుస్సు, పాశము, అంకుశము ఉన్నాయి. ఆ దేవి చతుర్భుజ. నాలుగు భుజములు గలిగినది. కాళిదాసు శ్యామలాదండకంలో

**చతుర్భుజే చంద్రకళావతంసే**
**కుచోన్నతే కుంకుమ రాగశోణే**
**పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ హస్తే**

అంటాడు. ఆ దేవికి నాలుగు చేతులున్నాయి. ఆ చేతుల యందు ధనుర్బాణములు, పాశము, అంకుశము ఉన్నాయి. అయితే .... కొంత మంది పరమేశ్వరికి పదిచేతులున్నాయి అంటారు. ఇలా గనక చూసినట్లైతే ఆ దేవికి ఉన్నచేతులు నాలుగా, పదా అనే అనుమానం వస్తుంది.

చతుర్ద్వైక్య సంధానము చేసిన వారికి ఆ దేవి చతుర్భుజగాను, షడ్ద్వైక్య సంధానం చేసిన వారికి దశభుజగాను దర్శనమిస్తుంది. శంకర భగవత్పాదులవారు సౌందర్యలహరిలోని 7వ శ్లోకంలో

**క్వణత్కాంచీదామా కరికలభ కుంభస్తననతా**
**పరిక్షీణామధ్యే పరిణత శరశ్చంద్రవదనా**
**ధనుర్బాణాన్ పాశం సృణిమపిదధానాకరతలైః ॥**

ఆ త్రిపురసుందరి తన నాలుగు చేతులయందు ధనుర్బాణాలు, పాశాం కుశాలు ధరించి ప్రకాశిస్తున్నది.

శంకరాచార్యుల వారి గురువుగారు గోవిందపాదాచార్యులు. వారి గురువుగారు గౌడపాదాచార్యులవారు. ఈయన చాలా గొప్పవాడు. మాండూక్యోపనిషత్తుకు కారికలు వ్రాసిన మహానుభావుడు. ఈ గౌడపాదుల వారు' సుభగోదయస్తుతి' అని ఒక చిన్న గ్రంథం వ్రాశారు. ఇందులో కేవలం

52 శ్లోకాలు మాత్రమే ఉన్నాయి. శంకరుడికి దేవీతత్త్వం ఏమిటో అర్థంకాక గౌడపాదుల వారి దగ్గరకు వెళ్ళినప్పుడు, గౌడపాదులవారు ఈ 'సుభగోదయ స్తుతి' అనే చిన్న గ్రంథాన్ని శంకరులవారిచేతికిచ్చి చూడమన్నాడట. దాన్ని చదివిన తరువాతనే శంకరుల వారు 'సౌందర్యలహరిని' ని వ్రాశారని ప్రతీతి. గౌడపాదులు వ్రాసిన 'సుభగోదయస్తుతి' శంకరులు వ్రాసిన 'సౌందర్యలహరి' రెండూకూడా శ్రీవిద్యకు మూలస్తంభాలవంటివి.

గౌడపాదులవారు సుభగోదయస్తుతిలోని 16వ శ్లోకంలో ఆ దేవిని వర్ణిస్తూ

**భవాని । శ్రీహస్తైః నహసి ఫణిపాశం సృణీ మథో**
**ధనుః పౌండ్రం పౌష్పం శరమథ జపస్రమేకవతా**
**అథద్వాభ్యాయభయవరదానైక రసికాం**
**క్వణ ద్వీణాం ద్వాభ్యాం త్వమురసికరాభ్యాం చ బిభృషే ॥**

ఓ భవానీ! నీ పదిచేతులయందు సర్పరూపపాశము, అంకుశము, పుండ్రేక్షు చాపము అంటే చెరకువిల్లు, పుష్పబాణాలు, జపమాల, శుకవరము, వరద అభయముద్రలు, మరి రెండు చేతుల యందు వీణ ధరించి ఉంటుంది అన్నారు.

దేవి యొక్క బాహువులు ఆమె శౌర్యపరాక్రమాలకు గుర్తు. ఆమెకు పదిబాహువులున్నాయి అంటే, ఆ దేవి అనన్యసామాన్య శౌర్యపరాక్రమాలు గలది అని అర్థం.

ఓ దేవీ! భూమి రూపంలో ఉండే నువ్వే ఈ జగత్తుకు ఆధారభూతు రాలవు. ఆ పరమేశ్వరి భూమి రూపంలో ఉంటుంది. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ ఈ సృష్టి చేయాలనే తలంపుతో తనలోంచి కొంతశక్తిని బయటకు పంపాడు. అదే పరమేశ్వరి. అదే మహాయోని. దానినుంచే చరాచర జగత్తంతా ఆవిర్భవించింది. 'లలితా సహస్రం'లో 955వ నామం

'ధరా'. **ధరాపృథ్వీస్వరూపా**

పృథ్వీస్వరూపము గలది. సమస్త జగత్తులను ధరించునది.

**సర్వస్యజగతోధారణాత్**

ఈ జగత్తులన్నింటినీ ధరించేది. జగత్తులన్నింటికీ అధిష్టానమైనది. ఆధారమైనది. వరాహరూపంలో విష్ణువు యొక్క కోరలచే రక్షించబడినది క్షమాస్వరూపిణి.

పరమేశ్వరియే ఈ జగత్తును సృష్టించింది. ఈ సృష్టిలో ముందుగా ఆకాశము ఆవిర్భవించింది.

తరువాత : ఆకాశాద్వాయుః

దాహోరగ్నిః

అగ్నిరే అపః

అపః పృథ్వీ

ముందుగా ఆకాశం వచ్చింది. తరువాత

ఆకాశంనుంచి - వాయువు

వాయువునుంచి - అగ్ని

అగ్నినుంచి - జలము

జలము నుంచి - భూమి

భూమి నుంచి - ఓషధులు

ఓషధులనుంచి - అన్నం. ఆవిర్భవించాయి. భూమి మీదనే ఈ జగత్తంతా సృష్టించబడింది. అందుకే జగత్తుకు ఆధారం భూమి. నీటి రూపంలో ఉండి సర్వాన్నీ తృప్తి చెందిస్తున్నది అంటే పంచభూత రూపం కూడా ఆమే.

**త్వం వైష్ణవీ శక్తి రనంతవీర్యా**
**విశ్వస్య బీజం పరమాఽసి మాయా**
**సమ్మోహితం దేవి సమస్తమేత్**
**త్వం వై ప్రసన్నా భువిముక్తి హేతు ॥**

విష్ణుమూర్తి యొక్క శక్తివైన నీ పరాక్రమానికి హద్దులేదు. చరాచర జగత్తుకు మూలమయిన మహామాయవు నువ్వే! నీ వల్లనే ఈ జగత్తంతా భ్రాంతి అయింది. నీవు గనక ప్రసన్నురాలవైనట్లైతే మోక్షమార్గాన్ని చూపుతావు.

నామరూపాత్మకమైన జగత్తంతా పరమేశ్వరినుంచే ఆవిర్భవించింది. ఈ లోకాలను సృష్టించాలనే కోరిక కలిగినప్పుడు ముందుగా త్రిమూర్తులను సృష్టించింది. బ్రహ్మ - సృష్టికర్తగా, విష్ణువు - స్థితికారకుడుగా, రుద్రుడు - సంహారకారకుడా ఈ ముగ్గురినీ సృష్టించింది. ఆ తరువాత మధుకైటభ సంహారం జరిగింది. అప్పుడా త్రిమూర్తులు ఒక దివ్యవిమానం ఎక్కి మణిద్వీపం చేరతారు. అక్కడ శ్రీచక్రం మీద ఒక స్త్రీమూర్తి కూర్చుని ఉంటుంది. ఆవిడే పరమేశ్వరి. త్రిమూర్తులు ఆమెకు నమస్కరించి, అనేక విధాలుగా స్తుతిచేస్తారు. ఆ తరువాత బ్రహ్మదేవుడు "ఓ దేవీ! నీ తత్త్వము ఏమిటో మాకు తెలుపవలసినది" అని అడుగుతాడు. అప్పుడు పరమేశ్వరి తన తత్త్వాన్ని వివరించి త్రిమూర్తులతో సృష్టిస్థితి సంహారాలు నిర్వహించమని చెబుతూ "బ్రహ్మ సృష్టికార్యక్రమం చూస్తాడు. మీరిద్దరూ అతనికి సహాయకులుగా ఉండండి. విష్ణువు లోకాలను రక్షిస్తాడు" అని చెప్పి త్రిశక్తులను సృష్టించి "బ్రహ్మకు - సరస్వతిని, విష్ణువుకు - లక్ష్మిని, రుద్రుడికి - కాళిని ఇచ్చి వీరు ముగ్గురూ నా ప్రతిరూపాలు. మీ పనులలో సహాయకులుగా ఉంటారు" అని చెబుతుంది. ఆ రకంగా విష్ణువు స్థితికారకుడైనాడు. లోకాలను రక్షించే బాధ్యత, పోషించే బాధ్యత అతడిదే. ఆ విష్ణువు యొక్క శక్తి ఈ పరమేశ్వరి తప్ప వేరుకాదు. విష్ణువు పరాక్రమానికి ప్రతిరూపం. అందుచేతనే "విష్ణుమూర్తి శక్తివయిన నీ పరాక్రమానికి హద్దు లేదు తల్లీ" అంటున్నారు.

ఈ జగత్తుకు మూలాధారమైనదానవు నువ్వేనమ్మా! నీవే మహామాయవు.

బ్రహ్మసత్యం జగన్మిథ్య. జగత్తులో ఆ పరబ్రహ్మ ఒక్కటే సత్యము నిత్యము అయినది. అదే శాశ్వతమైనది. కంటికి కనిపించేదంతా భ్రాంతి. ఇక్కడ ఏమిలేదు. కాని అంతా ఉన్నట్టే అనిపిస్తుంది. ఈ మాటని మనం ఒప్పుకోలేం. ఎందుకంటే భార్యాబిడ్డలు, బంధువులు, స్నేహితులు, ఆస్తి పాస్తులు, ధనధాన్యాలు అన్నీ కంటికి కనిపిస్తున్నాయి. కాబట్టి ఇదంతా భ్రాంతి అంటే ఒప్పుకోము.

అయితే నిజంగా ఇది భ్రాంతే. నిద్రపోతున్న వాడికి కలవస్తుంది. ఆ

కలలో తాను మహారాజుగారి కుమార్తెను వివాహం చేసుకున్నాడు. రాజుగారి తరువాత తానే రాజైనాడు. సర్వసుఖాలు అనుభవిస్తున్నాడు భార్యాబిడ్డలతో సుఖంగా ఉన్నాడు. ఇంతలో పొరుగుదేశపు రాజు అకారణంగా యుద్ధానికి వచ్చాడు. యుద్ధంలో తాను ఓడిపోయాడు. కుమారులు హతులైనారు. రాజ్యం శత్రువుల వశమైంది. శత్రువులు తరుముతున్నారు. తాను అరణ్యాలలో పరుగులు పెడుతున్నాడు. నేల మీద రాళ్ళు, ముళ్ళు గుచ్చుకుంటున్నాయి. అయినా తప్పదు, ప్రాణ భయంతో పరుగుతీస్తున్నాడు. తన దుస్థితికి దుఃఖిస్తున్నాడు.

ఇంతలో మెలకువ వచ్చింది. కల చెదిరిపోయింది. అంతా భ్రాంతి. హమ్మయ్య అనుకున్నాడు. కొద్దిసేపటిదాకా ఆ కలనే నిజం అనుకున్నాడు. ఇప్పుడు అది భ్రాంతి అని తెలుసుకున్నాడు. అలాగే ఈ జగత్తుకూడా భ్రాంతి అయితే మానవుడు అజ్ఞానంచేత ఆవరించబడిఉన్నాడు కాబట్టి ఇది భ్రాంతి అని తెలుసుకోలేడు. ఆ విషయం తెలుసుకోగలిగిన వాడికి సుఖదుఃఖాలు ఉండవు. కోపతాపాలు ఉండవు. ఈ జగత్తు అంతా మాయాస్వరూపిణి అయిన ఆ పరమేశ్వరిచే సృష్టించబడింది. ఆమె గనక ప్రసన్నమైతే సాధకుడికి మోక్షమార్గం లభిస్తుంది. ఈ జగత్తు అంతా మిథ్య అని తెలియటమే మోక్షమార్గం. ఆ బ్రహ్మ ఒక్కటే సత్యము, నిత్యము అని తెలియటమే మోక్ష మార్గం. ఈ మార్గం ఆ పరమేశ్వరి భక్తులకు మాత్రమే సాధ్యపడుతుంది.

**విద్యాః సమస్తా స్తవ దేవి భేదాః**
**స్త్రియః సమస్తాః సకలాజగత్సుః**
**త్వయైకయా పూరిత మంబయైతత్**
**కాతేస్తుతిః స్తవ్యపరాపరోక్తిః ॥**

ఓ తల్లీ! విద్యలు అన్నీ నీయొక్క అంశలే. అలాగే లోకంలోని స్త్రీ మూర్తులందరూ నీ అంశలే. ఈ రకంగా జగత్తంతా నీవే నిండి ఉన్నావు. అన్ని వస్తువులందు ముఖ్యము, గౌణము రెండు రూపాలు నీవేనమ్మా. గౌణము అంటే అప్రధానము అని అర్థం. అందుచేత సర్వజీవుల యందు, అన్ని వస్తువులయందు ప్రధానమైనది, అప్రధానమైనది రెండూ నీవే.

సృష్టి ప్రారంభంలో ఆ పరమేశ్వరి నుంచే నామరూపాత్మకమైన జగత్తు

ఏర్పడింది. నామాత్మక జగత్తు అంటే - ముందుగా ఓంకారము వచ్చింది. అదే పరబ్రహ్మకు ప్రతీక. దానినుంచి అకార ఉకార మకారాలు వచ్చినాయి. అనగా అక్షరసమామ్నాయమంతా వచ్చింది. వాటినుంచి పదాలు, వాక్యాలు మంత్రాలు, వేదాలు, శాస్త్రాలు, సంగీతము, సాహిత్యము అన్నీ ఆవిర్భవించినాయి. లలితాసహస్రంలోని 236వ నామం "చతుష్షష్టికళామయీ" కళలు మొత్తం 64. ఇవి రెండు రకాలు 1. విద్యాకళలు 2. వృత్తికళలు. విద్యాకళలలో మొదటి నాలుగు - చతుర్విద్యలు.

అవి 1. అన్వీక్షికి 2. త్రయీ 3. వార్తా 4. దండనీతి

1. అన్వేక్షికి అంటే - ఆలోచన, మంత్రాంగము.

2. త్రయీ విద్య అంటే - వేదవిద్య.

3. వార్తా అంటే - ఉనికి, వృత్తాంతము, సమాచారము.

4. దండనీతి అంటే - శిక్ష విధించటం

ఇక మిగిలినవి వేదాలు, వేదాంగాలు, పురాణాలు, ఇతిహాసాలు, ఉపపురాణాలు, శాస్త్రాలు.

స్థూలరూపము పరమేశ్వరి. ఆమె యొక్క సూక్ష్మరూపము మంత్రము. ఈ రకంగా అన్ని రకాలయిన విద్యలూ ఆమె రూపమే. విద్యలు అన్నీ ఆమె అంశలే. అంతే కాదు లోకంలోని స్త్రీమూర్తులందరూ ఆమె రూపమే

జగత్తంతా ఆ పరమేశ్వరి నుంచే ఆవిర్భవించింది. అందుకే ఆమె 'మహాయోని' అనబడుతున్నది. యోని అంటే జన్మస్థానము. 'పృథివీయోనిః' అంటోంది వేదం. ఈ భూమి మహాయోని. పరమేశ్వరి రూపము. అందుకనే యోని అనేది ఎక్కడ ఉన్నాసరే అది పరమేశ్వర స్వరూపంగానే భావించవలసి ఉంటుంది. అందుచేతనే జగత్తులోని స్త్రీత్వమంతా నీ యొక్క అంశేనమ్మా అంటున్నారు దేవతలు. ఇంకా చెబుతున్నారు. ఓ తల్లీ! ఈ జగత్తు అంతా నీవే నిండి ఉన్నావు. ఐతరేయోపనిషత్తులో చెబుతారు. జగత్తులో జీవరాశిని సృష్టించిన తరువాత పరమేశ్వరుడు ఈ దేహంలో ప్రవేశించాలి అనుకున్నాడు. అలా ప్రవేశించటానికి రెండుమార్గాలున్నాయి. 1. క్రిందినుంచి 2. పైనుంచి. క్రిందినుంచి ప్రవేశించటమనేది సేవకా లక్షణం కాబట్టి పైనుంచి అంటే బ్రహ్మరంధ్రం నుంచి దేహంలో ప్రవేశించాడు.

హుకార సంజ్ఞ గలిగిన పరమేశ్వరుడు సకార సంజ్ఞగలిగిన ప్రకృతితో కలసి శబళబ్రహ్మమై బ్రహ్మ రంధ్రంగుండా మానవదేహంలో ప్రవేశించాడు. ఈ రకంగా పాలలో ఉన్న నెయ్యిలాగా పరబ్రహ్మ ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. అందుకే దేవతలు అంటున్నారు. ఓ తల్లీ! ఈ జగత్తంతా: నీవే నిండి ఉన్నావు. అంతే కాదు ప్రపంచంలోని వస్తువు లన్నింటియందూ ప్రధానము అప్రధానము అయిన రెండురూపాలు ఆమే. ఉదాహరణకి చూడండి.

సవితా - అంటే సూర్యుడు అని అర్థం. విష్ణుసహస్రంలో 884, 969 నామాలు ఇదే. సూర్యలోకముగా ఉండేవాడు. సూర్యుని యొక్క వేడికి సముద్రంలోని నీరు ఆవిరై మేఘరూపం ధరిస్తుంది. ఆ మేఘాలు కొండలమీద వర్షించి ఏరులు, వాగులు, వంకలుగా మారతాయి. అవన్నీ కలిసి నదులుగా ఏర్పడతాయి. ఈ నదులవల్ల భూమి సస్యశ్యామల మవుతుంది. ఓషధులు, వనస్పతులు పండుతాయి. వాటినుంచే అన్నం పుడుతుంది. సవితా అంటే సూర్యుడు. ఎండను కాచేవాడు అని అర్థం. కాని ఋగ్వేదంలో ఇతన్ని గురించి వేరుగా చెప్పబడింది. 'సవిత' అనే దేవత హిరణ్మయుడు. ఇతని అవయవాలు, సామాగ్రి అంతా బంగారుమయం. ఇతడు బంగారు కనులు, బంగారు చేతులు, బంగారు నాలుక గలవాడు. పసుపు పచ్చని జుట్టు గలవాడు. పసుపుగోధుమరంగులు కలసిన కవచం ధరించినవాడు. బంగారురథం మీద లోకాలను చూసివస్తుంటాడు. ఈయన గుర్రాలు తెల్లనివి. బంగారు మయమైనకాంతిని అంతటా ప్రసరింపచేస్తాడు. ఆయన చేతులు ఆకాశం అంచుల దాకా వ్యాపించి ఉంటాయి. వాటితో అందరినీ నిద్రలేపి అనుగ్రహిస్తాడు. సూర్యకాంతివంటి కాంతి గలవాడు అని చెప్పబడింది.

ఇలా చెప్పినప్పుడు ఈ రెండు లక్షణాలు ఆ పరమేశ్వరుడివే. ప్రధానమైన లక్షణము, అప్రధానమైన లక్షణము రెండూ ఆమెవే. అందుచేతనే ఇటువంటి లక్షణాలు గల ఓ తల్లీ! నిన్ను ఏ రకంగా స్తుతించగలము? అంటున్నారు.

సర్వభూతా యదా దేవీ భుక్తి ముక్తి ప్రదాయినీ
త్వం స్తుతాస్తుతయే కావా భవంతు పరయోక్తయః ॥

సర్వభూతస్వరూపిణివి, పరంజ్యోతివి, భోగమోక్షప్రదాతవు అయిన నిన్ను ఏ రకంగా వర్ణంచగలము?

వేదాలకు అంతమందున్న భాగమే వేదాంతము. అదే ఉపనిషత్తు. నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వాటిలో 108 ముఖ్యమైనవి ఆ 108లో ప్రధాన ఉపనిషత్తులు ఎనిమిది. వాటిలో 'బహ్వృచోపనిషత్తు' ఒకటి.

బహ్వృచోపనిషత్తు ఋగ్వేదానికి సంబంధించినది.

బహ్వృచోపనిషత్తులో "సృష్టిపారంభంకాకముందు పరమేశ్వరి ఒక్కతే ఉండేది. ఆమెయే ఈ జగత్తును సృష్టించింది. ఆమె నుండియే బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు మరుద్గణాలు, గంధర్వులు, అప్సరసలు, కిన్నెరలు, కింపురుషులు, అండజాలు, స్వేదజాలు, ఉద్భిజాలు, ప్రాణులు, స్థావరములు (స్థిరంగా ఉండేవి) జంగమములు (స్థిరముగా ఉండనివి) మనుష్యులు పుట్టారు. ఆమెయే పరాశక్తి. హాది విద్యకాదివిద్య, పాదివిద్య. జగత్తులోని అన్ని వస్తువులు ఆమె. సర్వభూతములు ఆమె. అందుకే ఆ దేవి సర్వభూతస్వరూపిణి అనబడుతున్నది.

లోకంలో భక్తులకు భోగం కావాలంటే మోక్షాన్ని వదలుకోవాలి. అలాగే మోక్షం కావాలంటే భోగాలను వదలెయ్యాలి కాని

**శ్రీసుందరీసేవన తత్పరాణాం**
**భోగశ్చ మోక్షశ్చ కరస్త ఏవ ॥**

పరమేశ్వరిని అర్చించినవారికి వారి అర్హతను బట్టి భోగ, మోక్షాలు ప్రసాదిస్తుంది. అటువంటి ఆ దేవిని వర్ణించటానికి అలవికాదు అంటున్నారు దేవతలు.

శంకరభగవత్పాదులు సౌందర్యలహరిలోని 12వ శ్లోకంలో

**త్వదీయంసౌందర్యం తుహినగరికన్యే తులయితుం**
**కవీంద్రాః కల్పంతే కథమపి విరించి ప్రభృతయః ॥**

"తల్లీ నీ సౌందర్యాన్ని వర్ణించటానికి బ్రహ్మాది దేవతలకు కూడా సాధ్యం కాలేదు. మరి నిన్ను వర్ణించటానికి నేనెంతవాడిని" అంటారు.

అదే మాట ఇక్కడ దేవతలు చెబుతున్నారు. తల్లీ! నిన్ను వర్ణించటానికి మే మెంతవారము అంటున్నారు.

**సర్వస్య బుద్ధిరూపేణ - జనస్య హృది సంస్థితే ।**
**స్వర్గాపర్గదే! దేవి! - నారాయణి! నమోఽస్తుతే ॥**

సర్వజనుల యొక్క హృదయములందు బుద్ధిరూపమున నిలిచి ఉండి, స్వర్గము, మోక్షముకూడా ప్రసాదించే ఓ దేవీ! నారాయణీ నీకు నమస్కారము.

ఇక్కడ నుంచి అంటే 8వ శ్లోకం నుంచి నారాయణీస్తుతి ప్రారంభ మవుతున్నది.

దేవతలు అంటున్నారు : ఓ తల్లీ! సర్వజనుల హృదయాలలోను బుద్ధిరూపంలో ఉంటావు. కఠోపనిషత్తు లో నచికేతుడికి యమధర్మరాజు ఆత్మ విద్యను ఉపదేశిస్తూ "వేదాలన్నీ దేన్ని గురించి చెబుతున్నాయో, తపస్సు వల్ల దేన్ని పొందుతామో, బ్రహ్మచర్యాది వ్రతాలు, నియమాలు దేనికోసం ఆచరిస్తామో, అది 'ఓం' అనే పదము. ఇదే పరబ్రహ్మము.

ఓంకారాన్ని ఏ రూపంలో ఉపాసిస్తే సాధకుడు ఆ రూపం పొందుతాడు. బ్రహ్మ ప్రాప్తికి ఓంకారాన్ని ఆశ్రయించటమే మంచిది. ఆత్మకు చావుపుట్టుకలు లేవు. ఆత్మ తనంతతానుగా పుట్టినది. స్వయంభువు నాశరహితమైనది. శ్వాతమైనది. శరీరం మరణించినా ఆత్మ మరణించదు. ఆత్మ చంపేదీకాదు, చంపబడేదీ కాదు. ఆత్మ సూక్ష్మమైన వాటికన్నా ఇంకా సూక్ష్మమైనది. పెద్దవాటికన్న ఇంకా పెద్దది.

జీవియొక్క హృత్పద్మంలోనే ఆత్మ ఉంటుంది. జితేంద్రియుడు ఆత్మ గొప్పదనాన్ని గ్రహించి దుఃఖాలనుండి దూరమవుతాడు. ఆత్మ నిత్యము, సత్యము, సర్వవ్యాపకము అయినది. అటువంటి ఆత్మను గుర్తించగలిగిన వాడికి దుఃఖంలేదు" అంటూ ఆత్మ హృదయంలోనే ఉన్నది అని చెబుతాడు.

**పద్మకోశప్రదీకాశగ్ం హృదయం చాప్యథోముఖమ్**

కంఠానికి క్రింది భాగంలో, నాభికి పైపైపున 12 అంగుళముల ప్రమాణం గలిగి, అధోముఖంగా "ముకుళించి ఉన్న పద్మమువలె" హృదయమున్నది.

అథోనిష్ట్యా వితస్త్యాంతే నాభ్యాముపరి తిష్టతి
జ్వాలమాలాకులంభాతి విశ్వస్యాऽऽయతనం మహత్
సంతతగ్ం శిలాభిస్తులంబత్యాకోశసన్నిభమ్
తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం సర్వం ప్రతిష్ఠితమ్ ॥

ఆ హృదయకమలాన్ని ఆశ్రయించి, జ్వాలాసమూహంతో ప్రజ్వరిల్లుతూ, జీవులకు ప్రధానస్థానమై, అనేక నాడీసమూహాలకు ఆలంబనమై, హృదయాగ్రభాగంలో సూక్ష్మమైన కమలయొకటున్నది. దానిలోనే సర్వమూ ప్రతిష్ఠితమై ఉన్నది.

తస్యమధ్యేమహానగ్నిర్విశ్వార్చి ర్విశ్వతోముఖః
సోఽగ్రభుగ్విభజంతిష్టన్నాహారమజరః కవిః
తిర్యగూర్ధ్వ మథశ్శాయీ రశ్మయస్తస్యసంతతా
సంతాపయతి స్వందేహ మాపాద దలమస్తకః

దాని మధ్యలో అంతటా జ్వాలలు వ్యాపించే గొప్ప అగ్ని ఉన్నది. అదే జఠరాగ్ని. జీవి తీసుకున్న ఆహారాన్ని ఈ జఠరాగ్ని సమభాగాలుగా చేసి శరీరంలోని అన్ని భాగాలకు పంపుతుంది.

తస్యమధ్యేవహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః
నీలతో యద మధ్యస్థా ద్విద్యుల్లేఖేనభాస్వరా
నీవార సూకవర్తన్వీ పీతాభాస్వత్యణూపమా

ఈ జఠరాగ్ని నడుమ సూక్ష్మమైన అగ్నిశిఖపైకి ఎగుస్తూ ఉంటుంది. అది నీలమేఘము మధ్యన మెరుపులా ఉంటుంది. ధాన్యపుగింజయొక్క ములికి లాగా సూక్ష్మమై, పచ్చని వెలుగు కలిగి, అణుప్రమాణం కలిగి ఉంటుంది.

తస్యాశిఖాయా మధ్యేపరమాత్మా వ్యవస్థితః
సబ్రహ్మా సశ్శివ స్సహరిస్సేంద్ర సోఽక్షర పరమస్వరాట్

ఆ అగ్ని శిఖ మధ్యన పరమాత్మ ఉంటాడు. అతడే బ్రహ్మ. అతడే విష్ణువు, అతడే శివుడు, అతడే ఇంద్రుడు, నాశనము లేనివాడు. స్వయం ప్రకాశముగలవాడు.

కాబట్టి పరమాత్మ జీవుల హృదయంలో ఉంటాడు. అది కూడా ఏ రూపంలో అంటే బుద్ధిరూపంలో ఉంటాడు. కఠోపనిషత్తులో యముడు ఈ శరీరం రథం వంటిది. కర్మ ఫలాన్ని అనుభవించే జీవాత్మ దాని యజమాని. బుద్ధేసారథి. మనస్సే కళ్ళెం. ఇంద్రియాలే గుర్రాలు. విషయమే మార్గము అని చెబుతాడు.

పరమేశ్వరుడు హృదయంలో బుద్ధిరూపంలో ఉంటాడు. అందుకే అతన్ని 'మహాబుద్ధి' అంటారు. అతడు గొప్ప జ్ఞాని. ఏమాత్రమూ సంశయం లేనటువంటి మహత్తరమైన జ్ఞానమే స్వరూపముగా గలవాడు.

ఈ జ్ఞానము అన్ని దేశాలయందు, అన్ని కాలాలయందు, అన్ని స్వభావము లందు, అన్నింటియందు ఉంటే వాటిని నిగ్రహిస్తుంది. లోకంలో ఎక్కడ ఏమూల ఏం జరిగినా మరుక్షణంలో పరమేశ్వరుడికి అది తెలుస్తుంది. అతడికి సూర్యుడు, చంద్రుడు, పంచభూతాలు, కాలము, యముడు అనే తొమ్మిది మంది వేగులున్నారు. వీరు అన్ని విషయాలను ఆయనకు నివేదిస్తారు. అందుకనే పరబ్రహ్మ చెవులు లేకుండానే అన్నీ వినగలడు. కళ్ళు లేకుండానే అన్నీ చూడగలడు ఈ రకంగా జగత్తులో జరిగే అన్ని విషయాలను తెలుసుకుంటాడు కాబట్టే అతడు 'మహాబుద్ధి' అనబడుతున్నాడు. విష్ణుసహస్రంలో 173వ నామం ఇదే 'మహాబుద్ధిః'.

లలితాసహస్రంలో 223వ నామం 'మహాబుద్ధిః' గొప్పదైన బుద్ధి గలది. బుద్ధిని గనక భగవంతుడి వైపు మళ్ళించినట్లైతే ఇంకా తెలుసు కోవలసినది ఏమీ మిగలదు.

ఏదైనా ఒక విషయాన్ని తెలుసుకుని అందులో ప్రావీణ్యత సాధించిన వాడే బుద్ధిగలవాడైనప్పుడు అన్ని జీవుల యొక్క సమిష్టి రూపమైన ఆ పరమేశ్వరి మహాబుద్ధియే కదా?

బుద్ధి పరమేశ్వర స్వరూపము. మనస్సు శక్తి స్వరూపము. ఈ రెండూ అంటే మనస్సు, బుద్ధి ఎప్పుడూ కలిసే ఉంటాయి. దీనివల్లనే మానవుడు మంచి చెడూ ఆలోచించగలుగుతాడు. ఇందులో మనస్సు తక్కువ, బుద్ధి ఎక్కువ అయితే మహాబుద్ధి. అతడు మహాజ్ఞాని. పరమేశ్వర స్వరూపుడు.

అందుకే దేవతలు పరమేశ్వరిని బుద్ధిరూపంలో అందరి హృదయాల లోనూ ఉంటావు అంటున్నారు. దేవతలు ఇంకా అంటున్నారు 'స్వర్గాపవర్గదే దేవీ'. స్వర్గము, అపమార్గము రెండింటినీ ఇచ్చేది. లలితాసహస్రంలో 764వ నామం స్వర్గాపవర్గదా.

ఏదైతే దుఃఖముచేత ఇప్పుడుగాని, తరువాతగాని చెడదో, అభిలాషచేత ఏది పొందదగినదో అది 'స్వః' అనే పదముతో చెప్పబడుతోంది. స్వర్గము అంటే – నిత్యసుఖము. అపవర్గము అంటే – మోక్షము. ఈ రెండింటినీ ఇచ్చేది పరమేశ్వరి.

పరమేశ్వరి భోగాన్ని, మోక్షాన్ని కూడా ఇస్తుంది అని గతంలో చెప్పుకున్నాం. ఐహికసుఖాలు కావాలంటే మోక్షం కోరకూడదు. అలాగే మోక్షం కావాలంటే ఇహం ఉండరాదు. కాని పరమేశ్వరిని అర్చించిన వారికి ఇహపరాలు రెండూ ఒనగూడతాయి.

దేవతలకు శక్తి తక్కువ. వారు భోగభాగ్యాలు, సిరిసంపదలు ఇవ్వగలరు. అంతేకాని మోక్షాన్ని మాత్రం ఇవ్వలేరు. అది వారి పరిధికి మించినది. అనేక మంది రాక్షసులు బ్రహ్మను గురించి తపస్సు చేసి చావులేకుండా వరం కావాలి అన్నారు. కుదరదన్నాడు బ్రహ్మ. ఎందుకని? ఇక్కడ రాక్షసులు తపస్సు చేసింది కర్మబ్రహ్మను గురించి. అతని ఆయువు బ్రహ్మకల్పం. కల్పాంతాన అతడు కూడా పరబ్రహ్మలో లీనమైపోతాడు. అతడే శాశ్వతంకాదు. అలాటప్పుడు తనకు లేని శాశ్వతత్వాన్ని మనకు ఎలా ప్రసాదించగలుగుతాడు? అలాగే మిగిలిన దేవతలు కూడా. మోక్షం ఇవ్వగలిగిన శక్తి ఆ పరమేశ్వరికి ఒకర్తెకే ఉన్నది. ఎందుకంటే – ఆమె నిత్యమైనది, సత్యమైనది, శాశ్వతమైనది.

కర్మలు చేస్తే పుణ్యం వస్తుంది. సంకల్పం నెరవేరుతుంది. కాని మోక్షం మాత్రం రాదు. నిష్కామ్యకర్మచేస్తే ఫలితం రాదు. అది మోక్షమార్గం. ఈ రకంగా కర్మిష్టులకు స్వర్గసుఖాలను, అర్హులైన వారికి మోక్షాన్ని ఇస్తుంది పరమేశ్వరి. అందుచేత దేవతలు "స్వర్గము, అపవర్గము కూడా ప్రసాదించే ఓ నారాయణీ! నీకు నమస్కారము" అంటున్నారు.

ఇక్కడ దేవతలు పరమేశ్వరిని 'నారాయణీ' అని సంబోధిస్తున్నారు. లలితాసహస్రంలో 298వ నామం 'నారాయణి'. అలాగే విష్ణుసహస్రంలో 245వ నామం 'నారాయణః'. నారాయణుడు అంటే సర్వవ్యాపకుడు అని అర్థం.

**అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః**

సమస్త వస్తువులకు లోపల బయట అంతా వ్యాపించి ఉండేవాడు సర్వాంతర్యామి, సర్వవ్యాపి. బృహదారణ్యకోపనిషత్తులో 'అంతర్యామి' అంటే ఏమిటో వివరించమని ఉద్దాలకుడు యాజ్ఞవల్క్యుణ్ణి అడుగుతాడు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు ఆకాశంలో ఉంటాడు. ఆకాశం అతన్నెరగదు. ఆకాశమే అతని శరీరం. ఆకాశంలో ఉంటూనే ఆకాశాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి.

వాయువులో ఉంటాడు. వాయువు అతన్నెరగదు. వాయువే అతని శరీరం. వాయువులో ఉంటూనే వాయువును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. ఈ రకంగా సూర్యునిలో, చంద్రునిలో, నక్షత్రాలలో, స్థావర జంగమాత్మకమైన జగత్తులోని ప్రతివస్తువు నందు, ప్రతి ప్రాణియందు ఉంటాడు. అతడే అంతర్యామి. ఆత్మ అని చెబుతాడు. అందుకే పరమాత్మ సర్వవ్యాపి.

నారములు అంటే నిత్యము ఉపయోగించే వస్తువులు. వాటిని ఆశ్రయముగా గలవాడు. వాటియందు తాను ప్రవేశించి, అవి తనకు ఆశ్రయం అయ్యేట్లుగా ఉంటే వాడు. నారములకు స్థానమైనవాడు.

మహాప్రళయం సంభవించింది. అప్పుడు జగత్తు అంతా నాశనం అయిపోతుంది. ఒక్క అణువు కూడా మిగలదు. ఆ సమయంలో కర్మ పూర్తిగా క్షయం అయిన జీవులకు మోక్షం లభిస్తుంది. కాని కర్మ పరిపక్వం కాని జీవులకు ముక్తిలభించదు. ఆ జీవులు తమ కర్మను తమతో పాటుగా మూటకట్టుకుని మాయలో ప్రవేశిస్తాయి. అలాగే పంచభూతాలు కూడా. ముందుగా

భూమి – జలంలో కలిసిపోతుంది.

జలం – అగ్నిలో ఆవిరైపోతుంది.

అగ్ని - వాయులో లీనమైపోతుంది.

వాయువు - ఆకాశంలో లీనమైపోతుంది.

వీటన్నింటిని తనలో లీనం చేసుకున్న ఆకాశం కూడా మాయలో ప్రవేశిస్తుంది. ఈ రకంగా జగత్తునంతా తనలో కలుపుకున్న మాయ పరమేశ్వరునిలో లీనమవుతుంది. ఈ రకంగా ప్రళయకాలమందు జగత్తు నంతటినీ సూక్ష్మరూపంలో తనయందు ఉంచుకొని, దానికి స్థానమైనవాడు కాబట్టే పరమేశ్వరుడు 'నారాయణుడు' అనబడుతున్నాడు.

**విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ంహరిమ్**
**విశ్వమేవేదం పురుషస్త ద్విశ్వముపజీవతి**
**పతి విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్**
**నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ ॥**

విశ్వానికి అతీతుడు, విశ్వమే తానుగా అయినవాడు, నిత్యుడు, సర్వవ్యాపకుడు, విశ్వానికి జీవనాధారమైనవాడు, విశ్వపతి, విశ్వానికి ఈశ్వరుడు, శాశ్వతుడు, మంగళకరుడు, నాశనము లేనివాడు, తెలుసుకొన దగిన పరమాత్ముడు, విశ్వాత్ముడు, విశ్వపరాయణుడు అయిన నారాయణునికి నమస్కారము.

**నారాయణ పరంజ్యోతి ాత్మా నారాయణః పరః**
**నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః**
**నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః**

నారాయణుడే పరంజ్యోతి. పరమాత్మ స్వరూపుడు. అతడే పరబ్రహ్మ. అతడే పరతత్త్వము. ధ్యానము చేసే వాడు, ధ్యానము కూడా ఆ నారాయణుడే.

**యచ్చకించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా**
**అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః**
**అనంతమవ్యంయం కవిగ్ం సముద్రేంఽతం విశ్వశంభువమ్ ॥**

బ్రహ్మాండంలో ఈ స్వల్పమైన జగత్తు, మహదాకాశంలో వేరుగా కనిపించే ఘటాకాశం లాగా కనిపిస్తుంది. దానికి బయట, లోపలా అంతటా

నారాయణుడే వ్యాపించి ఉన్నాడు. అనంతుడు, నాశనము లేనివాడు అయిన ఈ దేవుడు సంసారసాగరమునుంచి విముక్తిని ప్రసాదించి సుఖం కలిగిస్తాడు. అతడే పరమేశ్వరుడు.

ఇక్కడ పరమేశ్వరి స్త్రీవాచ్యం కాబట్టి 'నారాయణీ' అనబడుతోంది. శుంభనిశుంభుల వధానంతరము దేవతలంతా ఆ చండికను పరమేశ్వరిగా గుర్తించి ధ్యానం చేస్తున్నారు. అందుకే 'నారాయణీ' అని సంబోధిస్తున్నారు.

**కలా కాష్ఠాదిరూపేణ పరిణామప్రదాయిని**
**విశ్వస్యోపరతౌ శక్తే నారాయణి నమోస్తుతే ॥**

కాష్ఠ, కలా మొదలైన రూపాలతో మార్పులు కలిగిస్తూ, జగత్తును నశింపచేయు శక్తిగల ఓ నారాయణీ నీకు నమస్కారము.

18 రెప్పపాట్ల కాలము 'కాష్ఠ'. 30 కాష్ఠల కాలము 'కల' అనబడుతుంది. పరమేశ్వరి కాలస్వరూపిణి.

| | |
|---|---|
| రెండు పరమాణువులు | - ఒక అణువు |
| మూడు అణువులు | - ఒక త్రసరేణువు |
| మూడు త్రసరేణువులు | - ఒకతృటి |
| వంద తృటులు | - ఒక వేధ |
| మూడు వేధలు | - ఒక లవము |
| మూడు లవములు | - ఒక నిమిషము |
| మూడు నిమిషములు | - ఒక క్షణము |
| ఐదు క్షణములు | - ఒక కాష్ఠ |
| 15 కాష్ఠలు | - ఒక లఘువు |
| 15 లఘువులు | - ఒక ఘుడియ |
| రెండు ఘుడియలు | - ఒక ముహూర్తము. |
| ఏడు ముహూర్తములు | - ఒకఝూము (2½ ఘుడియలు) |
| 8 ఝూములు | - ఒక రోజు |

15 రోజులు - ఒక పక్షము

2 పక్షము - ఒక మాసము

2 మాసములు - ఒక ఋతువు

3. ఋతువులు - ఒక అయనము

2 అయనములు - ఒక సంవత్సరము. (దేవతలకు ఒకరోజు)

(అదే సూర్యుడు 12 రాసుల యందు సంచరించే కాలము)

17,28,000 సంవత్సరాలు - కృతయుగము

12,96,000 సంవత్సరాలు - త్రేతాయుగము

8, 64, 000 సంవత్సరాలు - ద్వాపరయుగము

4,32,000 సంవత్సరాలు - కలియుగము

నాలుగు యుగాలు కలిస్తే - ఒక మహాయుగము.
(అది 4320000 సు॥లు)

12 మహాయుగాలు - ఒక మన్వంతరం.

14 మన్వంతరాలు - బ్రహ్మకు ఒక రోజు.

ఈ రకంగా కాలంలో మార్పులు కలిగిస్తూ జగత్తును నశింపచేసే శక్తి గల ఓ నారాయణీ నీకు నమస్కారము అంటున్నారు.

లలితాసహస్రంలో 857వ నామము 'కాష్టా'.

**సర్వమంగలమాంగల్యే - శివే సర్వార్థసాధికే**
**శరణ్యే త్ర్యంబకే దేవి! - నారాయణి నమోఽస్తుతే ॥**

తల్లీ శుభాలన్నింటిలోకీ శుభానివి, కోరిక లన్నింటినీ తీర్చేదానవు, శరణనన్నవారిని రక్షించే దానవు, త్రినేత్రవు, అయిన ఓ పరమేశ్వరీ నీకు నమస్కారము.

సర్వమంగళా - అన్ని రకాలయిన శుభములను ఇచ్చేద. దేవీ పురాణంలో

సర్వాణిహృదయస్థాని మంగళాని శుభానిచ ।
ఈప్సితాని దదాతీతే తేనసా సర్వమంగళా ॥

హృదయమందు గల సకల శుభములను ఒసగునది. కాబట్టి ఆమె సర్వమంగళ అనబడుతున్నది.

శోభనాని చ శ్రేష్టాని యాదేవీ దదతే హరే
భక్తానాం అర్తి హరిణీ తేనే యం సర్వమంగళా ॥

సౌభాగ్యచిహ్నమైన అన్ని రకాల శుభాలను కలుగజేసేది. భక్తుల కష్టాలను తీర్చి వారికి శుభాన్ని చేకూర్చేది.

బంగారము, అగ్ని, గోవు, బ్రాహ్మణుడు, నెయ్యి, సూర్యుడు, పుణ్యస్త్రీ, తులసీదళము, పుష్పము – ఇవన్నీ మంగళద్రవ్యాలు. వీటన్నింటినీ ప్రసాదించేది, అనగా దేశం ధనధాన్యాలతో భోగభాగ్యాలతో సుఖశాంతులతో, సకలైశ్వర్యాలతో, పుణ్యస్త్రీలతో ఎల్లప్పుడూ కళకళలాడుతుండేటట్లుగా చూసేది. వర్ణాశ్రమధర్మాలు పాటించేవారి కోరికలు తీర్చేది. అందరికీ శుభాన్ని చేకూర్చేది.

అందుకే ఆ దేవి సర్వమంగళ అనబడుతున్నది. లలితాసహస్రంలో 200 నామం సర్వమంగళా. మాంగల్యము – వివాహ సమయంలో వధువు మెడలోకట్టే వివాహం బంధం. అదే మాంగల్యం. అత్యంత శుభప్రదమైనది. సర్వమంగళమాంగల్యే – శుభాలన్నింటిలోకీ అత్యంత శుభప్రదమైనది ఆ పరమేశ్వరి అందుకే దేవతలు ఆమెను ఆ విధంగా సంబోధిస్తున్నారు.

శివే – శివుడు అంటే కాంతి, వశము అని అర్థము.

కాంతి అంటే – ఇచ్ఛ, కోరిక. పరమేశ్వరుని ఇచ్ఛా రూపమే పరమేశ్వరి. ఇచ్ఛారూపమైన శక్తికి ఆధారం శివుడు. కాబట్టి శివశక్తులకు భేదం లేదు.

శైవాగమాల ప్రకారము శివుడు

1. మనః ప్రవృత్తులకు సాక్షీభూతుడు.

2. ఆ ప్రవృత్తుల ఆవిర్భావానికి ముందున్నవాడు.

3. ప్రవృత్తులలో ఉన్నవాడు.

4. చిత్తవృత్తులకు కారకుడు.

5. సత్యము, నిత్యము, చిద్రూపి అయినవాడు.

6. అన్నిటికీ కారణము ఎవరో అతడే శివుడు.

జీవ ఈశత్వాదులు లేనివాడు. లోకాలకు మేలు కలిగించే వాడు శివుడు. అతడే పరమేశ్వరుడు. ఈ లక్షణాలన్నీ పరమేశ్వరి యందున్నాయి. అందుచేతనే ఆమె 'శివా' అని పిలువబడుతున్నది.

అన్నింటికీ మూలమైన వాడు శివుడు. విశ్వమంతా అతనిలో లీనమై ఉన్నది. అతడు పరిశుద్ధుడు. నిర్మలుడు. కైవల్యోపనిషత్తులో త్రిలోచనుడు, నీలకంఠుడు, ప్రశాంతుడు శివుడని చెప్పబడింది. లోకాలకు ఆధారభూతుడు. భక్తులకు అమృతాన్ని పంచి పెట్టేవాడు శివుడు. శివాశివులకు భేదం లేదు. లింగపురాణంలో

**యథాశివస్తథా దేవీ యథా దేవీ స్తథా శివః**

శివుడు ఎలా ఉంటే, దేవికూడా అలాగే ఉంటుంది. దేవి ఎలా ఉంటే శివుడలాగే ఉంటాడు. ఆ ఇద్దరికీ భేదం లేదు అని చెప్పబడింది.

**ఉమాశంకయోర్భేదో నాస్త్యేవ పరమార్థతః**
**ద్విధాసారూప మాస్థాయ స్థితఏకో సంశయః ॥**

ఉమాశంకరులకు భేదం లేదు. రూపాలు వేరుగా కనిపించినా అది ఒకటే.

శక్తి లేకుండా శివుడు ఉండడు. కాబట్టి శక్తికీ, శక్తిమంతుడైన శివునకూ భేదం లేదు. పరమాత్మే శివుడు. అతడే 'శివా' అని పిలువబడు తున్నాడు.

శివా అనే పరమేశ్వరి ముక్తిని ప్రసాదిస్తుంది. యోగులకు మోక్షాన్ని స్తుంది. లోకాలకు మేలు చేస్తుంది. అగ్నికి వేడిలాగా, సూర్యునికి కాంతి లాగా ఆ దేవి పరమేశ్వరునిలోనే ఉంటుంది. అందుకే పరమేశ్వరిని 'శివా' అని సంబోధిస్తున్నారు దేవతలు. లలితాసహస్రంలో 53వ నామం 'శివా'.

సర్వార్థసాధకే - అన్ని కోరికలను తీర్చే తల్లి. ఇహపరాలను ఒసగే దేవి. అటువంటి ఓ పరమేశ్వరీ! నీకు నమస్కారము అంటున్నారు.

**సృష్టిస్థితి వినాశానాం శక్తి భూతే సనాతని**
**గుణాశ్రయే గుణమయి నారాయణి నమోస్తుతే ॥**

ఈ జగత్తును సృష్టించే దానవు, పోషించే దానవు, లయంచేసే దానవు, నిత్యము సత్యము అయిన దానవు. త్రిగుణములకు నిలయమైన దానవు, త్రిగుణస్వరూపిణివి అయిన ఓ నారాయణీ నీకు సమస్కారము.

దేవతలు పరమేశ్వరిని స్తుతి చేస్తున్నారు ముందుగా సృష్టి స్థితి లయాలు చేసే శక్తి గల ఓ దేవీ! అంటున్నారు.

నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. అతడు బిందురూపంలో ఉన్నాడు. అయితే ఆ పరబ్రహ్మ బిందు రూపంలోనే ఎందుకున్నాడు? అని సందేహము. పరమాత్మ చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. కంటికి కనిపించేదంతా పరబ్రహ్మ స్వరూపమే. కంటికి కనిపించేది భూగోళం. ఈ భూగోళమంతా పరమేశ్వరమయం. భూమి గుండ్రంగా ఉన్నది. అందుచేతనే ఈ జగత్తంతా వ్యాపించిన పరమేశ్వరుడు కూడా బిందురూపంలోనే ఉన్నాడు.

పరమేశ్వరుడు పూర్ణస్వరూపుడు ఆ విధంగా పూర్ణస్వరూపంగలది బిందువొక్కటే. 360 డిగ్రీలు ఉంటే వృత్తం అవుతుంది. అంతకుమించి ఇంకొక డిగ్రీలేదు. అంతకన్న తక్కువ డిగ్రీలు ఉంటే అది వృత్తం కాదు. అందుచేత వృత్తము పూర్ణత్వానికి ప్రతీక. కాబట్టి పరమేశ్వరుడు బిందు రూపంలో ఉన్నాడు.

మహాప్రళయం జరిగినప్పుడు ఈ జగత్తంతా నశించిపోయింది. ఏమీ మిగలలేదు. అంతా శూన్యంగా ఉన్నది. అలా కొంతకాలం జరిగిన తరువాత, గతంలో ప్రళయం సంభవించినప్పుడు కర్మక్షయం కాకుండా తనలో కలసి ఉన్నటువంటి జీవరాశికంతటికీ కర్మక్షయం చేసి, వారికి మోక్షం కల్పిద్దామనే ఉద్దేశంతో పరమేశ్వరుడు సృష్టిచెయ్యటం మొదలుపెట్టాడు. ఈ రకంగా సృష్టి చెయ్యా లనుకున్నా వాడై ముందుగా తననుండి కొంత శక్తిని బయటకు పంపాడు. ఆ శక్తి నుంచే జగత్తంతా ఆవిర్భవించింది. ఈ జగత్తుకు జన్మ స్థానం ఆ శక్తే.

అదే త్రికోణము. మహాయోని, మహామాయ. పరమేశ్వరుడు శివుడు. ఆ మాయశక్తి. వారే శివశక్తులు. కామేశ్వరీ కామేశ్వరులు. ఇప్పుడు సృష్టి ఆరంభమైంది. సృష్టిక్రమంలో ముందుగా ఆవిర్భవించింది 'తమస్సు'. ఆ తరువాత మహత్సృష్టి జరిగింది. ఆ తరువాతనే అహంకారము వచ్చింది. దానినుండి తన్మాత్రలు వచ్చినాయి. వీటిలో జ్ఞానశక్తులు ఇమిడి ఉన్నాయి. తరువాత జన్మాత్రల స్థూలరూపాలయిన పంచభూతులు ఏర్పడ్డాయి. వీటిలో క్రియాశక్తులున్నాయి. ఈ జ్ఞానశక్తుల, క్రియాశక్తుల సమ్మేళనం చేతనే ప్రాణులు ఉద్భవించినాయి. ఈ రకంగా నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది.

రూపాత్మకమైన జగత్తు అంటే - అడవులు, కొండలు, పర్వతాలు, లోయలు, సముద్రాలతో కూడిన 84 లక్షల జీవరాశి. నామాత్మక జగత్తు అంటే - ముందుగా పరమేశ్వరస్వరూపమైన ఓంకారము. దానినుంచి అక్షర సమామ్నాయము. వాటి నుంచి పదాలు, మాటలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు, సంగీతము, సాహిత్యము అన్నీ వచ్చినాయి. ఇదే నామరూపాత్మక జగత్తు.

సృష్టి కార్యక్రమంలో పంచభూతాలు ఆవిర్భవించిన తరువాత పరమేశ్వరి త్రిమూర్తులను సృష్టించింది.

**సంహారశ్చ హరాయత్తంః ఉత్పత్తిర్భవనిర్మితా**
**రక్షాసుమృడ పంలగ్నా........**

సృష్టికార్యక్రమానికి - భవుడు ఇతడే బ్రహ్మ

రక్షణకు, స్థితికార్యక్రమానికి - మృడుడు. ఇతడే విష్ణువు సంహారానికి - హరుడు. ఇతడే రుద్రుడు. దేవీ భాగవతంలో మధుకైటభసంహారం తరువాత పరమేశ్వరి బ్రహ్మదేవునితో "నువు సృష్టికార్యక్రమం చెయ్యి. మిగిలిన వీరిద్దరూ అంటే విష్ణువు, రుద్రుడు నీకు సహాయకారులుగా ఉంటారు" అని చెబుతుంది. ఈ రకంగా సృష్టిస్థితి లయాలను త్రిమూర్తులకు ఒప్పగించింది ఆ పరమేశ్వరియే. లలితా సహస్రంలోని 264 నుంచి 269 వరకు గల నామాలలో

సృష్టికర్త్రీ బ్రహ్మరూపా - బ్రహ్మరూపంలో జగత్తును సృష్టిస్తుంది.

గోప్త్రీ గోవిందరూపిణి - విష్ణువురూపంలో లోకాలను రక్షిస్తుంది.

సంహారిణీ రుద్రరూపా - రుద్రుని రూపంలో జీవరాశి నంతటినీ సంహారం చేస్తుంది అని చెప్పబడింది. ఈ కారణం చేతనే దేవతలు ఓ తల్లీ ! సృష్టిస్థితిలయాలకు కారణం నువ్వే నంటున్నారు.గుణాలు మూడు సత్త్వ రజ స్తమోగుణాలు. వీటికి నిలయమైనది గుణత్రయానికి కారణభూతురాలు. ఈ మూడుగుణాలు ఆ పరమేశ్వరి నుంచే ఆవిర్భవించినాయి. లలితా సహస్రంలో 985వ నామం 'త్రిగుణాంబా'.

ఈ మూడు గుణాలు ఆమెనుంచే ఆవిర్భవించినా ఆమె ఆ గుణాలకు అతీతురాలు. గుణములను మించినది. గుణాలు ఏవీ లేనటువంటిది. గుణాలకు పూర్వమే ఉన్నది. గుణాలను కూడా సృష్టించినది. లలితా సహస్రంలో 961వ నామం 'గుణాతీతా'.

**శరణాగతదీనార్త - పరిత్రాణపరాయణే**
**సర్వస్యార్తిహరే! దేవి! - నారాయణి! నమోఽస్తుతే ॥**

శరణాగతులను దీనులను రక్షించే ఓ దేవీ, అందరి కష్టాలను బాపే ఓ పరమేశ్వరీ నీకు నమస్కారము.

పరమేశ్వరి అపారమైన కరుణా స్వరూపురాలు. దీనులు, ఆర్తత్రాణ పరాయణులను రక్షించటంలో ఆసక్తిగలది. తనను శరణుజొచ్చినవారిని కాచి రక్షిస్తుంది. వాళ్ళ కోరికలు బాధలు తీరుస్తుంది. ఎందుకంటే ఆమె శాశ్వత మైన ఐశ్వర్యము గలది. నిత్యమైన ఐశ్వర్యము గలది. అది సామాన్యమైన ఐశ్వర్యము కాదు మహదైశ్వర్యము. బ్రహ్మాదిదేవతలు ఆమె సింహాసనానికి కాళ్ళు. లక్ష్మీపార్వతులు వింజామరలు వీస్తుంటారు. ఇంద్రుడు తమ్మి పడగ అంటే ఉమ్మివేసే పాత్ర. ఈ రకంగా 14 లోకాలలోనూ ప్రసిద్ధులైన వారంతా ఎల్లవేళలా ఆమెను సేవిస్తూంటారు.

ఐశ్వర్యానికి ఫలితము కోరికలన్నీ తీరిపోవటం. ఇంక ఏ కోరికాలేక పోవటం. అటువంటి స్థితిలో ఉంటుంది పరమేశ్వరి. సంపూర్ణమైన ఐశ్వర్యాన్ని గలిగి తన భక్తులను, దీనులను, ఆర్తులను ఆదుకుంటుంది. వారి

బాధలు తీరుస్తుంది. వారికష్టాలను కడతేరుస్తుంది. వారికి ఏంకావాలో అది ఇస్తుంది. వారికి ఇహం కావాలంటే ఇహం, పరం కావాలంటే పరం ఇస్తుంది.

అంతేకాదు. ఆ దేవి తన భక్తులకు సుఖము, సంతోషము ఇస్తుంది. అందుకే దేవతలంతా ఆ పరమేశ్వరిని 'ఆర్త త్రాణపరాయణీ' అని సంబోధిస్తున్నారు.

**హంసయుక్తవిమానస్థే - బ్రహ్మాణీ రూపధారిణి**
**కౌశాంభఃక్షరికే! దేవి! - నారాయణి నమో உస్తుతే ॥**

బ్రహ్మదేవుని యొక్క శక్తి అయిన బ్రహ్మాణీ! హంసలు పూన్చిన విమాన మెక్కి దర్భలతో మంత్రపూరిత జలాన్ని జల్లే ఓ దేవీ! నీకు నమస్కారము.

ఇక ఇక్కడు నుంచి సప్తమాతృకల రూపంలో ఉన్న పరమేశ్వరిని ధ్యానిస్తున్నారు. ముందుగా బ్రహ్మాణి. బ్రహ్మ యొక్క శక్తి బ్రహ్మాణి. సృష్టి కాలంలో పరబ్రహ్మనుంచి కొంత శక్తి బయటకు వచ్చింది. అదే త్రికోణము. పరమేశ్వరి స్వరూపము. దాని వల్లనే ఈ సృష్టి జరిగింది.

ఈ జగత్తును సృష్టించటానికి పరమేశ్వరి ముందుగా బ్రహ్మను సృష్టించింది. గతజన్మలో మహాపుణ్యకార్యాలు చేసినవాడు ఈ బ్రహ్మ పదవికి అర్హుడు.

పరమేశ్వరి సరస్వతిని బ్రహ్మకు తోడుగా ఇచ్చింది. వీరిద్దరూ సృష్టికార్యక్రమం చూస్తుంటారు.

బ్రహ్మ రజోగుణ ప్రధానుడు. 14 మన్వంతరాలు బ్రహ్మకు ఒకరోజు. అటువంటివి 100 సంవత్సరాలు బ్రహ్మ ఆయువు. అదే బ్రహ్మకల్పము. తన ఆయువు తీరగానే ఆ బ్రహ్మకుడా పరబ్రహ్మలో లీనమైపోతాడు.

ఇతడు మహాజ్ఞాని. పరమేశ్వరి మొదటగా వేదాలను బ్రహ్మకిచ్చింది. ఇతనికి నాలుగు చేతులు, నాలుగు శిరస్సులు ఉంటాయి. అయితే ఐదు శిరస్సులుంటాయని, వాటిలో ఒకదానిని రుద్రుడు నరికివేశాడని పురాణాలు చెబుతున్నాయి. ఇతడు శ్వేతాంబరధారి. అంటే తెల్లని వస్త్రాలు కట్టుకుం

టాడు. తెలుపురంగులో ఉంటాడు. నాలుగు చేతులయందు పుస్తకము అక్షమాల, జ్ఞానముద్ర కమండలము ధరించి ఉంటాడు. వీటిలో పుస్తకము వేదవేదాంగాలకు, పురాణాలకు, ఇతిహాసాలకు, సాహిత్యానికీ ప్రతీక. అక్షమాల అంటే అక్షరమాల. అక్షరసమామ్నాయానికి ప్రతీక. అందుకే బ్రహ్మదేవుని శక్తి అయిన బ్రాహ్మీదేవత హంసలు పూన్చిన విమాన మెక్కి, దర్భలతో కమండలంలోని మంత్రపూరిత జలాన్ని చల్లుతున్నది. అటువంటి బ్రాహ్మీదేవతకు నమస్కారము.

**త్రిశూలచంద్రాహిధరే ! - మహావృషభవాహిని !**
**మాహేశ్వరీస్వరూపేణ - నారాయణి ! నమోఽస్తుతే ॥**

మాహేశ్వరి రూపం ధరించి, చేతియందు త్రిశూలము, శిరస్సు మీద చంద్రవంక, మెడలో సర్పాలను ధరించి ఎద్దునెక్కి వచ్చిన ఓ నారాయణీ ! నీకు నమస్కారము.

పరమేశ్వరి పంచకృత్యపరాయణ. పంచకృత్యాలు అంటే సృష్టి, స్థితి, సంహారము, తిరోదానము, అనుగ్రహము. వీటిలో నాల్గవది తిరోదానము. లలితాసహస్రంలో 270, 271 నామాలు తిరోదానకరీ, ఈశ్వరీ. తిరోదానము అంటే - ఆచ్ఛాదనము. సంపూర్ణనాశనము. అణువులను కూడా ప్రకృతిలో లయం చెయ్యటము. ఇది శుద్ధ సత్వగుణ ప్రధానుడైన ఈశ్వరుని పని. అటువంటి ఈశ్వరుని కన్న వేరైనది కానిది.

మాయను వశమునందుంచుకొన్నది. మహేశ్వరుని శక్తి కాబట్టి ఈమె 'మహేశ్వరీ' అని పిలువబడుతుంది. ఈ దేవి శివుని వాహనమైన వృషభాన్ని అధిరోహించి ఉంటుంది. నాగాభరణము, శిరస్సున చంద్రవంకలతో, చేతియందు త్రిశూలాన్ని ధరించి ఉంటుంది. అటువంటి మాహేశ్వరుని శక్తి 'మాహేశ్వరీ' రూపంలో ఉన్న ఓ నారాయణీ! నీకు సమస్కారము.

**మయూరకుక్కుటవృతే! - మహాశక్తిధరేఽనఘే**
**కౌమారీరూపసంస్థానే! - నారాయణి! నమోఽస్తుతే ॥**

కౌమారీ రూపం ధరించి నెమలి, కోడి వెంటరాగా, పెద్దబల్లెము చేత ధరించి వచ్చిన ఓ కుమారస్వామి శక్తియైన కౌమారీ నీకు నమస్కారము.

వజ్రాంగుని కుమారుడు తారకాసురుడు. బ్రహ్మను గురించి ఘోర తపస్సు చేసి ఇంతవరకు సృష్టిలో ఉన్న ఏ ప్రాణివల్లా మరణం లేకుండా వరం పొందాడు. వరబలంతో పేట్రేగిపోయి దేవతలను, మునులను, హింసించటం ప్రారంభించాడు. ముల్లోకాలు జయించాడు. దేవతలు అడవుల పాలైనారు. యజ్ఞ యాగాదులు సాగనివ్వటం లేదు. ఇటువంటి స్థితిలో దేవతలు, ఋషులు అందరూ కలిసి శ్రీమన్నారాయణుని సలహామీద హిమాలయా లకు పోయి పరమేశ్వరిని పరిపరివిధాల ప్రార్థించారు.

చైత్రశుద్ధనవమి, శుక్రవారం ఆ దేవి వారికి ప్రత్యక్షమై తాను హిమవంతుని ఇంట హైమవతిగా జన్మిస్తానని, పార్వతికీ ఈశ్వరునికీ వివాహం జరిపించమనీ, వారిద్దరికీ పుట్టినవాడు తారకుని సంహరిస్తాడనీ తెలియజేసింది. పరమేశ్వరి చెప్పినట్లుగానే పార్వతీపరమేశ్వరుల వివాహం జరిగింది. వారి సంతానమే కుమారస్వామి. ఇతడు పుట్టినప్పుడు కృత్తికలు ఆరుగురు అతనికి పాలివ్వటానికి వచ్చారు. ఆ బాలుడు ఆరుముఖాలు దాల్చి కృత్తిక లందరి దగ్గరా పాలు త్రాగాడు. అందుకనే ఇతడు షణ్ముఖుడు. ఇతని వాహనం నెమలి. ఆయుధం బల్లెం. ఇతడు దేవసేనాని. తారకాసురుని వధించినవాడు. మహావీరుడు. అతని శక్తి 'కౌమారీ'. అందుకే కౌమారీ రూపంలో ఉన్న ఓ నారాయణీ నీకు నమస్కారము అంటున్నారు.

**శంఖచక్రగదాశార్‌ఙ్గ - గృహీతపరమాయుధే**
**ప్రసీద వైష్ణవీరూపే! - నారాయణి! నమోఽస్తుతే ॥**

శంఖము, చక్రము, గద, ధనుస్సు ధరించిన విష్ణువు యొక్క శక్తి అయిన వైష్ణవీ నీకు సమస్కారము.

**విష్ణోరియం వైష్ణవీ విష్ణుమూర్తి యొక్క శక్తి.**
**శంఖ చక్ర గదాన్ ధత్తే విష్ణుమాతా తథాఽరిహా**
**విష్ణురూపాఽథవా దేవీ వైష్ణవీ తేన గీయతే ॥**

వైష్ణవి అంటే నాలుగు రకాల అర్థాలున్నాయి.

1. శంఖము, చక్రము, గద ధరించినది
2. విష్ణువునకు తల్లి
3. శత్రువులను చంపునది
4. విష్ణురూపము గలది.

ఈమె 'వైష్ణవీ' అనబడుతోంది. పరమేశ్వరి విష్ణువు యొక్క శక్తి. విష్ణువు రూపంలో రక్షిస్తున్నది. స్థితి కారకురాలు. సర్వవ్యాపి. శంఖ చక్రములు ధరించి గరుడవాహనారూఢయైనది. లలితాసహస్రంలో 890 వ నామం 'వైష్ణవీ'. ఈమె చేతుల యందు శంఖము, చక్రము, గద, ధనుస్సు. ఖడ్గము ధరించినది. ఇవన్నీ విష్ణుమూర్తి యొక్క ఆయుధాలు. విష్ణుసహస్రసంలోని 107వ శ్లోకంలో

**శంఖభృన్నందకీ చక్రీశార్ఙ్గధన్వాగదాధరః**
**రథాంగపాణి రక్షోభ్యః సర్వప్రహరణాయుధః**

విష్ణుమూర్తి యొక్క చేతులయందు -

పాంచజన్యము - అనే శంఖము

నందకము - అనే ఖడ్గము

సుదర్శనము - అనే చక్రము

శార్ఙ్గము - అనే ధనుస్సు

కౌమోదకి - అనే గద ధరించినవాడు.

ఈ రకంగా దుష్టశిక్షణ, శిష్టరక్షణ చెయ్యటానికి **సర్వప్రహారణాయుధః** - అన్ని రకాలయిన ఆయుధాలను ధరించినవాడు. అటువంటి విష్ణుమూర్తి శక్తి అయిన వైష్ణవి రూపంలో ఉన్న నారాయణీ నీకు నమస్కారము.

**గృహీతోగ్రమహాచక్రే! - దంష్ట్రోద్ధృతవసుంధరే**
**వరాహరూపిణి! శివే! - నారాయణి! నమోஉస్తుతే ॥**

భయంకరమైన చక్రాయుధము ధరించి, తన కోరలతో సముద్రములో మునిగిపోయిన భూమిని రక్షించిన వారాహీరూపాన్ని ధరించిన ఓ నారాయణీ నీకు నమస్కారము.

జగత్తంతా పరమేశ్వరమయం. అతని వల్లనే అన్నీ పుడుతూ ఉన్నాయి. అతని నుండే హిరణ్యగర్భుడు ఆవిర్భవించాడు. దానినుంచే ఆకాశము, వాయువు, తేజస్సు, జలము వచ్చినాయి. జలము నుంచి ఒక అండము పుట్టింది. అది హిరణ్మయము. ఈ అండమే ప్రజాపతి అని వేదాలు

చెబుతున్నాయి. ఈ అండము నుంచి వచ్చిన మావిజలము నందు పడి మేరు పర్వతమైంది. భూమి ఏర్పడింది. అనేక వేల యోజనాల విస్తీర్ణము గలిగి, పర్వతాలతో, అడవులతో బరువెక్కిన భూమి ఆ విష్ణుతేజస్సును మోయలేక క్రిందికు క్రుంగిపోయి పాతాళం చేరిపోయింది. అలా క్రిందికి దిగిపోయిన భూమి శ్రీహరిని చూసి అతన్ని పరిపరివిధముల ప్రార్థించి సముద్రంలో మునిగిపోతూ తనను రక్షించమని వేడుకున్నది. ఆమె ప్రార్థనను మన్నించిన వాడై శ్రీమహావిష్ణువు యజ్ఞవరాహమై తనకోరలతో నీటమునిగిన భూమిని పైకి తెచ్చాడు. విష్ణుసహస్రంలో 538వ నామం 'మహావరాహః'. ఆ యజ్ఞ వరాహమే ఆదివరాహము. దానియొక్క శక్తే 'వారాహి'.

భయంకరమైన రూపంగల ఆ వారాహీ దేవత రూపంలో ఉన్న ఓ పరమేశ్వరీ నీకు నమస్కారము అంటున్నారు దేవతలు.

**నృసింహరూపే ణోగ్రేణ - హంతుం దైత్యాన్ కృతోద్యమే**
**త్రైలోక్యత్రాణసహితే! - నారాయణి! నమోஉస్తుతే ॥**

నృసింహరూపంలో రాక్షస సంహారం చేస్తూ ముల్లోకాలను రక్షించే ఓ నారాయణీ నీకు నమస్కారము.

జయవిజయులు వైకుంఠంలో విష్ణుమూర్తికి ద్వారపాలకులుగా ఉండేవారు. ఒకనాడు సనకసనందనాదులు విష్ణుదర్శనార్థం అక్కడికి వచ్చారు. ఆ సమయంలో శ్రీమహావిష్ణువు లక్ష్మీసమేతుడై ఏకాంతమందిరంలో ఉన్నాడు. అందుచేత ద్వారపాలకులైన జయవిజయులు మహర్షులను లోపలికి అనుమతించలేదు. దాంతో కోపగించిన మహర్షులు జయవిజయు లను భూలోకంలో పుట్టి విష్ణువుకు దూరంగా ఉండమని శపించారు. అది భరించలేని జయవిజయులు విష్ణుమూర్తి పాదాలు పట్టుకున్నారు. "మహర్షుల మాట వ్యర్థం కాదు కాబట్టి భక్తితో ఏడు జన్మలు ఎత్తుతారా? విరోధంతో మూడు జన్మలెత్తుతారా? నిర్ణయించుకోండి" అన్నాడు శ్రీమహావిష్ణువు. "ఏడు జన్మలకాలం మేం ఉండలేము. విరోధంతోనైనా సరే మూడు జన్మలలోనే తిరిగి వస్తాము" అన్నారు జయవిజయులు.

మొదటి జన్మగా కశ్యపుని ఇంట దితి గర్భాన హిరణ్యకశప, హిరణ్యాక్షులుగా జన్మించారు. హిరణ్యాక్షుడు భూమిని చాపగా చుట్టి

సముద్రంలో పారేశాడు. శ్రీమహావిష్ణువు వరాహరూపంలో అతన్ని సంహరించాడు. తన సోదరుని మరణవార్త విన్న హిరణ్యకశ్యపుడు ఎంతగానో దుఃఖించాడు. బ్రహ్మను గురించి ఘోరమైన తపస్సుచేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. అందరి రాక్షసులకు మల్లేనే "చావు లేకుండా వరం కావాలి" అన్నాడు రాక్షసుడు. ఆ మాటలు విన్న బ్రహ్మ దేవుడు "నేనే శాశ్వతంకాదు. నాకు లేనిది నీకెలా ఇవ్వగలను? అందుచేత ఇంకేదైన వరం కోరుకో" అన్నాడు బ్రహ్మ. బాగా ఆలోచించి "మనిషి వల్లగాని, మృగం వల్లగాని, ఇంటి లోపల, ఇంటిబయటగాని, ఆయుధంతో గాని, ఆయుధం లేకుండాగాని, పగలుగాని, రాత్రిగాని నాకు మరణం సంభవించరాదు" అని అడిగాడు హిరణ్యకశ్యపుడు. తథాస్తు అన్నాడు విధాత.

వరబల గర్వితుడైన హిరణ్యకశ్యపుడు రాక్షససేనలను వెంటపెట్టుకుని విజృంభించాడు. ముల్లోకాలను జయించాడు. ఇతని ధాటికి ఆగలేక దేవతలు స్వర్గం వదిలి పారిపోయారు. చివరకు విష్ణువుకూడా ఇతడి కంటికి కనిపించకుండా దాక్కున్నాడు. హిరణ్యకశ్యపుడు తన రాక్షసకృత్యాలను ఉధృతం చేశాడు. యజ్ఞయాగాదులను మాన్పించాడు. దేవతలను, మునులను, ఋషులను, సత్పురుషులను హింసించాడు.

అతని కుమారుడైన ప్రహ్లాదుడు మాత్రం గొప్ప విష్ణుభక్తుడు. కుమారుణ్ణి పిలిచి విష్ణుభక్తి మానమన్నాడు. ప్రహ్లాదుడు వినలేదు. అనేక రకాలుగా హింసించాడు తండ్రి. కొండలనుంచి త్రోయించాడు. సముద్రంలో పడేయించాడు. పాములతో కరిపించాడు. ఏనుగులతో త్రొక్కించాడు. అయినా హరి నామ సంకీర్తనం మాత్రం మానలేదు కుమారుడు. చివరకు విసిగి పోయిన హిరణ్యకశ్యపుడు 'ఎక్కడ ఉన్నాడు! హరి?' అన్నాడు. 'ఎక్కడైనా ఉన్నాడు. నీలో, నాలో, అన్నింటిలోనూ ఉన్నాడు' అని సమాధానమిచ్చాడు ప్రహ్లాదుడు. 'అయితే ఈ స్తంభమునందు చూపగలవా?' అంటూ చేతిలోని గదతో ఎదురుగా ఉన్న స్తంభాన్ని ఒక్క దెబ్బవేశాడు. ఆ దెబ్బతో స్తంభం ఫెళఫెళార్భాటాలతో రెండు ముక్కలయింది. అందులో నుంచి భయంకరంగా గర్జిస్తూ అటుమనిషి, ఇటుమృగము కానటివంటి విచిత్రమైన ఆకారం బయటకు దూకి, హిరణ్యకశ్యపుడి పైబడి తన గోళ్ళతో రాక్షసుని దేహం కాస్తా చీల్చి చెండాడింది. ఆ భయంకరమైన ఆకారమే 'నృసింహావ

తారము'. తలమాత్రం సింహం మిగిలిన శరీరము మానవుడు. అందుకే 'నారసింహుడు' అనబడ్డాడు. అతని శక్తి నారసింహి. అందుకే దేవతలు 'నారసింహి రూపంలో ఉన్న ఓ పరమేశ్వరీ! నీకు నమస్కారము' అంటున్నారు.

**కిరీటిని మహావజ్రే! - సహస్రనయనోజ్జ్వలే**
**వృత్రప్రాణహరే చైంద్రి! - నారాయణి! నమోఽస్తుతే ॥**

కిరీటము, వజ్రాయుధము ధరించి, వేయి కనులతో ప్రకాశిస్తూ వృత్రాసురుని సంహరించిన ఇంద్రుని స్వరూపంలో ఉన్న నారాయణీ నీకు నమస్కారము.

ఇంద్రుడు - దేవతలకు రాజు. తూర్పుదిక్కుకు అధిపతి. 'ఇంద్రుడు' అనేది పేరు కాదు. అది ఒక పదవి. భూలోకంలో నూరు అశ్వమేధాలు చేసినవాడు ఇంద్రపదవికి అర్హుడు. ఇతనికి ఐరావతము అనే ఏనుగు, ఉచ్చైశ్రవము అనే గుర్రము వాహనాలుగా ఉన్నాయి. ఈ ఏనుగు నాలుగు దంతాలు కలిగి తెలుపురంగులో ఉంటుంది. ఇతని ఆయుధం వజ్రాయుధం. చ్యవన మహర్షి యొక్క కుమారుడైన 'దధీచి' యొక్క వెన్నెముకతో చేయబడినది ఈ వజ్రాయుధం. మహాశక్తివంతమైనది.

త్వష్ట ఒక ప్రజాపతి. అతడికి ఇంద్రుడి మీద చాలాకోపం వచ్చింది. అందుకని ఇంద్రుని సంహరించటానికి తన తపశ్శక్తితో మూడు తలలు గల కుమారుని సృష్టించాడు. అతడే విశ్వరూపుడు. ఇంద్రుడు ఇతన్ని కాస్తా చంపేశాడు.

విశ్వరూపుని మరణవార్త విన్న త్వష్ట మితిమీరిన కోపంతో ఇంద్రుని సంహరించటానికి ఇంకొక కుమారుని సృష్టిస్తానంటూ హోమం చెయ్యటం మొదలుపెట్టాడు. హోమం పూర్తయ్యేసరికి హోమగుండం నుంచి అసమాన తేజస్సంపన్నుడైన కుమారుడు ఉద్భవించాడు. అతడికి వృత్రుడు అని పేరు పెట్టాడు త్వష్టప్రజాపతి. 'కుమారా! నువ్వెళ్ళి ఇంద్రుని తల నరికిరా!' అన్నాడు. రాక్షస వీరులను చేరదీసి ఇంద్రునితో యుద్ధానికి బయలు దేరాడు వృత్రాసురుడు. దూతల ద్వారా ఈ వార్త విన్న ఇంద్రుడు స్వర్గం వదలి పారిపోయాడు.

బ్రహ్మను గురించి ఘోరమైన తపస్సు చేశాడు వృత్రుడు. బ్రహ్మ ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. దానికి వృత్రుడు "దేవా ! ఇనుము మొదలైన లోహాలతోగాని, కర్రలతోగాని, ఎండినమట్టితోగాని. తడిసినవాటితోగాని, అస్త్రాలతో గాని, శస్త్రాలతో గాని నాకు చావు రాకూడదు" అన్నాడు. సరేనన్నాడు బ్రహ్మ.

ఈ విధంగా వరబలగర్వితుడైన వృత్రాసురుని చేతిలో దేవతలు నానాబాధలూ పడుతూ, చేసేదిలేక చివరకు విష్ణుమూర్తిని శరణుజొచ్చారు. విష్ణుమూర్తి సలహా మేరకు వృత్రాసురునితో సంధి చేసుకున్నారు. అతనితో స్నేహంగా ఉంటున్నాడు ఇంద్రుడు.

ఒకరోజు సంధ్యాసమయాన మిత్రులిద్దరూ సముద్రతీరాన వ్యాహ్యాళికి వెళ్ళారు. అది పగలూకాదు రాత్రీ కాదు. సంధ్యాసమయం. వృత్రాసురుణ్ణి ఇప్పుడు సంహరించవచ్చు, అని ఆలోచించి హరిని ప్రార్థించాడు ఇంద్రుడు. వెంటనే విష్ణుశక్తి ఇంద్రుని వజ్రాయుధంలో ప్రవేశించింది. ఇంద్రుడు పరమేశ్వరిని ప్రార్థించాడు. ఆ దేవతాశక్తి కూడా వజ్రాయుధంలో వచ్చి చేరింది. సముద్రపు నురగ తడీకాదు పొడీకాదు. వ్రజాయుధాన్ని ఆ నురగలో ముంచి ఒక్కదెబ్బతో వృత్రుని తల తెగనరికాడు. ఈ రకంగా వృత్రాసురుని సంహరించి లోకాలను రక్షించినవాడు ఇంద్రుడు.

అటువంటి ఇంద్రుని శక్తి అయిన ఐంద్రీ స్వరూపంలో ఉన్న నారాయణీ నీకు నమస్కారము.

**శివదూతీస్వరూపేణ - హతదైత్యమహాబలే**
**ఘోరరూపే! మహారావే! - నారాయణి! నమోఽస్తుతే॥**

భయంకరాకారముతో మహాగర్జనలు చేస్తూ శివదూతీ స్వరూపంలో రాక్షససంహారం చేసిన నారాయణీ నీకు నమస్కారము.

శివుని దూతగా పొందినది శివదూతి. భక్తులు పరమేశ్వరుని చేరాలి అంటే శివుని లాగా విరాగులు కావాలి. సర్వాన్నీ త్యాగం చెయ్యాలి. జీవాత్మ పరమాత్మను చేరాలంటే వైరాగ్యం కావాలి! అని చెప్పటానికే ఇక్కడ శివుడు దూతగా వెళ్ళాడు. ఆ శివదూతి రూపంలో రాక్షససంహారం చేసిన నారాయణీ నీకు నమస్కారము అంటున్నారు దేవతలు.

షోడశనిత్యలలో ఏడవనిత్య శివదూతి. పుష్కరక్షేత్రంలో ఉన్న దేవత శివదూతి. లలితా సహస్రంలో 405వ నామం శివదూతి.

**దంష్ట్రాకరాలవదనే! - శిరోమాలావిభూషణే**
**చాముండే! ముండమథనే! - నారాయణి! నమోఽస్తుతే ॥**

భయంకరమైన కోరలతో అతిభయంకరమైన ముఖము గలిగి, పుర్రెలదండను ధరించి చండముండాసురులను వధించిన చాముండా స్వరూపంలో ఉన్న పరమేశ్వరీ నీకు నమస్కారము.

కృశించినదేహము గలది, నల్లని శరీరముగలది, భయంకరమైన కోరలతో, విరబోసిన చింపిరిజుట్టుతో, ఎర్రని కళ్ళతో పులిచర్మ పుర్రెలమాల ధరించి చూసే వారికి భయాన్ని కలిగించే చండముండలను సంహరించిన చాముండా నీకు నమస్కారము అంటున్నారు.

**యాదేవీ మధుకైటభ ప్రశమనీ యా మాహిషోన్మూలినీ**
**యాధూమ్రేక్షణ చండముండ మదనీ యారక్తబీజాశనీ**
**యాశుంభాది నిశుంభదైత్యశమనీయాసిద్ధలక్ష్మీః పరా**
**సాచండీ నవకోటిశక్తి సహితా మాంపాతు విశ్వేశ్వరీ !**
**మాతర్మే మధుకైటభఘ్ని మహిష ప్రాణాపహారోద్యమే**
**హేలానిర్మిత ధూమ్రలోచన వధే హే చండముండార్థినీ**
**విశ్వేషీకృత రక్త బీజదనుజే నిత్యేని శుంభాపహే**
**శుంభ ధ్వంసిని సంహరాశు దురితం దుర్గేనమస్తేఽబికే ॥**

అటువంటి చండీ స్వరూపయైన పరమేశ్వరికి నమస్కారము అంటున్నారు.

**లక్ష్మీ! లజ్జే ! మహావిద్యే ! - శ్రద్ధే పుష్టి ! స్వధే ! ధ్రువే !**
**మహారాత్రి ! మహామాయే ! - నారాయణి ! నమోఽస్తుతే॥**

లజ్జ, తుష్టి, పుష్టి, మతి, ధృతి వాటిన్నింటి స్వరూపము నీవే. ఓ జగజ్జననీ నీకు నమస్కారము అంటూన్నారు దేవతలు.

సంపదలిచ్చే లక్ష్మీ దేవతవు నీవే. నీవే లజ్జ, పుష్టి అన్ని రూపాలలోనూ ప్రకాశిస్తున్న ఓ పరమేశ్వరీ మమ్ములను రక్షించవలసినది.

22వ శ్లోకంలో చెబుతున్నారు'లక్ష్మీ లజ్జే మహావిద్యే' నీవే లక్ష్మీదేవివి సంపదలిచ్చేదానవు. నీవే సంపదవు.సంపద అంటే ఇహానికి సంబంధించినది. సిరి సంపదలు, భోగభాగ్యాలు ఇవన్నీ ఈ లోకంలో సుఖించటానికి ఉపయోగిస్తాయి. వాటిని సమకూర్చే దేవి. అంటే - ఇహాన్ని ఇచ్చేది. అలాగే నీవే మహావిద్యవు. మహావిద్య అంటే శ్రీవిద్యా సంప్రదాయంలో 'వనదుర్గాపంచశతి' అని ఉన్నది. దీన్ని 'మహావిద్య' అంటారు. ఇందులో మొత్తం 500 మంత్రాలుంటాయి. ఇది ఉత్తమోత్తమమైన కార్యసాధనం. మహా విద్యను పారాయణ చేసినట్లైతే ఎంతటి కష్టమైన పనులైనా జరుగుతాయి. ఇది కామ్యవిద్య. అలాగే మహావిద్య అంటే - పరావిద్య అని అర్థం. ముండకోపనిషత్తులో అంగీరసుడు శౌనకుడికి వివరిస్తాడు. "వేదంలో రెండు రకాల విద్యలున్నాయి. 1. అపరావిద్య 2. పరావిద్య.

అపరావిద్య అనేది లోకంలో బ్రతకటానికి పనికి వస్తుంది. శిక్ష, వ్యాకరణము, జ్యోతిషము, ఛందస్సు, వేదాధ్యయనము, శాస్త్రపాండిత్యము మొదలైనవన్నీ దీనిలో భాగాలే. అపరావిద్య నభ్యసించినవారు సిరిసంపదలు, భోగభాగ్యాలు, ఉన్నత పదవులు, సన్మానాలు, సత్కారాలు పొందుతారు.

పరావిద్య అనేది బ్రహ్మవిద్య. పరబ్రహ్మను గురించి వివరించేది. సృష్టికి పూర్వము ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. అటువంటి శూన్యమైన జగత్తును పరబ్రహ్మ ఆవరించి ఉన్నాడు. అంటే జగత్తంతా బ్రహ్మమయము. ఆ పరబ్రహ్మ సృష్టి చెయ్యాలని సంకల్పించి తనలో నుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. అదే మహాయోని. దానినుంచే ఈ జగత్తంతా ఉద్భవించింది. జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. సాలెపురుగు ఏ సహాయమూ లేకుండా తననోటిలో నుంచి దారాన్ని సృష్టించి, మళ్ళీ దాన్ని తననోటిలోకే తీసుకుంటుంది. అలాగే పరమాత్మ ఎవరి సాయము లేకుండా ఈ జగత్తును సృష్టించి చివరకు తనలోనే లీనం చేసుకుంటాడు. ఈ జగత్తులో ఉన్నది ఒక్కటే. అదే పరమశక్తి. పరామాత్మశక్తి. ఈ విషయం తెలుసుకున్నవాడు మృత్యుంజయుడు. ఇది పరావిద్య.

ఈ విధంగా పరావిద్య, అపరావిద్య రెండూ నీవే. దేవతలకు ఆహుతులిచ్చే స్వాహామంత్రము, పితృదేవతలకు తర్పణాలిచ్చే స్వధామంత్రము రెండూ నీవే. లజ్జ, తుష్టి, పుష్టి అన్నీ నువ్వేనమ్మా. ఓ తల్లీ కల్పాంతమందు కాళరాత్రివి నువ్వే. ప్రళయకాలంలో మహారాత్రివి నువ్వే. భయంకరమైన మోహరాత్రివి నువ్వే. అటువంటి ఓ పరమేశ్వరీ, నారాయణీ నీకు నమస్కారము.

**మేధే! సరస్వతి! వరే! – భూతి! బాభ్రవి! తామసి**
**నియతే త్వం ప్రసీ దేశే – నారాయణి! నమోఽస్తుతే ॥**

ధారణశక్తి గల బుద్ధిని నువ్వు. సరస్వతివి, సంపదవు, శివుని అర్ధాంగివి, అయిన ఓ ఈశ్వరీ నీకు నమస్కారము.

పరమేశ్వరి అన్ని జీవుల యందు ఉన్నది. ఏరూపంలో ఉన్నది అంటే – బుద్ధిరూపంలో ఉన్నది. 'బుద్ధే – ఆత్మ'. అని వేదాంత గ్రంథాలు చెబుతున్నాయి. ఓ తల్లీ! ధారణశక్తికి మూలమైన బుద్ధివి నువ్వే. నీవే సరస్వతివి. చదువును ఇచ్చే దేవతవు. శాస్త్ర పాండిత్యాన్నిఇచ్చేదానవు. వేదవేదాంగాలు. ఉపనిషత్తుల పరిజ్ఞానాన్ని ఇచ్చే దానవు. ఇహానికీ, పరానికీకుడా పనికివచ్చే ఈ విద్యను ఇచ్చే తల్లివి. జ్ఞానదేవతవు.

**యా కుందేందు తుషారహార ధవళా యాశుభ్రవస్త్రాన్వితా**
**యా వీణావరదండమండిత కరాయాశ్వేత పద్మాసనా**
**యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిః దేవై సదావందితా**
**సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా ॥**

ఆవిడ సరస్వతీదేవి. చదువుల తల్లి. ఆవిడే జ్ఞానప్రదాయిని. తెల్లని రంగులో ఉంటుంది. తెల్లని వస్త్రాలను ధరిస్తుంది. తెల్లని గంధం పూసుకుని, తెల్లని పద్మంలో కూర్చుని ఉంటుంది. తెల్లని హంస ఆమె వాహనం.

**శ్వేతపద్మాసనా దేవీ శ్వేత గంధానులేపనా**
**అర్చితాముని భి స్సర్వైః ఋషిభిః స్తూయతేసదా ॥**

అటువంటి సరస్వతీదేవి ఎల్లరకు బుద్ధినిస్తుంది. సరస్వతీదేవికి పన్నెండు పేర్లు ప్రసిద్ధమైనవి.

ప్రథమం భారతీనామా ద్వితీయం చ సరస్వతీ ।
తృతీయం శారదాదేవీ చతుర్థం హంసవాహనా ॥
పంచమం జగతీఖ్యాతం షష్ఠం వాగీశ్వరీ తథా
కౌమారీసప్తమం ప్రోక్తామష్టమం బ్రహ్మచారిణీ ॥
నవమం బుద్ధిధాత్రీ చ దశమం వరదాయినీ
ఏకాదశం క్షుద్రఘంటా ద్వాదశం భువనేశ్వరీ ॥

ఇందులో తొమ్మిదవ పేరు 'బుద్ధిధాత్రీ'! బుద్ధిని ఇచ్చేది. సర్వజీవులకు బుద్ధిని ప్రసాదించే దేవీ. ఓ పరమేశ్వరీ! ఆ దేవి నువ్వేనమ్మా.

అంతే కాదు తల్లీ! నీవే సంపదవు. సంపదనిచ్చే దానవు. మానవుల దరిద్ర్యాన్ని పోగొట్టి వారికి సిరిసంపదలు ఇచ్చే దానవు. లక్ష్మీ అష్టోత్తరంలో 72వ నామము 'దారిద్ర్యనాశిని'. 102వ నామం 'దారిద్ర్యధ్వంసిని'. నీవే లక్ష్మీదేవివి. నీవే శివపత్నివి. ఇక్కడ దేవతలు అంటున్నారు : ఓ తల్లీ ! నీవే సరస్వతివి, నీవే లక్ష్మీదేవివి. నీవే శివుని అర్ధాంగి అయిన కాళివి. అంటే మహాకాళి, మహాలక్ష్మి, మహాసర్వతుల స్వరూపం నువ్వేనమ్మా. అటువంటి ఓ పరమేశ్వరీ! నీకు నమస్కారము.

**సర్వస్వరూపే! సర్వేశే! - సర్వశక్తి సమన్వితే**
**భయేభ్య స్త్రాహి నో దేవి! - దుర్గే! దేవి! నమో ఽస్తుతే ॥**

సర్వస్వరూపము గల దానవు, సర్వానికీ పాలకురాలవు, సర్వశక్తి సమన్వితవు అయిన ఓ దుర్గాదేవీ! నీకు నమస్కారము. ఓ తల్లీ! మమ్మల్ని భయంనుంచి కాపాడవలసినది.

108 ఉపనిషత్తులలోనూ అమ్మవారిని గురించి చెప్పేవి ఎనిమిది. వీటిని 'దేవీ ఉపనిషత్తులు' అంటారు. అవి :

1. త్రిపురోపనిషత్తు 2. త్రిపురతాపివిఉపనిషత్తు 3. దేవీ ఉపనిషత్తు 4. బ్రహ్వృచోపనిషత్తు 5. భావనోపనిషత్తు 6. సరస్వతీ ఉపనిషత్తు 7. సీతోపనిషత్తు 8. సౌభాగ్యలక్ష్మీఉపనిషత్తు.

వీటిలో మూడవది 'దేవీపనిషత్తు'. అందులో దేవతలందరూ పరమేశ్వరిని సమీపించి "ఓ మహాదేవీ! నీ వెవరవు?" అని అడుగుతారు.

దానికి ఆ దేవి "నేను బ్రహ్మ స్వరూపిణిని. నావలన ఈ ప్రకృతి పురుషాత్మకమైన జగత్తు - సృష్టించబడింది. శూన్యము నేనే. శూన్యము కానిది నేనే. ఆనందము నేనే. ఆనందముకానిది నేనే. జ్ఞానము, అవిజ్ఞానము నేనే. తెలుసుకోదగిన బ్రహ్మను నేనే. పంచభూతాలు, అఖిల జగత్తు నేనే. వేదము, అవేదము నేనే. విద్య, అవిద్య నేనే. క్రింద, పైన, అడ్డము, నిలువు అన్నీ నేనే. రుద్రులతోను, వసువులతోను, ఆదిత్యులతోను, విశ్వేదేవతలతోను సంచరిస్తూ ఉంటాను. మిత్రావరుణులు, ఇంద్రాగ్నులు, అశ్వనీదేవతలు, వీరందరినీ నేనే భరిస్తాను. సోముడు, త్వష్ట, పూషభగుడు, విష్ణువు, వామనుడు, బ్రహ్మ, ప్రజాపతి వీరందరినీ నేనే ధరిస్తాను. ఈ విషయాలు తెలుసుకున్నవాడు దేవీ పదవిని పొందుతాడు. అనగా పరబ్రహ్మలో లీనమవుతాడు" అని చెబుతుంది.

ఈ జగత్తంతా ఆమె రూపమే. లలితాసహస్రంలోని 402వ నామము 'విద్యాఽవిద్యాస్వరూపిణి'. విద్య, అవిద్య - రెండింటి స్వరూపము ఆమెయే. ఈ జగత్తంతా ఆమె స్వరూపమే. కొండలు, బండలు, పర్వతాలు, శిఖరాలు, లోయలు, నదులు, సముద్రాలు, అడవులు, చెట్లు, చేమలు, 84 లక్షల రకాలైన జీవరాశి అంతా ఆమే. అంతేకాదు పంచభూతాలు, తన్మాత్రలు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, దేవతలు, గంధర్వులు, యక్షులు, కిన్నెరలు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, అంతా ఆమె స్వరూపమే. అందుకే అంటున్నారు దేవతలు "ఓ దేవీ! నీవు సర్వస్వరూపము గలదానవు" అని.

ఇంకా అంటున్నారు : "తల్లీ! నీవు సర్వపరిపాలకురాలవు." లలితా సహస్రంలో రెండవనామము 'శ్రీమహారాజ్ఞీ' అంటే లోకాలన్నీ పాలించే మహారాణీ! అని అర్థం. దీన్ని గతంలో వివరించాం. 'నీవు సర్వశక్తి సంపన్నురాలవు'. ఉపనిషత్తులు చెబుతున్నాయి. "ఆ పరమేశ్వరుడు సర్వశక్తి సంపన్నుడు. లోకంలో ఎవరూ అతని ఆజ్ఞను మీరటానికి లేదు. పరబ్రహ్మ ఉన్నాడనే భయంతోనే గాలి సవ్యంగా వీస్తున్నది. సూర్యుడు సరిగా ప్రకాశిస్తున్నాడు. దిక్పాలకులు తమపని తాము చేస్తున్నారు" అందుచేతనే పరమేశ్వరిని సర్వశక్తి సంపన్నురాలు అంటున్నారు దేవతలు. అటువంటి ఓ దేవీ భయాలనుంచి మమ్మల్ని రక్షించవలసినది.

**ఏతత్తే వదనం సౌమ్యం - లోచనత్రయభూషితమ్**
**పాతు నః సర్వభూతేభ్యః - కాత్యాయని నమోఽస్తుతే ॥**

ఓ దేవీ! కాత్యాయనీ! మూడుకనులచేత ప్రకాశిస్తూ ప్రసన్నంగా ఉండే నీ ముఖ పద్మము సర్వభూతములనుండి మమ్ము రక్షించుగాక! సౌందర్య లహరిలోని 48వ శ్లోకం

**అహస్సూతే సవ్యం తవ నయన మర్కాత్మకతయా**
**త్రియామాం వామం తే సృజతి రజనీనాయకతయా**
**తృతీయా తే దృష్టిర్దరదళిత హేమాంబుజరుచిః**
**సమాధత్తే సంధ్యా దివస నిశయో రంతరచరీమ్ ॥**

ఓ దేవీ! నీ కుడికన్ను సూర్యుడు, ఎడమకన్ను చంద్రుడు, మూడవనేత్రం సంధ్యాస్వరూపముగా ఉన్నాయి. అంటున్నారు శంకర భగవత్పాదులవారు. అటువంటి ఆ దేవి నేత్రాలు మమ్ములను సర్వదారక్షించుగాక అని ప్రార్థిస్తున్నారు దేవతలు.

**జ్వాలాకరాళ మత్యుగ్ర - మశేషాసురసూదనమ్**
**త్రిశూలం పాతు నో భీతే - ర్భద్రకాళి! నమోఽస్తుతే ॥**

భయంకరగా ఉండి, మిక్కిలిపదునై, రాక్షసుల చీర్చి చెండాడే త్రిశూలం గల ఓ భద్రకాళీ నీకు నమస్కారము.

ఇక్కడ కాళీ రూపంలో ఉన్న దేవిని స్తుతి చేస్తున్నారు.

**శవారూఢాం మహాభీమాం ఘోరదంష్ట్రాం హసన్ముఖీం**
**చతుర్భుజాం ఖడ్గముండ వరా భయకరాం శివాం ॥**
**ముండమాలా ధరాందేవీం లలజ్జిహ్వాం దిగంబరాం**
**సదాచింతయేత్కాళీం శ్మశానాల యవాసినీం ॥**

శ్మశానవాసియైనది, నాలుగుచేతులయందు ఖడ్గము, శిరస్సు, వరద, అభయముద్రలు ధరించినది, పుర్రెలపేరును మాలగా ధరించినది, భయంకరమైన కోరలు గలది అయి శత్రుసంహారం చేసే కాళీస్వరూపంలో ఉన్న ఓ పరమేశ్వరీ నీకు నమస్కారము అంటున్నారు.

**హినస్తి దైత్యతేజాంసి - స్వనే నా పూర్య యా జగత్**
**సా ఘంటా పాతు నో దేవి! - పాపేభ్యోఽనః సుతా నివ ॥**

రాక్షసుల పరాక్రమాన్ని హరించేది, తన నాదముతో జగత్తును నిండించునది అయిన నీ ఘంట అన్ని పాపములనుండి మమ్ము కాపాడుగాక !

**అసురాసృగ్వసాపంక - చర్చితస్తే కరోజ్జ్వలః**
**శుభాయ ఖడ్గోభవతు - చండికే! త్వాం నతా వయమ్ ॥**

ఓ చండికా! రాక్షసుల క్రొవ్వు, రక్తము కలిపి బురదగా పూయబడిన, కాంతులు ప్రసరించే నీ ఖడ్గము మమ్ము కాపాడుగాక !

**రోగా నశేషా నపహంసి తుష్టా రుష్టా తు కామా న్సకలా నభీష్టాన్**
**త్వా మాశ్రితానాం న విప న్న రాణాం త్వా మాశ్రితా హ్యాశ్రయతాం**
**ప్రయాంతి ॥**

తల్లీ ! నువ్వు గనక తృప్తి చెందితే మా రోగాలన్నీ పోతాయి. నువ్వు గనక కోపగించావంటే మా కోరికలన్నీ నాశనమవుతాయి. నిన్ను ఆశ్రయించిన వారికి ఆపద కలగదు. అంతే కాదమ్మా! నిన్ను ఆశ్రయించినవారు ఇతరులకు కూడా ఆశ్రయమివ్వ గలుగుతారు.

**ఏత త్కృతం య త్కదనం త్వయా?**
**ద్య ధర్మద్విషాం దేవి! మహాసురాణామ్**
**రూపై రనేకై ర్బహుధాఽఽత్మమూర్తిం**
**కృత్వాంబికే త త్ప్రకరోతి కాఽన్యా ॥**

ఓ తల్లీ! యుద్ధంలో అనేక రూపాలు ధరించి రాక్షస సంహారం చేశావు. ఇలా చెయ్యటం నీకు తప్ప ఇంకెవరితో సాధ్యమవుతుందమ్మా?

**విద్యాసు శాస్త్రేషు వివేకదీపే ష్వాద్యేషు వాక్యేషు చ కా త్వదన్యా**
**మమత్వగర్తేఽ తిమహాంధకారే విభ్రామయ త్యేత దతీవ విశ్వమ్ ॥**

జ్ఞానాన్ని ఇచ్చే వేదవిద్య విద్యయందు, శాస్త్రమందు నీవే ఉన్నావు. ఈ జగత్తంతా మోహాంధకారంలోపడి కొట్టుకుపోవటానికి కారణం నువ్వే నమ్మా.

లలితాసహస్రంలో 416 నుంచి 419 దాకా నామాలు

**చిభక్తిశ్చేతనారూపా జడశక్తిర్జడాత్మికా**

చిభక్తి జ్ఞానమయమైన శక్తివి నువ్వే. జీవులందరిలోనూ చేతనా రూపంలో ఉన్నావు. అలాగే నీవే జడశక్తివి. అంటే ఆత్మ చైతన్యము నీవే. జడమైన జగత్తూ నీవే. అందుకే జ్ఞానాన్నిచ్చే వేదవిద్య ఆమే. అజ్ఞానమైన మోహాంధకారంలో పడేసేదీ ఆమే. జ్ఞానము, అజ్ఞానము రెండూ ఆవిడే. అందుకే దేవతలు ఆ విధంగా అంటున్నారు.

**రక్షాంసి యత్రోగ్రవిషాశ్చ నాగాః యత్రారయో దస్యుబలాని యత్ర**
**దావానలో యత్ర తథాఽబ్ధిమధ్యే తత్రస్థితా త్వం పరిపాసి విశ్వమ్॥**

ఓ తల్లీ! రాక్షసులు, విషసర్పాలు, దొంగలు, శత్రువులు, కార్చిచ్చు, సముద్ర మధ్యమందు నిలిచి నీవు లోకాలను రక్షిస్తుంటావు.

**విశ్వేశ్వరీ త్వం పరిపాసి విశ్వం విశ్వాత్మికా ధారయసీతి విశ్వమ్**
**విశ్వేశవంద్యా భవతీ భవంతి విశ్వాశ్రయా యే త్వయి భక్తినమ్రాః॥**

లోకాలను పాలించే ఓ దేవీ! నీవు లోకాలను రక్షిస్తావు. లోకాలను భరిస్తావు. ఈశ్వరుడు మొదలైన దేవతలంతా నిన్ను ఆరాధిస్తారు. నిన్ను ఆరాధించేవారు లోకాలకు ఆశ్రయం ఇవ్వగలుగుతారు.

**దేవి ప్రసీద పరిపాలయ నోఽ రిభీతే**
**ర్నిత్యం యథాఽసురవధా దధునైవ సద్యః**
**పాపాని సర్వజగతాం ప్రశమం నయాశు**
**ఉత్పాతపాకజనితాంశ్చ మహోపసర్గాన్ ॥**

ఓ దేవీ! రాక్షసుల సంహరించి ఇప్పుడు కాపాడినట్లుగానే ఎల్లప్పుడు మమ్మల్ని కాపాడవలసింది. అన్ని పాతకములను, ఉత్పాతములను త్వరగా శమింప చేయవలసినది.

**ప్రణతానాం ప్రసీద త్వం దేవి! విశ్వార్తిహారిణి**
**త్రైలేకవాసినా మీడ్యే! లోకానాం వరదా భవ ॥**

జగత్తు యొక్క కష్టాలను బాపే ఓ దేవీ! మా యందు ప్రసన్నవు

కావలసినది. ముల్లోకముల చేత ఆరాధింపబడే ఓ దేవీ! లోకాలకు వరాలివ్వవలసినది.

ఈ రకంగా దేవతలంతా పరమేశ్వరిని ప్రార్థించారు. అప్పుడు ఆ దేవి "ఓ దేవతలారా! మీకేం కావాలో కోరుకోండి" అన్నది. అప్పుడు దేవత లంటున్నారు.

**సర్వబాధాప్రశమనం - త్రైలోక్య స్యాఖిలేశ్వరి**
**ఏవ మేవ త్వయా కార్య - మస్మద్వైరివినాశనమ్ ॥**

ఓ దేవీ! ఇప్పటిలాగేనే ఎప్పుడూ ముల్లోకముల దుఃఖములు శమింప చేయవలసింది. మా శత్రువులందరినీ నాశనం చెయ్య వలసింది.

ఆ మాటలు విన్న పరమేశ్వరి చెబుతోంది.

**వైవస్వతేఽంతరే ప్రాప్తే - అష్టావింశతిమే యుగే ।**
**శుంభో నిశుంభశ్చైవాన్యా - వుత్పత్స్యే తే మహాసురౌ ॥**
**నందగోపగృహే జాతా - యశోదాగర్భసంభవా ।**
**తత స్తౌ నాశయిష్యామి - వింధ్యాచలనివాసినీ ॥**

ఓ దేవతలారా! వైవస్వత మన్వంతరంలోని 28వ మహాయుగంలో శుంభ నిశుంభులని ఇద్దరు రాక్షసులు పుడతారు. అప్పుడు నందగోపుని ఇంట యశోదా గర్భాన జన్మించి రాక్షసులను సంహరించి వింధ్య పర్వతాలమీదని వశిస్తాను.

**పున రప్యతి రౌద్రేణ - రూపేణ పృథివీతలే ।**
**అవతీర్య హనిష్యామి - వైప్రచిత్తాంశ్చ దానవాన్ ॥**
**భక్షయంత్యాశ్చ తా నుగ్రాన్ - వైప్రచిత్తా న్మహాసురాన్ ।**
**రక్తా దంతా భవిష్యంతి - దాడిమీకుసుమోపమాః ॥**
**తతో మాం దేవతాః స్వర్గే - మర్త్యలోకే చ మానవాః**
**స్తువంతో వ్యాహరిస్యంతి - సతతం రక్తదంతికామ్ ॥**

కొంతకాలానికి విప్రచిత్త వంశీయులైన రాక్షసులు జన్మిస్తారు. అప్పుడు మళ్ళీ నేను ఆవిర్భవించి భయంకరమైన రూపంతో ఆ రాక్షసులను చంపితినేస్తాను. వారిని తినటం చేత నా పళ్ళు దానిమ్మ పూలలాగ ఎర్రగా

మెరుస్తాయి. అందుచేత లోకంలోని దేవతలే కాదు భూలోకంలోని మానవులు కూడా నన్ను "రక్త దంతిక" అని పిలుస్తారు.

భూయశ్చ శతవార్షిక్యా - మనావృష్ట్యా మనంభసి ।
మునిభిః సంస్మృతా భూమౌ - సంభవిష్యా మ్యయోనిజా ॥
తతః శతేన నేత్రాణాం - నిరీక్షిష్యామి యన్మునీన్ ।
మనుజా వ్యాహరిష్యంతి - శతాక్షీ మితి మాం తతః ॥

మళ్ళీ కొంతకాలానికి వంద సంవత్సరాల పాటు వర్షం పడదు. అందుచేత జనులంతా నీరులేక అల్లాడిపోతారు. ఆ సమయంలో నేను అయోనిజగా జన్మించి మునులందరినీ నూరు కళ్ళతో కాపాడతాను. అందుచేత నను "శతాక్షి" అని పిలుస్తారు.

తతోఽ హ మఖిలం లోక - మాత్మదేహసముద్భవైః ।
భరిష్యామి సురాః శాకై - రావృష్టేః ప్రాణధారకైః
శాకంభరీతి విఖ్యాతిం - తదా యాస్యా మ్యహం భువి ।

దేవతలారా! మళ్ళీ వర్షాలు కురిసే దాకా నాశరీరము నుంచి ఉత్పత్తి అయిన కాయగూరలతో లోకంలోని జనులందరినీ పోషిస్తాను. అప్పుడు నన్ను 'శాకంబరీ' అనే పేరుతో పిలుస్తారు.

తత్రైవ చ వధిష్యామి - దుర్గమాఖ్యం మహాసురం ॥
దుర్గా దేవీతి విఖ్యాతం - త న్మే నామ భవిష్యతి ।

ఆ కాలంలో దుర్గముడు అనే రాక్షసుడు జన్మిస్తాడు. నేను అతణ్ణి సంహరిస్తాను. అందుచేత 'దుర్గాదేవి'గా ప్రసిద్ధి చెందుతాను.

పున శ్చాహం యదా భీమం రూపం కృత్వా హిమాచలే ॥
రక్షాంసి భక్షయిష్యామి - మునీనాం త్రాణకారణాత్ ।
తదా మాం మునయః సర్వే - స్తోష్యం త్యానమ్రమూర్తయః ॥
భీమాదేవీతి విఖ్యాతం - త న్మే నామ భవిష్యతి ।

హిమాలయ పర్వతాలపై మునిజనాలను రక్షించటం కోసం భయంకరమైన రూపం దాల్చి రాక్షస సంహారం చేస్తాను. అప్పుడు మునులంతా నన్ను 'భీమాదేవి' అని స్తుతి చేస్తారు.

**యదాఽ రుణాఖ్య స్త్రైలోక్యే - మహాబాధాం కరిష్యతి ॥**
**తదాహం భ్రామరం రూపం - కృత్వాఽసంఖ్యేయషట్పదమ్ ।**
**త్రైలోక్యస్య హితార్థాయ - వధిష్యామి మహాసురమ్ ॥**
**భ్రామరీతి చ మాం లోకా - స్తదా స్తోష్యంతి సర్వతః ।**

ఆ తరువాత 'అరుణుడు' అనే రాక్షసుడు జన్మించి ముల్లోకాలను బాధిస్తాడు. లెక్కలేనన్ని తుమ్మెదలతో కూడిన భ్రామరి రూపంలో అతణ్ణి సంహరిస్తాను. అప్పుడు జనులందరూ నన్ను భ్రామరి అని కీర్తిస్తారు.

**ఇత్థం యదా యదా బాధా - దానవోత్థా భవిష్యతి ॥**
**తదా తదాఽ వతీర్యాహం - కరిష్యా మ్యరిసంక్షయమ్**

ఈ రకంగా రాక్షసుల వలన లోకాలకు ఎప్పుడైతే బాధ కలుగుతుందో, అప్పుడు నేను జన్మించి వారిని నాశనం చేస్తాను - అని ఆ పరమేశ్వరి దేవతలకు చెప్పింది అంటూ 11వ అధ్యాయాన్ని పూర్తి చేశారు.



# ఫలశ్రుతి

## 12వ అధ్యాయము

పదవ అధ్యాయందాకా శుంభనిశుంభవధను, 11వ అధ్యాయంలో ఇంద్రాది దేవతలు దేవిని చేసిన స్తోత్రము వివరించి ఇప్పుడు 12వ అధ్యాయంలో సప్తశతి పారాయణ వలన వచ్చే ఫలితము ఏమిటో వివరిస్తున్నాడు.

తనను పరిపరివిధాల స్తుతించిన దేవతలతో ఆ పరమేశ్వరి అంటోంది.

"ఎవరైతే సర్వకాల సర్వావస్థల యందు ఈ స్తోత్రాలతో నన్ను స్తుతిచేస్తుంటాడో, అతని యొక్క బాధలన్నింటినీ నేను దూరంచేస్తాను. అలాగే మధుకైటభనధ, మహిషాసుర సంహారము, శుంభ నిశుంభ వధలను పారాయణ చేసిన వారికి, అష్టమి, నవమి, చతుర్దశి తిథులనాడు నా మాహాత్మ్యము పారాయణ చేసిన వారికి ఏ రకమైన పాపము అంటదు. వారికి దారిద్ర్యమురాదు. బంధువర్గముతో వియోగమురాదు.

**శత్రుతో న భయం తస్య - దస్యుతో వా న రాజతః ।**
**న శస్త్రానలతోయౌఘా - త్కదాచి త్సంభవిష్యతి ॥**

శత్రువులవల్లగాని, చోరులవల్లగాని, రాజులవల్లగాని, ఆయుధాలవల్ల గాని, నీటివల్లగాని ఆపదలు రావు.

కాబట్టి నా మాహాత్మ్యాన్ని ఎప్పుడూ పఠించండి వినండి.

**ఉపసర్గానశేషాంస్తు - మహామారీసముద్భవాన్ ।**
**తథా త్రివిధ ముత్పాతం - మాహాత్మ్యం శమయే న్మమ ॥**

ప్రతి రోజూ దేవీ మాహాత్మ్యము చదివిన వారికి వివిధ రకాల అంటు వ్యాధులు, త్రివిధ తాపములు దరిచేరవు అని చెప్పింది. అయితే దీన్ని ఎప్పుడు పారాయణ చెయ్యాలి? అనే సందేహం వచ్చింది దేవతలకు. దానికి సమాధానంగా ఓ దేవతలారా!

**బలిప్రదానే పూజాయా - మగ్నికార్యే మహోత్సవే ।**
**సర్వం మమైత చ్చరితం - ఉచ్చార్యం శ్రావ్య మేవ చ ॥**

బలి ఇచ్చేప్పుడుగాని, పూజల యందుగాని, అగ్ని కార్యం చేసేప్పుడుగాని, మహోత్సవ సందర్భాలలోగాని, ఈ నా మాహాత్మ్యాన్ని పారాయణ చెయ్యాలి.

**శరత్కాలే మహాపూజా - క్రియతే యా చ వార్షికీ ।**
**తస్యాం మమైత న్మాహాత్మ్యం - శ్రుత్వా భక్తిసమన్వితః ॥**

ప్రతి సంవత్సరము శరన్నవరాత్రుల యందు నా మాహాత్మ్యము పారాయణ చేసినవారు పుత్ర, పౌత్ర, ధనధాన్యాదులను పొందుతారు. నిర్భయులవుతారు. నా మాహాత్మ్యాన్ని విన్నవారికి శత్రువు లుండరు. వారికి అన్నీ శుభాలే కలుగుతాయి.

**శాంతికర్మణి సర్వత్ర - తథా దుఃస్వప్నదర్శనే ।**
**గ్రహపీడాసు చోగ్రాసు - మాహాత్మ్యం శృణుయా న్మమ ॥**

శాంతి కర్మలు జరిగేటప్పుడుగాని, చెడుకలలు వచ్చినప్పుడుగాని, భయంకరమైన గ్రహ పీడ గలిగినప్పుడుగాని, నా మాహాత్మ్యాన్ని చదివినట్లైతే, చెడుకలలవల్ల, గ్రహపీడలవల్ల కలిగే బాధలు తీరిపోతాయి. బాలగ్రహాలు వదలిపోతాయి. స్నేహితుల మధ్య వైషమ్యము పోయి సఖ్యత పెరుగుతుంది.

**దుర్వృత్తానా మశేషాణాం - బలహానికరం పరమ్ ।**
**రక్షోభూతపిశాచానాం - పఠనా దేవ నాశనమ్ ॥**
**సర్వం మమైత న్మాహాత్మ్యం - మమ సంనిధికారకమ్**
**పశుపుష్పార్ఘ్యధూపైశ్చ - గంధదీపైస్తథోత్తమైః ॥**

చెడుత్రోవ పట్టినవారి బుద్ధి మారుతుంది. భూత ప్రేత, పిశాచాదులు నాశనమవుతాయి. భక్తులకు ముక్తి లభిస్తుంది. ధూపదీపనైవేద్యములతో చేసే అర్చనల వలన, బ్రాహ్మణ సంతర్పణ వలన, జపహోమాదుల వలన, దానముల వలన, వచ్చే ఫలితము కన్న దేవీమాహాత్మ్యము ఒక్కసారి వింటే వచ్చే ఫలితము ఎక్కువ.

**రక్షాం కరోతి భూతేభ్యో - జన్మనాం కీర్తనం మమ ।**
**యుద్ధేషు చరితం య న్మే - దుష్టదైత్య నిబర్హణమ్ ॥**

యుద్ధంలో దుష్టరాక్షస సంహారం చేసినట్టి నా ఈ చరిత్రను విన్న వారికి శత్రు భయ ముండదు. ఇందులో బ్రహ్మాది దేవతలు చేసిన స్తోత్రాలు మంచి బుద్ధిని ప్రసాదిస్తాయి. ఘోరారణ్యంలోగాని, కారుచిచ్చులోగాని, చోరులమధ్యగాని, శత్రువుల మధ్యగాని చిక్కుకొన్నప్పుడు, క్రూరమృగాల బారిన పడినప్పుడు, రాజాగ్రహానికి గురి అయినప్పుడు, మరణశిక్ష విధించబడినప్పుడు మహా సముద్రమధ్యంలో తుఫానులో చిక్కుకున్నప్పుడు, ఘోరవిపత్తులు కలిగినప్పుడు, దేవీ మాహాత్మ్యాన్ని చదివినట్లైతే, వారి కష్టాలన్నీ తీరిపోతాయి" అని చెప్పి ఆ పరమేశ్వరి అంతర్ధానమై పోయింది.

రాక్షస సంహారం జరగగానే దేవతలకు పూర్వపు బలము, అధికారము వచ్చేశాయి. యుద్ధంలో చావగా మిగిలిన రాక్షసులు పాతాళానికి పారిపోయారు.

ఆ పరమేశ్వరి నిత్యమైనవి. సత్యమైనది. అయినప్పటికీ లోకాలను రక్షించటానికి ఈ భూమి మీద మాటిమాటికీ అవతరిస్తుంటుంది. ఈ జగత్తంతా ఆమెవల్లనే సృష్టించబడింది. ఆమె గనక సంతృప్తి చెందితే తన భక్తులు అడిగిన కోరికలన్నీ తీరుస్తుంది. ఇహము, పరము కూడా ఇస్తుంది. ఆమెయే సృష్టిస్థితి లయకారిణి. మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతుల స్వరూపము.

**స్తుతా సంపూజితా పుష్పై - ర్ధూపగంధాదిభి స్తథా ।**
**దదాతి విత్తం పుత్రాంశ్చ - మతిం ధర్మే గతిం శుభామ్ ॥**

ఆమెకు గనక ధూపదీప నైవేద్యాలు సమర్పించినట్లైతే, ధనధాన్యాలు, భోగభాగ్యాలు పుత్రపౌత్రాదులు అన్నీ కలుగుతాయి. జీవితం శుభమయ మవుతుంది.

అంటూ 12వ అధ్యాయం పూర్తి చేశాడు రత్నాకరుడు.



# సురథ వైశ్యవర ప్రదానము

## 13వ అధ్యాయము

ఋషి చెబుతున్నాడు. ఓ రాజా!

**ఏత త్తే కథితం భూప! - దేవీమాహాత్మ్య ముత్తమమ్ ।**
**ఏవం ప్రభావా సా దేవీ - యయేదం ధార్యతే జగత్ ॥**
**విద్యా తథైవ క్రియతే - భగవద్విష్ణుమాయయా ।**

ఇంతవరకు శ్రేష్ఠమైన దేవీ మాహాత్మ్యాన్ని నీకు వివరించాను. ఆమె ఎవరో కాదు. పరమేశ్వరుని యొక్క మాయ. ఆమెయే లోకాలను సృష్టి చేస్తున్నది. ఆ మాయవల్లనే అనిత్యమైన అశాశ్వతమైన ఈ జగత్తు శాశ్వతము, నిత్యము అనుకుంటున్నారు. అందుచేత మీరిద్దరూ (సురథుడు, సమాధి) ఆ దేవతను పూజించండి. ఆవిడే మీకు భోగము మోక్షము కూడా ప్రసాదిస్తుంది అన్నాడు.

ఆ మాటలు విన్న సురథ వైశ్యులు ఋషికి నమస్కరించి, దీక్ష తీసుకుని నియమనిష్టలతో దేవీ సూక్తాన్ని పఠిస్తూ, అమ్మవారిని ధూపదీప నైవేద్యాలతో మూడు సంవత్సరాల కాలము అర్చించారు. అప్పుడు ఆ పరమేశ్వరి వారి భక్తికి సంతసించినదై మీకు ఏ వరంకావాలో కోరుకోండి అన్నది. ఆ మాటలు విన్న రాజు “ఇప్పుడు శత్రువుల వలన అపహరించబడిన రాజ్యమంతా తిరిగి నాకు రావాలి. జన్మజన్మలకీ ఆ రాజ్యం నా అధీనంలోనే ఉండాలి” అన్నాడు. వైశ్యుడు మాత్రం “రాగద్వేషాలను దూరం చేసి నాకు జ్ఞానాన్ని ప్రసాదించవలసింది” అన్నాడు.

అప్పుడు ఆ పరమేశ్వరి “ఓ రాజా! కొద్ది రోజులలో నీ కోరిక ప్రకారము నీ రాజ్యము నీకు లభిస్తుంది. మరుజన్మలో సూర్యుని కుమారుడవై ‘సావర్ణి’ అనే పేరుతో ఈ భూమి మీద మనువువు అవుతావు. ఓ వైశ్యుడా! నీ కోరిక ప్రకారము కొద్ది రోజులలోనే నీకు ఆత్మ సాక్షాత్కారము కలుగుతుంది” అని చెప్పి అంతర్ధానమైంది.

ఏవం దేవ్యా వరం లబ్ధ్వా - సురథః క్షత్రియర్షభః
సూర్యా జన్మ సమాసాద్య - సావర్ణి ర్భవితా మనుః
సావర్ణి ర్భవితా మనుః క్లీం ఓం ॥

పరమేశ్వరిచేత వరము పొందిన సురథుడు అనే ఆ రాజు మరు జన్మలో సావర్ణి అనే పేరుగల మనువైనాడు. సమాధి అనే వైశ్యుడు సాయుజ్యం పొందాడు.

అంటూ 13వ అధ్యాయాన్ని పూర్తిచేశాడు.

దేవీ మహాత్మ్యము అనేది సామాన్యమైనది కాదు. దాన్ని చదివటమేకాదు విన్నప్పటికీ కూడా ఫలితం వస్తుంది. మానవుడికి కష్టాలు దాపురించినప్పుడు 'సప్తశతి' పారాయణ గనుక చేసినట్లైతే ఆ కష్టాలు తొలగిపోతాయి. రాజ భయము, శత్రుభయము, చోరభయము లాంటివి ఉండవు. సప్తశతి పారాయణ చేసిన వారిని ఆ పరమేశ్వరి కరుణిస్తుంది. వారి ఇంట లక్ష్మి తాండవం చేస్తుంది. వారికి సిరిసంపదలు, భోగభాగ్యాలు పుష్కలంగా లభిస్తాయి. ఈ లోకంలో అన్ని రకాల సుఖాలను అనుభవించి, చివరి కాలంలో ఆ పరమేశ్వరి సన్నిధి చేరుతారు.

కాబట్టి భక్తులందరూ సప్తశతి పారాయణ చేసి, దాని వ్యాఖ్యను చదివి లేదా విని పరమేశ్వరి కృపకు పాత్రులు కావాలని ఆశిస్తూ

సర్వేజనాః సుఖినోభవంతు

ఓం తత్సత్